# శ్రీరమణస్థాన్

చాలం

(కృష్ణాపత్రికనుండి పునర్ముద్రితము)

వాహినీ పబ్లిషింగ్‌హౌస్,
విజయవాడ-2.

# శ్రీ రమణస్థాన్

## (చలం లేఖలు)



కృష్ణాపత్రికలో ధారావాహికంగా వెలువడి,
ఆంధ్ర పాఠకలోకాన్ని సంచలన పరచిన ఈ లేఖలు
**శ్రీ మండువ జగ్గారావుగారికి**
వ్రాయబడినవి.

I

02144

# ముందుమాట

ధనం, కీర్తి, పదవి వున్నవారితో పరిచయం చేసుకోడానికి ప్రతి ఒక్కరూ ఇష్టపడతారు. కాని చలంలాంటి సత్యాన్వేషకుడూ, సహృదయుడూ, సాహితీపరుడూ చందా సన్మానాలకి, మొహమాటపు పొగడ్తలకి విముఖత చూపేవాడూ, నిర్మల హృదయంకల ఎవరితోనయినా, సంఘ బహిష్కృతుడు అయినా, మనసిచ్చి ప్రేమించి మాట్లాడగలడు. అందుకే సాటి సాహితీ సామ్రాట్టులకు చలమంటే, అంత అసూయా, భయం

చలాన్ని చదివి, తెలుగునాడులో ఇంతటివాడు ఒకడున్నాడా ! అని ఆశ్చర్యంతో, సంతోషంతోవున్న జగ్గారావు చలాన్ని కలుసుకున్నాడు 1946 లో. అప్పటినుంచి తెలిసివున్నా ఈ ఉత్తరాలపుట్టుక 1958 నుంచి.

ఈ పదహారేళ్ళ పరిచయంతో జగ్గారావు చలం జీవితంలో సంభవించిన ప్రతి సంఘటనని, సంఘ దుమారాలని, సాహిత్య విమర్శలని పరిశీలించి, విమర్శించి, నిజాన్ని బైటికి తెచ్చిన ఉత్తరాలు యివి.

ఉత్తరాల్లో ఇరువురి హృదయాల స్పందన, సత్యంకోసం పడే బాధా, ఆతృతా ప్రతి పదంలోనూ ప్రతి ఫలిస్తున్నాయి. ఇద్దరికీ పరిచయస్తుణ్ణయిన నాతో, శ్రీ చలంగారు 'జగ్గూభాయ్‌కి రాసినలేఖలు చాలా గొప్పవి. ముఖ్యమైనవని' చాలాసార్లు అన్నారు.

జగ్గారావుకి ఒక్క సాహిత్యపుహోదా లేకపోవచ్చు... ....అంత మాత్రాన జగ్గారావు ప్రతిభని శంకించడం కేవలం వాళ్ళ అజ్ఞానానికీ, కీర్తికాంక్షకీ నిదర్శనం. కాని ఒకటి నిజం జగ్గారావులో ఆ కీర్తి కండూతి లేకపోబట్టే, ఈ లేఖలు వాస్తవికతకు ఇంత దగ్గిరగావున్నాయి. చలంగారిది ఒక గొప్ప Divine gift- తెలుగులో అంత గొప్ప శైలి ఇంతవరకూ రాలేదు, ఇక ముందు వస్తుందని నమ్మకమూలేదు. చలంగారి మహోజ్వల జ్వాలా సమన్విత భావాలచుట్టూ శలభాల్లా గిలగిల గింజుకుంటూన్న కువిమర్శకులూ, ఆ జ్వాలాతేజః కిరణపుంజాల్లో ప్రకాశిస్తున్న

సహృదయులైన పాఠకులూ ఆయన గొప్పతనానికి వెతకనవసరంలేని నిదర్శనం. జగ్గారావు, చలంగారినుంచి వచ్చిన ఈ లేఖల్ని, ఈ నాడు ప్రచురణకు తీసుకరావడం, తనకు వచ్చే కీర్తికోసంకాదు. చలంగారి మనస్తత్వం, జీవితాన్వేషణా ఫలితం ఈ సమాజానికి తెలియచేయడానికి.

ఈ ఉత్తరాలు పుట్టుటకు కారకుడై, వీటిని సాహిత్య లోకానికి అలంకరణగా సమర్పిస్తున్నందుకు జగ్గారావు ఎంతయో అభినందనీయుడు.

తాంధ్ర కూర్మారావు.



అంకితం

శ్రీ రమణాస్థాన్‌లో వున్న

అమ్మకు

భక్తితో సమర్పణ

# శ్రీ రమణాస్థాన్

## 1

శ్రీరమణస్థాన్
6—4—58.

జగ్గారావు గారికి,

మీ నుంచి ఉత్తరం- మీ పేరు జ్ఞాపకంలేదు కాని మీరు జ్ఞాపకం లేకేమి!

లీలగారు చచ్చిపోయినారు. తెలుసా మీకు? మీరు చదివిన ఉత్తరాలలో ఏం వ్రాసానో నాకు జ్ఞాపకం లేదు.

అవును నాకు డబ్బులేదు. ఆస్తిలేదు. కాని - నాకు అప్పులేదు. కొదవలేదు.

ఎట్లాగో సుఖంగా జరిగిపోతోంది. దేనికీ యిబ్బంది అనేది లేదు. నా అవసరాలు చాలా తక్కువ. అవి గడచి పోతున్నాయి.

ఆ ఉత్తరాలు రాసిన నాడు నేనేమన్నా డబ్బుకోసం ఆదుర్దా పడ్డానేమో! కాని యిప్పుడేమీ ఆదుర్దా లేదు. డబ్బులేదు కాని ఆదుర్దాలేదు

ఈ యింటిని ఈశ్వరుడు నడుపుతున్నారు. ఆ సంగతి మీకు 'కవిగా చలం' నించి తెలిసి వుండవచ్చు.

పూర్వం మీ వూరు వర్ణించారు మీరు. ఎంతో అందంకాదూ - కొండలు, సెలయేళ్లూ, తోటలూ, మీరూ

బీదవాగే కదూ ! అందుకనే చలం యింకా జ్ఞాపకంవున్నాడు మీకు.- చలంకోసం ఆదుర్దాపడే హృదయం మీలో సజీవంగా వుంది.

మీ రొక బీదవారు. అందువల్లనే యింకో బీదవాడికి సహాయం చెయ్యాలని కోరిక కలిగింది. పైగా నా పైని ఎంత అభిమానమో ! మీరు డబ్బు యివ్వాలా ! నా కోసం ఒక్క రాత్రి బాధ పడ్డారు. అది చాలదా ! మీవంటి వారి ప్రేమ ఏ కొద్దిమందిదో సంపాయించు కున్నాను. తక్కిన ప్రపంచం నన్ను గౌరవించడం కన్న ద్వేషించడమే నా కెక్కువ సంతోషం.

అవును నే నిక్కడ సాధన చేస్తున్నాను. దానిని యోగాభ్యాసమన్నా తప్పుకాదు కాని అది హఠయోగం కాదు. అంటే ఆసనాలు మొదలైనవి కాదు.

మీ రిక్కడికి వస్తానంటే ఎంతో సంతోషం. పైగా మిత్రులతో కలిసి రావడం మరీ సంతోషం. కాని బాబూ, ఎంత దూరం ! అంత ఖర్చును భరించగలరా ! వచ్చి రెండు రోజులే వుంటా ననడం యిక్కడ మా ఆర్థికపరిస్థితిని తలుచుకుని కాదు కద !

ఇక్కడ నేను వొక్కణ్ణే కాదు. మేమందరం ఇక్కడే వున్నాము. ఒక కుటుంబమంతా.

నా ఆరోగ్యం బాగానేవుంది. అన్నీ సుఖంగా వున్నాయి. అన్నీ ఈశ్వరుడు చూస్తున్నారు.

ఈశ్వరుడంటే, ఈ లోకాల ప్రభువు. తక్కిన వివరాలు మీరిక్కడికి వచ్చినప్పుడు చెప్తాను.

ఈశ్వరుడే మమ్మల్ని కనిపెట్టి వుంటే, నాకు కొదవేముంది?

మీరేమి డబ్బు పంపవద్దు. మీరూ మిత్రులూ రండి.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

## 2

శ్రీరమణస్థాన్
12—8—58.

జగ్గారావు గారికి,

సరిగ్గా మీ ప్రస్తావన వచ్చి మాట్లాడుతో వుండగా మీ వుత్తరం వచ్చింది.

మీకు వీలుకాగానే మీరూ, మిత్రులూ రండి, సరే మీ పెద్ద ఉత్తరానికి ఎదురు చూస్తాను.

పళ్ళకేమి? పంపండి. పంపడానికి ఎక్కువ శ్రమ పడకండి.

ఈశ్వరాశీర్వాదాలతో.
- చలం

# 3

శ్రీరమణస్థాన్
25—8—58.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరం మళ్ళీ తమాషా. మీ సంగతి చిన్నా రావు గారితో మాట్లాడుతో వుండగా మీ ఉత్తరంవచ్చింది. ఆయన మీ కన్నారావు గారిని నూజివీడులో ఎరుగుదురట.

మీరు రాసిన వాటిని పట్టి కన్నారావు గారిపైన ఇష్టంగా వుంది. చదువూ, సమస్యలూ లేక పోవడం ఎంత అదృష్టం. ఆయన గొప్ప స్వభావం చాలదా, ఆయనకి వెలుగివడానికి. ఆయన ఎప్పుడు దర్శనమిస్తారో నావంటివారికి ఇంత దూరన.

నాకు వొళ్ళు బాగాలేదు. ఎక్కువరాయలేను. ఆధ్యాత్మికమైన సందేహాలు రాస్తే. అక్షరాలు స్పష్టంగా రాయండి. నీరసంగా వుంది. ఇంక రాయలేను.

నా పుస్తకాలు ఈనాడు పబ్లిష్ అయిన వాటిలో కొద్దిగా వున్నాయి నా వద్ద. మీకు ముఖ్యంగా యేమి కావాలో రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 4

శ్రీరమణస్థాన్
28—8—58.

జగ్గారావు గారికి,

మీ కార్డు, మీ ఉత్తరమూ రెండూ అందాయి. మీ ఇల్లీ చరిత్ర యెంతో గొప్పగా టచ్చింగ్‌గావుంది. ఆ పిల్లి మీ కేజన్మలోనో ప్రేమాస్పదుడై వుంటాడు.

మా పిట్ట సంగతి మీకు రాసానుకాబోలు. దానివల్ల మీకు మీ పిల్లీ జ్ఞాపకం వచ్చివుంటుంది.

ఎంతో బావుంది. ఉత్తమమైన హృదయం వున్న వారిని తప్ప, జంతువులూ, పక్షులూ ప్రేమించవు.

నా పుస్తకాలు ఎక్కువగా దేశికవితవారే ప్రచురించారు. వారేయే పుస్తకాలిన్ని ప్రచురించారో నాకు సరిగా తెలీదు — కాని పాతపుస్తకాలిన్ని పూర్తిగా ప్రకటించారేమో ననుకుంటాను. నా కథలలో కొద్ది పుస్తకాలే ప్రచురించారు. అవిగాక తక్కిన పుస్తకాలన్నీ వారిదగ్గిర దొరుకుతాయనుకుంటాను

ఇంతకన్న నా పుస్తకాల వివరాలు నాకు తెలీవు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 5

శ్రీరమణస్థాన్
11 – 9 – 58.

జగ్గారావుగారికి,

మీ ముందు ఉత్తరమూ, రెండో ఉత్తరమూ, పళ్ళరశీదూ అందాయి.

ఈ మధ్య నాకు వొళ్ళుబాగాలేదు పదిరోజులనుంచి. నాలుగు రోజులు లేవలేదు. భోజనం లేదు. కనక మీకు వెంటనే రాయలేకపోయినాను. ఇవాళ బాగా నెమ్మదిగా వుంది. కానీ యింకా మామూలుగా కాలేదు.

మా గోరింక సంగతి – రెండు నెలలకిందట కాకులు పొడుస్తోవుంటే రక్షించాము. అప్పటికి పిల్ల; ఎగరలేదు. దాన్ని జాగ్రత్తగా రక్షణచేసి పెంచాము. మిత్రులు దానికి ఫొటోలు తీశారు. గొప్పచేశారు దానికి రెక్కలు వొచ్చాయి. వొదిలేశాం. కానీ మమ్మల్ని విడవలేక మాతోనే వుంటోంది. చుట్టూ చెట్లపైన కూచుని ఆడుకొని తిరిగి వస్తుంది. రేడియో అడిగి పెట్టించుకుంటుంది. తన కిష్టమైన పాటలతో తనూ కంఠంకలిపి పాడుతుంది. షేక్సుపియర్ కవీ, ఠాగూరూ వీరి ఇంగ్లీషు రచనలు ఇష్టం. వాటిని బిగ్గరగా చదివించుకొని, తనూ అట్లాంటి శబ్దాలు చెయ్యాలని చూస్తాడు.

అతనికి ఇష్టంలేనివి చదివితే వచ్చి పొడుస్తాడు ఆపమని.

బత్తాయి పళ్లు బావున్నాయి. అంతకన్న వాటిని పంపిన మీ ప్రేమ ముఖ్యం.

మా కోసం వొచ్చి, మాతో వున్న కురంగేశ్వర్, జగన్నాథం, ఒకటే బత్తాయిరసం తాగి, సంతోషిస్తున్నారు. మీ బత్తాయి రసంతో ఒకరికి జలుబూ, ఒకరికి జ్వరమూ రూపులేకుండా పోయినాయి.

ఇవాళ ఆ పళ్ళతో షరబత్ మార్మలేడ్ చెయ్యాలని చూస్తోంది సౌరిస్.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 6

శ్రీరమణస్థాన్
27 – 9 – 58.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరాలన్నీ ఒక్కరోజే చేరాయి. దాదాపు రెండు గంటలసేపు ఉల్లాసంగా చదువుకున్నాము. ఎంతో బావున్నాయి. నా దగ్గరవున్న పుస్తకాలు పంపాను. నాకు కాపీలు యివ్వరు. ఏం పబ్లిష్ అవుతున్నాయో కూడా నాకు తెలీదు.

నేను మంచిపనిలో ఉన్నానంటే అర్థం, ఉత్తరాలకు జవాబులు రాస్తున్నానన్నమాట. పని చెయ్యవలసిననాళ్లు పని ఎట్లానూ చెయ్యాలి. అది ఈశ్వరసేవే గనక విరాగ ఉత్త

రాలు రాయడానికి సందేహించకండి. ఎవరెవరో పనిలేని వారుకూడా చలం దగ్గరనించి జవాబు తెప్పించుకునేందుకు ఉత్తరాలు రాస్తోవుంటారుకద, మీకేనా జవాబు రాయడానికి నాకు పని ఆటంకం !

1954 తరువాత నేను పుస్తకాలు రాయలేదు. నేనిప్పుడు ఠాగూరుగారి 'గీతాంజలి' తెలుగు చేస్తున్నాను. అదిగాక మా పక్షిరాజ జీవితం రాస్తున్నాను తేదీల ప్రకారం.

'గీతాంజలి' పని పూర్తికావచ్చింది. ఓ 15 రోజుల్లో ప్రెస్సుకి పంపుతాననుకుంటాను.

సుబ్బయ్యగారు రాశారు, చలం జీవితచరిత్ర అచ్చుకి యిచ్చానని. నాకు కాపీలు పంపరు సాధారణంగా. పంపితే మీకో కాపీ పంపేవాణ్ణికద !

సారస్వతం విషయమై మీరు రాసిందంతా నిజం. మీకు చాలా స్పష్టమైన దృష్టివుంది.

ఇతరులకి సహాయం చాలా సహజంగా జరగాలి మననించి. ఆలోచన అడ్డురాకూడదు. నారి కృతజ్ఞతతో మనకి పనిలేదు.

కరుణ అనేది ఎన్నడూ యిరుకున పడకూడదు. "ఆకాశంనుంచి దయగా భూమిపై పడే వాన చినుకులవలె వుండాలి" అంటాడు షేక్స్‌పియర్.

ముందు హృదయంలో కరుణ వుండాలి. ఆ కరుణకి ప్రత్యక్షరూపమే సహాయం.

నా 'గీతాంజలి'ని పుస్తకరూపంగా రాసీండి. దాని ప్రచురణకర్తలు నా మిత్రులే. వారు నాకు కాపీలు యిస్తారు. నేను మీకు పంపుతాను.

'గీతాంజలి' బాగా అర్థమౌతుంది. ఎట్లా చదవాలో, అర్థం చేసుకోవాలో ఉపోద్ఘాతంలో చూపుతున్నాను. అప్పటికీ తెలీనివి మనం కలుసుకున్నప్పుడు మాట్లాడుకుందాం.

పుస్తకాలు పంపుతున్నాను. వాటి పోష్టుఖర్చు సంగతి ఆలోచించకూడదు మీరు. డబ్బుకి నాదైనా సరే మీరింత ప్రాముఖ్యత ఇవ్వకండి. వృథా ఖర్చు చెయ్యకూడదు. సరైన ఖర్చు పెట్టేటప్పుడు ఇంతా అంతా అని చూచుకోకూడదు.

మీ దినచర్య ఎంతో బావుంది. ఎంత సరదాగా చదువుకున్నామో!

పక్షిరాజు బాగావున్నారు. అతని సంగతికూడా దిన దిన చరిత్ర రాస్తున్నాను. కురంగేశ్వర్ చాలా ఫోటోలు తీశారు.

నిన్న అమ్మకానికివస్తే మూడు పిట్టల్ని కొన్నది నర్తకి. ఒకటి చచ్చిపోయింది అప్పుడే.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 7

శ్రీ రమణస్థాన్
5—10—58.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరం. మీ తలనొప్పి తగ్గిందా ? తగ్గకపోతే, మీకు పూర్ణ విశ్వాసముంటే, ఈశ్వరుణ్ణి అడిగి విభూతి పంపుతాను.

మా బుజ్జిగాడు 4 రోజుల కిందట వెళ్ళిపోయి ఇంకా రాలేదు. ఇంక రాడేమో! రెక్కలులేని, రెక్కలు రాని పిట్టలు ఇంకా కొన్ని చేరాయి మా దగ్గిర.

ఒక నెమిలి గుడ్డు దొరికింది. ఇప్పుడు పిల్ల అయింది. కుక్కపిల్లమల్లే మా వెంట తిరుగుతోంది. ఒకగోరింక, మూడు అడవి పిచ్చుకలు రెండు, గిజిగాళ్ళు. రెక్కలురాగానే స్వేచ్ఛ నిస్తాము.

మైనా గోరింకా ? అది స్వేచ్ఛనిచ్చినా మా దగ్గిర ఉంటుందా ? ఉండకపోతే దాన్ని సాంపాదించకండి. పిట్టల్ని బంధించి వుంచం. స్త్రీకి, పిల్లలకిస్వేచ్ఛ కావాలనే చలం. పిట్టల్ని ఆకాశంలో, ఎండలో ఎగిరేవాటిని పంజరాల్లో పెడతాడా ? ఈశ్వరుడు చాలా కోప్పడుతారు.

మైనాలు యిక్కడ బతుకుతాయా ? అయితే ఆ మైనాని తీసుక రావడంకన్న మీరు వస్తారని సంతోషం.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 8

శ్రీరమణస్థాన్
10—10—58

జగ్గారావు గారికి,

మీ ఉత్తరం. కాదు ఉత్తరాలు అందాయి. "భగవాన్ పాదాలముందు" అసలు అర్థం స్ఫురించడం ఒకొక్కప్పుడు కష్టమే. అవన్నీ ఆధ్యాత్మిక సాధనలో అనుభవాలు ఇది, అర్థం కాకపోతే 'గీతాంజాలి' ఏం అర్థమౌతుంది ?

ఏమైతే నేం మీరు సరైన అర్థాలే పట్టుకున్నారు మొత్తంమీద, ఇంకా చిన్న అర్థాలు మనం కలుసు కున్నప్పుడు చెపుతాను.

'గీతాంజలి' పూర్తిఅయింది. పీఠిక రాస్తున్నాను. మూడు పిచ్చికల్లో ఒకటి చచ్చిపోయింది.

బీదవారి బాధల్ని గురించి మీరు రాసిందంతా నిజమే. కాని ఏనాడయినా, ధనవంతుల బాధలు, బీదవారి బాధలకన్న చాలా ఎక్కువ. చలీ వానా, పస్తూ, వారికంత బాధవుండవు. అన్ని రోజుల వానలో పిట్టలూ కీటకాలు, ఏమైపోతారో తెలుచు కోండి.

భగవాన్ ఫొటో అందిందా ?

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 9

శ్రీరమణస్థాన్
14—10—58.

జగ్గారావు గారికీ,

మీ రెండో ఉత్తరం. మీ పేరు పొంగడమూ, వాన హోరు, వీటిపై మీరు రాసింది. మంచి కవిత్వం. మీకు రాయడం చాతకాక పోవటమేమిటి? చాతనయిన కవులే అసహజంగా రాసేది మనం అతి తెలువులకు పోక మనకి ఏది కనబడుతోందో, దాన్ని మన వాడుకైన భాషలో రాశామా, మనకి అందంపైన దృష్టే ఉండాలిగాని, అది ఉంటే మనం రాసేది కవిత్వమౌతుంది. కవిత్వం రాకపోవడానికి కారణం, తక్కిన స్వంత వ్యవహారాలకన్న అందమనేది అధికమైంది. రాకపోవడం.

ఎంతో బావుంది. మీ వర్ణన.

అవును అబ్బాయి వసంత్ వెళ్ళిపోయినాడు. నామీద కాదు కోపం అదొక మిస్ అండర్ స్టేండింగ్.

ఆయన సంగతి ఏమీ తెలియదు.

సౌరిస్‌కి ఏడేళ్ళకిందట ఈశ్వరుడు ప్రత్యక్షమైనారు. ఆనాటినుంచి, ఆమెలోంచి మాట్లాడుతో వుంటారు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 10

శ్రీరమణస్థాన్
19–10–58.

జగ్గారావుగారికి,

మీ ఇల్లీ చరిత్ర బావుంది. మృగాలకి ఎంత తెలివి వుంటుందో చూడండి. ఆ పిల్లికోసమే మీరు కనుక నిద్ర చెరుపుకున్నారుగాని ఎవరు అన్నిసార్లు లేచి వెడతారు. అందువల్లనే ఆ పిల్లికి మీపై అంత ప్రేమ. ఏ ప్రేమా దానిపై చూపక, పిల్లికి మనిషిపై ప్రేమ లేదంటారు మనుష్యులు. ఎన్ని తన్నులుతినీ, మనిషిని కుక్క ప్రేమించినట్టు ప్రేమించదు గనక, పిల్లికి ఆత్మగౌరవం హెచ్చుగనక, పిల్లికి ప్రేమ లేదంటారు స్వార్థపరులైన మానవులు.

భగవాన్ సంబంధమైన పుస్తకాలు పంపుతాను.

ఈ ప్రదేశానికి మీ ప్రదేశానికివుండే అందంలేదు. అరుణాచలమే ఈ ఊరికి అందం. ఆ అందంకూడా ఆత్మకి సంబంధించిన అందం.

బుజ్జిగాడు యింకా రాలేదు.

దీక్షితులుగారు భగవాన్‌లో విశ్వాసం పోగొట్టుకోలేదు. ఎప్పుడూ భగవాన్ చింతలోనే కాలం గడుపుతున్నారు. కాని వారి మార్గమూ పద్ధతులూ వేరు. వారిప్పుడు నర్సాపురంలో ఉంటున్నారు. ఆరోగ్యం దెబ్బతిన్నది.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 11

శ్రీరమణస్థాన్
31–10–58.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరం. మీ ఊరు మునిగిందా బాగావుందా? అనే ఆలోచన. మీ ఊరు మునిగినా మీ రెట్లానూ మునగరు. ఈశ్వరుడు రక్షిస్తారు మిమ్మల్ని. ఈ వరదల హడావిడి ఈ ఏడేనా? ప్రతీ ఏడూ ఈ భయం ఉంటుందా మీ వూరికి.

నేను రాస్తోవుంటే, పిచ్చికవొచ్చి బల్లమీద కూచుని, రాయవొద్దనీ, చంటిపిల్ల మల్లే గోలచేచేస్తోంది. అరుస్తూ కాగితాలు పీకుతోంది. కలాన్ని కరుస్తోంది. ముక్కుతో కొడుతోంది. అక్షరాలకి అడ్డంగా నుంచుంటుంది. వీటికెంత జ్ఞానమో. నా దృష్టి కావాలి, దానికి. ఈ కలం కాగితం ఆటంకమని ఎట్లాగో తెలుసు వాటికి-/ మా పక్షిరాజు తిరిగి రాలేదు.. అతనికి ఆపద రాలేదు. రోజూ మమ్మల్ని దూరం నించి పలుకరిస్తోనేవున్నాడు. షికారు పోతోవుంటే మమ్మల్ని గుర్తించి ఏ చెట్టుమీ దనుంచో పిలుస్తూనే వున్నాడు. అతను ఓ జట్టులో చేరాడు. ఆ జట్టువాళ్ళు అతన్ని రానీరు.

ఇక్కడ వర్షాలు బాధించవు. కురియక బాధిస్తాయి గాని కురిసి బాధించవు

అవునురాశాను మీకు 'గీతాంజలి' ప్రకారం ఈ సృష్టి అంతా ఈశ్వరుడికి మానవుడికి దోబూచులని.

'భగవాన్ పాదాలముందు' విషయమై మీరు రాసినవన్నీ సరైనవే. సరిగా అర్థం చేసుకున్నారు.

మనలోని సత్యమే ముఖ్యంగా మనవి. ఈశ్వరుడికి ప్రియుల్ని చేస్తుంది. ఆ విధంగాచూస్తే ఈ భక్తులమనే వాళ్ళలో అనేకమందికన్న మనమే ఎక్కువ భక్తులము.

'తిరిగి తిరిగి చలం ఈశ్వరుణ్ణి చేరుకున్నాడు' అని విమర్శించే వారికి "చలం ఆ పాత ఈశ్వరుణ్ణి చేరుకోలేదు. మీరందరూ భావించుకునే ఈశ్వరుడు వేరు. చలం కనుకున్న ఈశ్వరుడు వేరు. ఆ ఈశ్వరుడి సంగతి మీకేం తెలీదని" చెప్పండి.

మీనుంచి మళ్ళీ ఉత్తరం లేదు. మీవూరు ఏమయిందో మీరెట్లావున్నారో అని ఆలోచిస్తున్నాను

వారంనుంచి నాకు జరం, జరం, తగ్గిందిగాని నీరసంగా వుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

## 12

శ్రీరమణస్థాన్
3-11-58.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరం, నాకు ఒళ్ళు తేలికయిచ్చింది. కాని యింకా బాగా నీరసంగావుంది.

మీ వూరికి వరద తప్పిందికదా !

మీ చిన్నతనపు చరిత్ర అంతా ప్రతీమాట చదివాను. ఎంతో గొప్పగావుంది. అట్లాంటి చిన్నతనం నాకు కూడా వుండకూడదా అనిపించింది. ఎంత అందమో !

అట్లాంటి అనుభవాలు చిన్నతనంలో కలిగి, అంత జపం చేసినవారిని ఈశ్వరుడు వొదలరు. జీవితంలో ఎప్పుడో తిరిగి పట్టెయ్యబోతున్నారు.

మీ ప్రార్థనవల్ల నా జబ్బు నయమైంది.

మా పిట్టల్ని నాలుగింటినీ వెంటబెట్టుకుని రోజూ షికారు వెడుతున్నాము. ఒక నెమిలిపిల్ల, రెండు పెద్ద పిచ్చికలు, ఒక గోరింక. దారిలో వాటికి నర్తకి చెదలు పెడుతో వుంటుంది.

వచ్చే ఆదివారం నుంచి ఇక్కడ పెద్ద ఉత్సవాలు దీపోత్సవాలు అంటారు. లక్షలాది ప్రజలు వొస్తారు. 25 పౌర్ణమినాడు అరుణాచలం శిఖరంపైన జ్యోతిని వెలిగిస్తారు.

ఈశ్వరాశీర్వాదాలతో

- చలం

## 13

శ్రీరమణస్థాన్

2ు—1 —58.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరం. మీనించి వినక ఎట్లా ఉన్నారోనని అదుర్దాపడ్డాను.

ఈశ్వరుడుని గురించీ, సృష్టిని గురించీ చాలావినీ. చదివీ, కొన్ని అభిప్రాయాలకు వచ్చినట్టున్నారు. అవన్నీ నమ్మకండి. వాళ్ళు చెప్పేవి చాలా వరకూ వాళ్ళ ఊహాలు. ఆ ఊహాలకి ఆధారాలు తక్కువ.

అవును పూర్వపు రాజులు ప్రజల ధనాన్నికొల్లగొట్టి వృధా వ్యయం చేశారు. ఈనాటిపన్నులతో, ఆనాటిపన్నులు పోల్చి చూశారా ?

ఇప్పటి మంత్రులకీ, ఆనాటి రాజులకీ భేదమేమిటి ? ఈ మంత్రుల్ని ప్రజలు ఎన్నుకున్నారా ? ఓట్లుకొని మంత్రులైన వారేకదా ! ఈనాడు ప్రజలడబ్బు ఎట్లా ఖర్చు అవుతుందో, ఎంతవరకూ ప్రజలకు ఉపయోగపడుతుందో గమనించారా ?

అవును ప్రజలు గుడ్డిగానే చేస్తారు పూజలూ, వ్రతాలు.అవిమాన్పితే, పశ్చిమ దేశాల్లోమల్లే దేశభక్తి అని యుద్ధాలకిదిగుతారు. వాళ్ళ నడవడి ఎట్లావున్నా, ఓ దేవుడో దేవతో వుందన్న జ్ఞాపకం ఈ పూజలవల్ల కలుగుతుంది. ఎంతో కొంత భయమన్నా వుంటుంది

చాలా రోగాలు క్రిములవల్ల కలిగేది నిజమే. కాని ఆ క్రిమి అభివృద్ధి, ప్రజాపీడన దేవుడి ఆజ్ఞకి లోబడే జరుగుతుందేమో !

అవును ప్రజలు తమ నడవడిని మార్చుకోవాలి? ఎందుకు సత్యంగా, ధర్మంగా వుండాలి అని ప్రశ్నిస్తే, దేవుడి ఆజ్ఞ అనేదానికి పోవలసిందేకద !

ఈ సంగతులన్నీ మనం వేసంకాలంలో విపులంగా మాట్లాడుకుందాము.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 14

శ్రీరమణస్థాన్
7 – 12 – 58.

జగ్గారావుగారికి,

మీ రెండు ఉత్తరాలూ, మీ యవ్వనం ఎంతో ఆకర్షంగావుంది - తప్పదు మీకు అరుణాచలవాసం. మీ ఉత్తరాన్ని చాలా సరదాగా చదివాను.

ఇంక మీ పిల్లికథ సంగతి.

1. నా పిట్టకథ నేను రాయడమేగాని అచ్చవుతుందని రాశానా? నాకేమీ తెలీదు. అచ్చు సంగతి సందేహాస్పదమే.

2. ఎవరేనా అచ్చు వేస్తామంటే, మీ పిల్లికథ సంగతి చెబుతాను – వారేమంటారో !

3. పిట్టనీ పిల్లినీ ఓ పుస్తకంలో పెడితే పిల్లి పిట్టని తినదా ?

4. ఏమయినా అచ్చు సంగతి తరవాత చూద్దాము ముందు మీ పిల్లికథని పుస్తకరూపంలో రాసివుంచండి.

వీలైతే ఫోటోలు తీయండి. తక్కిందది ఈశ్వరేచ్ఛ.

మీరు ఒమర్ ఖయ్యామ్ సంగతి ఏదో అడిగేరు. జ్ఞాపకంలేదు. మళ్ళీ రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 15

శ్రీరమణస్థాన్
16—12—58.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరం. అవును చిన్నారావుగారుకూడా రాశారు మిమ్మల్ని కలుసుకున్నట్టు.

'గీతాంజలి'కి నేను ఓ పీఠిక రాశాను. దానితో కలిపి చదివితే, ఇంకా బాగా అర్థమౌతుంది. ఏ గీతానికి ఆ గీతమే గొప్పది.

అక్కడినుంచే మాతో అంతగా కలిసారే మీరు, ఇంట్లో ప్రతివారితోనూ. ఇంక ఇక్కడికి రాకుండా ఎట్లా నిలవగలరు? అయినా వస్తున్నారుగా

అవును, దేవుడి పేరుచెప్పి చాలా మోసాలు జరుగుతాయి. బీదవారికి ఏ సహాయమూ జరుగదు. కాని ఎన్నడన్నా దరిద్రులపై కనికరంవొచ్చి వారితో హృదయం కలపగలిగేది ఈ ఈశ్వరభక్తులే. ఏదోరకం భక్తిగలవారే, మూఢభక్తి ఐనాసరే కాని ఆ భక్తిలేని నవనాగరికులు గొప్పకి చందాలు వెయ్యడం తప్ప వారివల్ల ఏ సహాయమూ జరుగదు. ఎంత సహాయం, ఏం సహాయం చేశామనేది

కాదు ముఖ్యం. మన హృదయం ఎంత మెత్తపడ్డది ? ఎంత వరకు వారితో ఐక్యం కాగలిగింది ? అనేది.

సుబ్బయ్యగారి 'చలం' సంగతి, ఆయన చాలాపరిశ్రమ చేసి రాశారు. సుబ్బయ్యగారి జీవితమూ అభిప్రాయాలూ, అభిరుచులూ చలం వాటికన్న చాలాభిన్నం. అయినావాటిని అతిక్రమించి చలాన్ని అర్థం చేసుకోవాలని చాలా ప్రయత్నిం చేరు. అంతవరకే మనం ఆనందించాలి.

చార్వాకుడి సంగతి నాకేం తెలీదు.

ఉమర్ ఖయ్యాంసంగతి నాకేంతెలీదు. అతని 'రుబాయత్' అనే పుస్తకమే జగత్ ప్రసిద్ధమైనది. దానినే 'ఫిట్జ్ రాల్డు' అనేఆయన ఇంగ్లీషుచేశారు సుమారు150 ఏళ్ళకిందట. ఇంగ్లీషు 'రుబాయత్ అసలు రుబాయత్ కన్న చాలా గొప్ప దట. తెలుగులో కొందరు రాశారు, రుబాయత్'ని కాని, నేను చూసినంతవరకూ అసహ్యంగా వున్నాయి. మీరు రాశాక ఇంగ్లీషు రుబాయత్ ని చలం తెలుగు (వచనం) చేస్తే బావుండును అనిపిస్తోంది. కాని జరగదేమో అది.

ఉమర్ ఖయ్యాం గీతాలకి మల్లేనే. అంతరార్థం ఎట్లా వున్నా గొప్పకవిత్వం లోకపు రహస్యాన్ని ఎంతో లోతుకి చూసి గట్టిగా ప్రశ్నించిన కవి. వేదాంతి, మేధావి అతను.

మీ పిల్లి వొచ్చిందా ?

మీ పిల్లికథ తప్పకుండా రాసి మీకు వచ్చేటప్పుడు తీసుకుని రండి.

భాష ఉత్తరాల్లో భాషగానే రాయండి. మీకు ఆలో చన లేకుండా ఏ విధంగా మాటలువస్తే ఆ మాటలే రాయండి.

ఎందుకంటే

మీ ఉత్తరాల్లో వాక్యాలకి ఓవింత అందమూ, బలమూ వున్నాయి. చాలా సహజంగా వుంటాయి.

ఈవేళ మీ రెండో ఉత్తరం అందింది. మీ యింటి చుట్టు పక్కల వర్ణన ఎంతో బావుంది. మీతో నేను కొన్నాళ్ళు అక్కడ వుండకూడదా ?

పూర్వం మీరు మమ్మల్ని విడిచి వెళ్ళిం తరువాత నాకు ఉత్తరాలు రాస్తూవున్నట్టయి తే నేను వచ్చేవాణ్ణి కాని ఇప్పుడు రానుకద ! మీవూరిఅందం చూడటానికి.

మీరు ఈ ఊరువస్తే మీ ఊరి గొప్ప అందం మీకు కనబడదు. కాని మేము వుండేస్థలం అందం. కాని ఈ అందం కంటికి కనబడే దానికన్న ఆత్మకి ఎక్కువ తెలుస్తుంది. ఈ అందంలో లోపలి శాంతి ఎక్కువ వుంటుంది.

మీ పిల్లికథ తప్పకుండా రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 16

శ్రీరమణస్థాన్
19—12—58.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరాలు. ప్రతీదానికి జవాబు రాస్తూనే వున్నాను.

మీ కుచ్చో, దిబ్బాలు అనే పేర్లు అద్భుతంగా ఉన్నాయి. వాళ్ళతో ఆటలు ఎంతో బావున్నాయి. వాళ్ళిప్పుడు ఎక్కడికి వెళ్ళారు?

'చలం' చరిత్ర ఖరీదు 10 రూపాయలకు పెంచారని వినికిడి. ఆ పుస్తకం ఎప్పుడు బైటికి వస్తుందో తెలీదు.

మీ రమణప్పగారి సంగతివినడానికి ఎంతో అందంగా వుంది.

ఆధ్యాత్మిక సాధన సాగడ మనేది ఈశ్వరానుగ్రహం. ప్రతీవాడూ చెయ్యలేడు. కానీ అనుగ్రహందొరికిందా, వృద్ధాప్యంలోనే కాదు. ఏ వయసులో నైనా చెయ్యవలసిందే. అట్లా చెయ్యని అతను దురదృష్టవంతుడు. ఎందుకంటే ఆధ్యాత్మికానుభవం అన్ని అనుభవాల్ని మించింది. జీవితానికి గమ్యస్థానం ముందునుంచీ చేస్తే తప్ప, వృద్ధాప్యంలో సాధన కుదరదు. మనసూ, శరీరమూ, దుర్బలమౌతాయి. చాలా శక్తి సామర్థ్యాలు కావాలి దేహ పటుత్వం కావాలి సాధనకి. వృద్ధాప్యంలో సాధనలు చేస్తామంటారే అదంతా ఏవో వేదాంత గ్రంథాలు చదువుకుంటూ కూచోవడం. వేదాంత చింతన, ఆ చింతన చేసేవారికి, ఆ జన్మలో ఏమీ

దొరకదు. ఆధ్యాత్మిక సాధన వేరు. ఈనాడు చేస్తున్నానంటే, అది ఈశ్వరుడి ప్రత్యేకానుగ్రహం. కైశోరయవ్వనంలో ఆసనాలు ప్రాణాయామం, సూర్య నమస్కారాలు చాలాకాలం చేసిన వాడిని.

'గీతాంజలి' అచ్చుకి ఇవ్వబోతున్నారట. బుజ్జిగాడి చరిత్ర ఒకమిత్రుడు అచ్చు వేయించుకుంటారట.

మీ రొంపా తలభారం తగ్గాయనుకుంటాను.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

## 17

శ్రీరమణస్థాన్
3—1—59.

జగ్గారావు గారికి,

జయంతిరోజు మిత్రులు వచ్చారు. చింతా దీక్షితులు గారుకూడా వచ్చారు.

అవును ఉమర్ ఖయ్యాం రుబాయత్ గొప్పపుస్తకం. అవును మీరు రాశారే ఆ గీతం రుబాయత్ లోనిదే.

ఏమో ఎవరు చెప్పగలరు? ఈశ్వర ఆజ్ఞ ఐతే నేనే తెలుగు చేస్తానేమో!

ఆవులకి గడ్డి వెతుకుతో, మనుషులకి వడ్లు వెతుకుతో చాలా హడావిడిగావుంది ఇంట్లో.

కురంగేశ్వర్ ఆయన ఊరికి వెళ్ళేరు.

నాకు చిన్న తలనొప్పి ఇవాళ

రేపటెల్లుండిలో గొ॥ వెం॥ సు॥గారు, వజీర్ రహ్మాన్ వస్తారని చూస్తున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

# 18

శ్రీరమణస్థాన్
7—1—59.

జగ్గారావు గారికి,

ఇప్పుడు ఇవాళ ఇక్కడ ముగ్గురు అతిథులు. వారిలో ఒకరు సంగీతరావుగారు. మీకు బాల్యమిత్రులు, సహాధ్యాయులు. జ్ఞాపకం వున్నారా?

రెండోవారు బూర్జనుంచి యాళ్ళ జవహర్‌లాల్. జవహరు మిమ్మల్ని త్వరలో మీ ఊళ్ళో కలుసుకోబోతున్నారు.

పైగా ఇవాళే మీ పార్శిలుకూడా వచ్చింది వాళ్ళకి వాళ్ళ స్వగ్రామాలు జ్ఞాపకం వొచ్చేందుకు.

మూడో ఆమె అమ్మాయి. జవహరు మిత్రురాలు. ఈ మిత్రులతో సందడిగా వున్నాము. వీళ్ళు వెళ్ళగానే కొత్తవారు వొస్తున్నారు.

ఉత్తరాలన్నీ మూటకింద పేరుకున్నాయి. జవాబులు రాయడానికి తీరికలేదు.

ఈ చలికాలం ఎట్లావుంది. మీ దేశం? మీ యేరు? మీ పిల్లి ఏమంటోంది?

మీతో ఆడుకునే ఇద్దరు పిల్లలూ తిరిగ వొచ్చారా?

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 19

శ్రీరమణస్థాన్
16 – 1 – 59.

జగ్గారావుగారికి,

మీ వుత్తరం. ఈపాటికి జవహర్ మిమ్మల్ని కలుసుకుని వుంటాడు. సంగీతరావుగారు ఘంటసాల అనే సినిమా మ్యూజిక్ డైరక్టర్ కింద హార్మోనియస్టుగా పనిచేస్తున్నారు. చేతి సంగీతం సినిమాకీ, కంఠసంగీతం ఈశ్వరుడికీఅర్పించారు.

మీరు సంతోషమైన వారిలో ఒక రనుకున్నాను. పేకాటలో బాధ మర్చిపోవచ్చంటారు. ఎందుకు బాధ?

నాకు విశాఖపట్నంలో పార్వతీపురంలో మిత్రులున్నారు వాళ్ళ పేర్లు కావాలా?

మీరు చీట్లపేక మానెయ్యడంవలన కష్టించే ప్రజలకేం ఉపకారం జరుగుతుంది? బహుశా రేపు మళ్ళీరాస్తాను.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 20

శ్రీరమణస్థాన్
17 – 1 – 59.

జగ్గారావుగారికి,

మళ్ళీ ఇవాళ మీ కార్డు. మీకు సంక్రాంతి సుఖంగా గడిచిందనుకుంటాను. పనివిషయమై మీదృక్పథం నాకుసరిగా కనిపించటంలేదు. పని చేసినా, చెయ్యకపోయినా, అది మీ అభివృద్ధికోసమే. మీరు కష్టించడం వల్ల ఏం ప్రయోజనం? పోనీ పిల్లలతో, వంటతో, విరామంలేని ఓ కుటుంబానికి సహాయపడండి, వంటచేసిపెట్టి. కాని వాళ్ళందరూ పనిచేస్తున్నారే అని మనమూ పనిచెయ్యనక్కర్లేదు. మీరన్నట్లు పని అనేది దురదృష్టమే. ఐతే మీరు ఆదురదృష్టాన్ని పట్టించుకోవడంవల్ల ఎవరికి ఉపకారం?

నా జీవితంలో పండగని ఏనాడూ పాటించలేదు. గారెలు తినాలనిపించినప్పుడే పండగరోజు.

కుటుంగేశ్వరరావుకి రేపు రాస్తాను ఉత్తరం అప్పుడు మీరురాయమన్నది రాస్తాను.

ఇప్పుడు పశువులు వున్నాయిగనక వాటికి పండగ చెయ్యమన్నారు ఈశ్వరుడు – అందుకని వాటికి పండగ చేశాము.

రాజుల చిక్కుడు పండించడానికి ప్రయత్నిస్తాను.

మీ ఉత్తరాలకోసం ఎదురుచూస్తున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో
– చలం

# 21

శ్రీరమణస్థాన్
4—2—59.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరం. ఎంతో సరదాగావుంది. కాని జవాబు రాసేందుకు ఏంలేదు. అయినా ఒకటి రెండు విషయాలు రాస్తాను, జవాబు రాసిన తృప్తికై, అదిమీకు ఉపయోగించ వచ్చు.

'చలం' ప్రెస్సులోనించి బైటికివొచ్చాడు. మీకు కన బడ్డాడా? ప్రెస్సులో నలిగిన ఆ రూపం మీకేమన్నా నచ్చిందా?

అనుకోకుండా కురంగేశ్వర్ ఇక్కడికి వొచ్చేశాను, ఆ తెలుగు దేశంనించి—ఆ మనుషుల్ని, మోసాల్ని భరించ లేక ఇంక ఇప్పట్లో ఇక్కడనించి కదలరేమో! మీరు రమ్మంటున్నారని ఆయన వూరికి అప్పుడే రాశాను. ఇప్పుడు మళ్ళీ చెపుతాను.

ఆయనని మీరు ఇక్కడే కలుసుకోడం.

మామిడిచెటు ఇక్కడా పుయ్యలేదు.

పోనీలెండి తాంద్రలేకపోతే! ఏమీ డిజప్పాయింట్ మెంట్ లేదు. మా డిజప్పాయింట్ మెంటల్లా, చైత్రంలో మీరు రాకపోతే.

మా పకపక ఎప్పుడన్నా పెళ్ళి చేసుకుంటే ఒక 50 రూపాయిలతో పూర్తిచెయ్యడం సాధ్యంకాదేమో! ఒకవంద రూపాయిలన్నా ఖర్చు చెయ్యాలేమో అనుకుంటాను. ఎందు

కంటే పకపకకి వేరే డబ్బులేదుగా! నానించే తీసుకోవాలి, పెళ్లిఖర్చుకి

అవును. మీ బాధ నాకు తెలుసును. ఈ ఉత్తరంతో మరీబాగా తెలిసింది.

మీరు రాసే మనుషుల్ని చూడాలని వుంటుంది. చిన్నేసును ఎట్లా చూస్తాను? ఎప్పుడూ చూడడం పడదు.

అవును. దేశానికి బీదతనం బాధే. కానిబీదతనంలోనే కొన్ని సుగుణాలు, భక్తి, నమ్రత, నమ్మకం, న్యాయం వుంటాయి. సుఖంగా వున్నవారిని చూడండి, వాళ్ళకేమన్నా తృప్తివుందా? వారిలో న్యాయం వుందా? మోసంతో ఇతరుల్ని దోచుకోవడమూ ఇట్లాంటివి ఎక్కువవాళ్ళలో. మీకేం సుఖాన్నిచ్చింది మీ ఆస్తి! అందువల్ల బీదతనము వాంఛనీయమని కాదు. రాత్రి తిండికి ఏలాగో కష్టపడి సంపాయించుకోవడంలో వుండే ధైర్యం, తృప్తి ధనవంతుడి కెక్కడుంది?

అవును. ప్రజలు అల్పులు, మూర్ఖులు, నీచులు. బీదవారిని చూసి, వ్యాధిగ్రస్తుల్ని చూసి, ఎట్లా సానుభూతి చూపుతామో, బాధపడతామో, ఈ నీచుల్నిచూసి అట్లానే జాలిపడాలి. అయితే బీదవారివలె వీరు మన జాలినీ, సానుభూతినీ తీసుకోరు. కనకనే వారి ఎడల దయగా, స్నేహంగా వుండడం కష్టం – ఏ జీసస్‌కో, బుద్ధుడికో తప్ప.

అవును. చలం మీరన్న పనులే చేశాడు. కారణం ఏమిటో పూర్తిగా తెలీకపోయినా, మూర్ఖత్వం బాధ అనీ, దాంటోంచి మేల్కొని విశాలం కావడమే మనిషి కర్తవ్యమనీ రాశాడు. ఎదగడం, నేర్చుకోడం, కళ్ళు తెరవడం,

బాధా, అశాంతీ ఎక్కువయ్యేమాట నిజమే. కాని ఆ బాధ లోంచి శాంతి తెచ్చుకోవాలిగాని, నిద్రపోయే శాంతి ఒక శాంతి కాదన్నాడు.

ఆనాడు చలం చెప్పిన మాటలన్నీ, ఈనాడు చలం తెలుసుకున్న ఆధ్యాత్మిక సత్యంద్వారా నిజమౌతున్నాయి.

నిజమైనదీ, ఎన్నటికీ చెడనిదీ, ఇంకేమీ కోరనిదీ, ఈ అధ్యాత్మిక శాంతి వొక్కటే. ఇది అందుకునేవరకు ఏ శాంతీ రాదు మానవుడికి ఈ ఆధ్యాత్మికానందం, నిద్రపోతో, మామూలుగా బతికేవారికి కలలోకూడా తోచదు. తపనపడి, జీవితంలో కాలిపోయినవారికే కనపడుతుంది. జీవితపు బాధల అర్థమే ఇది. మనుష్యుల్ని ఈశ్వరుడివేపు తిప్పడానికి.

కనక మీరు తప్పకండా అరుణాచలంవారు. కాల యాపన చెయ్యక, ముందు ఇక్కడికి వచ్చి, ఈ వాతావరణం మీకు ఎట్లావుంటుందో చూడండి.

అరుణాచలంలో నివాసం వుండిపోకండనే అరుణా చలంవారైన మనుష్యులు, లోకమంతా వున్నారు.

భయపడకండి. లెక్కలు చూసుకోండి. సాహసించి ఉరికేవారికే స్వర్గద్వారం. మీకా ధైర్యమూ శక్తీ వున్నాయి కనకనే మీకు రాస్తున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 22

శ్రీ రమణస్థాన్
8—2—59.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరాలు మూడూ అందాయి. 'చలం' పుస్తకం బైటికి వచ్చిందికదా! మీకు కాపీ అందేవుంటుంది. చదివారా? ఎట్లావుంది?

మీ మతిమరుపు సంగతి చాలా సరదాగా వుంది.

ఆధ్యాత్మిక సాధన అంతా మనని మనం మరచిపోవడానికే. మతి మరుపు కలిగినప్పుడు, మన మతి ఎక్కడవుందనేదే ముఖ్యవిషయం. మన ఆలోచనలు ఎక్కడోవుండి, చివరికి ఎక్కడా లేకుండా ఐపోతాయి. అప్పుడూ ఆనందం

రాజుల చిక్కుడు గింజలు ఏకాలంలో, ఏ నెలలో నాటాలి?

సజీవరచన సంగతి నా అభిప్రాయం 'కవిగా చలం'లో వుంది.

మీరు ప్రజలకి ఆనందం అన్నారు; అనగానే ఏ ప్రజలు? ఆనందమంటే ఏమిటి? అనేకమందికి అనేక విధాలైన ఆనందాలు కావాలి. ఇట్లాంటి ప్రశ్నలెన్నో బైలుదేరతాయి. మనని ఎదురు ప్రశ్నించేవారు లేకపోతే, మనం ఇష్టంవొచ్చిందంతా మాట్లాడవచ్చు. ఇదీ ఈనాటి రేడియో వక్తలలక్షణం.

ప్రవక్తలు చెప్పనీ, ఎవరు చెప్పనీ, అసలు సత్యాలని కొన్నివున్నట్లు కనబడతాయి. అవి మానవుడికి ఏకాలానికీ వర్తిస్తాయి. అవన్నీ చైత్రమాసంలో మాట్లాడుకుందాము.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 23

శ్రీరమణస్థాన్
12-2-59.

జగ్గారావుగారికి,

మీ 'రామాయణమూ' ఉత్తరమూ, కవరు చిరిగిపోయి ఈవూరు చేరింది. పోస్టాఫీసువారు ఇంకో పెద్దకవరులో పెట్టి పంపారు. చాలా పనిగావుండి మీ 'రామాయణము' ఇంకా చదవలేదు.

ఆధ్యాత్మిక సాధనకి మొదటిమెట్టు గురువుకి సంపూర్ణంగా అర్పించుకోడం. ఇప్పుడు చలాన్ని గురువుగా భావించి అర్పించుకోడమంటే, ఈశ్వరుణ్ణి గురువుగా తీసుకుని అర్పించుకోడ మన్నమాటే.

మీ ఉత్తరంలో ప్రతీభాగమూ, సూనృతంతో, వివేకంతో, దృఢనిశ్చయంతో రాశారు.

వొస్తున్నారుగా! ఇంక రెండు నెలలు. అప్పుడు అన్నీ మాట్లాడుకుని, కార్యక్రమం ప్రారంభిద్దాము.

మీవంటి నిశ్చయపరులకు ధృఢమనస్కులకి తప్పకుండా ఆధ్యాత్మిక శాంతి, ఆనందాలు దొరుకుతాయి అని నా నమ్మకం.

మీ కేం సందేహం అక్కర్లేదు. మీ జీవితవిశేషాలు, మీరు రాస్తున్నవి చదువుతున్నకొద్దీ నిశ్చయంగా తెలుస్తోంది, మీరు ఆధ్యాత్మికపరులని.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 24

శ్రీరమణస్థాన్
20 – 2 – 59.

జగ్గారావు గారికి

మీ ఉత్తరం, రైలుతోవలోనించి. అవును మంచిపని చేశారు. ఓ రెండురోజులువుంటే, మీకూ తృప్తిలేదు, మాకూ తృప్తిలేదు.

అవును—చలాన్ని గురించి మీ రీ ఉత్తరంలో రాసిన ప్రతి అక్షరమూ సత్యం. గో॥ వె॥ సు॥ గారికి అంతలోతైన దృష్టిలేదు. కాని పాపం! చాలా సిన్సియర్‌గా ప్రయత్నించారు. శాయశక్తులా! అందరూ ఆయనకృషికి సంతోషిస్తున్నారుగాని, ఎవరూ తృప్తి పడటంలేదు.

మీరు వేసిన ప్రశ్నలన్నీ సరైన ప్రశ్నలు. ఆశ్చర్యం ఏమిటంటే, ఈ విద్యావంతులకీ, పండితులకీ, చలంతో ఎన్నో ఏళ్లు స్నేహం చేసినవారికీ, చలంపైనా, అతని రచనలపైనా అమితమైన గౌరవమూ, భక్తీకలవారికి తోచని, కనబడని సత్యాలు చలాన్నిగురించి, మీకు అంత దూరంనించి కనపడ్డాయేనని!

మీ ఉత్తరం చదివి "జగ్గారావుగారే చలం చరిత్ర రాస్తేనా!" అనుకున్నాను. కాని సాధుడేడీ! అని సందేహంవొచ్చింది. కానీండి చలం చరిత్ర జగ్గారావుగారిది ప్రచురించబడే రోజు ఎక్కువదూరంలో లేదు. ఈశ్వరానుగ్రహం.

మీరూ 'చలంకథ' చెప్పడానికి ఆలోచిస్తో వుండండి. పుస్తకాల్లోంచి విషయాలు సంతరిస్తోవుండండి. ఏనాటికేది జరుగుతుందో, ఎవరికెరుక!

కొన్ని 'చలం' ప్రతులలో చలంపైన రాజమన్నారుగారి వ్యాసంలేదు. మీ కాపీలో ఉందా? లేకపోతే నాకు రాయండి.

చలంపైన ఆ పుస్తకంలో ఇతరులు రాశేరే అవికూడా చలాన్నిగురించి రాసినవి కావన్నారు. ఎంతగొప్ప చేశాగ చలాన్ని! నే నెరిగినంతవరకు ఏ ఇంగ్లీషు రచయితనికూడా, షేక్సుపియర్‌నీ, టాగూర్నికూడా ఎవరూ అట్లా పొగడలేదు.

ఇంక ఏ వ్యాసుడిమీదో ఎవరన్నా రాయగలిగితే, అంతకన్న గొప్పచేయవలసిందే! కాని ఇతరులెవరూ చాలరు. మీరేమో వారికికూడా చలం తెలీలేదంటున్నారు.

అవును. పొగిడినవారిలో కొందరు ఎందుకు పొగుడుతున్నారో తెలీదు.

చలం రచనల్నేగాని, ఆ రచనల్ని రగిల్చిన చలం జీవితం సంగతి ఎవరికి తెలుసు? తెలుసుకునే యత్నమేలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో.

— చలం

# 25

శ్రీరమణస్థాన్
26—2—59.

జగ్గారావు గారికి,

ఇవాళ మీ ఉత్తరం, మీ 'రామాయణం' చదివాను. చాలా ఇన్టరెస్టింగ్‌గావుంది. ముద్దుకృష్ణ రాసిన 'అశోకం' అనే నాటకం చదివారా? చలం రాసిన 'సీత అగ్ని ప్రవేశం' అనే నాటిక చదివారా? కొందరు రామాయణ కథకి జీవుడు, పరమాత్మ ఇట్లాంటి అర్థాలు చెబుతారు. ఇట్లాంటి కథనే 'ఇలియడ్' అని 'హోమర్' అనే గ్రీకుకవి రాశాడు.

అవును. తిరుపతి సంగతి మీరు రాసిందంతా నిజమే. నిజమైన భక్తికలవారు తిరుపతి దేవుణ్ణి ఖర్చులేకుండానే చూడవచ్చునేమో! పూర్వంవలె నడిచి కొండకు వెళ్ళవచ్చు. ధర్మదర్శనంతో స్వామిని చూడవచ్చు.

ఆశగొన్న ధనికులు ఎక్కువగా రావడంవల్ల డబ్బు దేవుడు అనవఖర్లేదుగా! జుట్టు ఎంతో చవక. అదేకదా ఆ దేవుడు కోరేది? ఆశలకొద్దీ, భయంకొద్దీ ఆ దేవుడికి డబ్బు చెల్లించుకుంటే ఆ దేవుడి తప్పేముంది?

మీ వర్ణన, ఖండనా, చాలాబలంగానూ, ఉన్నాయి. నిజంగానూ వున్నాయి. కురంగేశ్వర్‌కి జరంగావుంది, మీ ఉత్తరం ఇచ్చాను మీరు చాలా బిజీగా ఉన్నట్టున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 26

శ్రీరమణస్థాన్
2 – 3 – 59.

జగ్గారావు గారికీ,

మీ కార్డు—అందరి భావకన్నా మీ భాష పటుత్వ మైనది. ఏమీ భయపడకండి.

రాజమన్నారు గారి ఉపోద్ఘాతం దొరికేవిధం లేదు. నేను రాశానుగా, ఆ పబ్లిషరుచేసే మోసం! దబాయించండి, కోర్టుకి వెడతానని, వారు విడి కాగితాలు ఇస్తానని చెప్పి,ఎగ కొట్టారు నాకు.

ఈశ్వరుడు ఒక జ్ఞానం కాదు, అనుభవం. హృదయానికేగాని, మనసు కెరుకపడరు. చెప్పేందుకు, వినేందుకు ఏదీ లేదు. చెప్పగలిగిందేదో టాగూరుగారు చెప్పేశారు

మీరిక్కడికి చేరుకోకముందే నా 'గీతాంజలి' కాపీ మీకందించగలనని నమ్మకం.

మీ రమణ పెళ్లి ప్రయత్నాలన్నీ ఈశ్వరుణ్ణి తలుచుకుని ప్రారంభించండి అలసిపోయినప్పుడల్లా ఈశ్వరుణ్ణితలుచుకోండి. "ఇదంతా నీపనే ప్రభూ, ఈ పనులు నా చేత తొందరగా చేయించి, నన్ను నా దగ్గరికి పిలుచుకో" అని.

ఇక్కడ నీళ్ళకరువు. మీరు వచ్చేటప్పటికి ఎట్లా వుంటుందో! అయినా మీరు కష్టనష్టాలకి సిద్ధమయే వస్తున్నారు కదా !

ఏ పని కాని ఈశ్వరార్పణమని, మీ పనిగా కాక, ఈశ్వరుడి పనిగా చెయ్యడం ముఖ్యమైన సాధన.

అసలు సాధన సంగతి నేనేమి రాయలేను ఎవరిస్థితిని బట్టి ఆయా వారికి సాధనలు నిర్ణయిస్తాడు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో
– చలం

## 27

శ్రీరమణస్థాన్
10 – 3 – 59.

జగ్గారావుగారికి,

మీరు రాసిన ఉత్తరాలన్నీ అందాయి. చలాన్ని మీరు అందరికన్న ఎక్కువ అర్థం చేసుకున్నారనిపిస్తుంది, మీ రెండు ఉత్తరాలూ చూస్తే.ఎంతో గొప్పగా ఉన్నాయి. అప్పుడే కురంగేశ్వర్ వాటికి బొమ్మలువేశారు. చలం యుద్ధ రంగమని.

ఇవాళ మళ్ళీ మీ ఉత్తరం. కవులిన్ని గురించి మీరు రాసింది బావుంది.

16 తారీఖున పకపక పెళ్లి చేసుకుంటోంది. ఖర్చునేది లేకుండా.

పార్వతీశంగారిని కలుసుకోవడం ఆయనగురించి వినడం, చాలా సంతోషంగా వుంది.

నేను ప్రస్తుతం మంచి పనిమీద ఉన్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో
– చలం

## 28

శ్రీరమణస్థాన్
24—8—59.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరాలు రెండు.

'గీతాంజలి' తెలుగువారికి నచ్చలేదు. మీరు ఆచివర వున్నారుగా, మీరు తెలుగువారుకాదు, నేనూకాదు. అందుకనే 'గీతాంజలి' అంటే మనకంత ఇష్టం.

మీకూ, వీరేశలింగం గారికీ ఇద్దరికీ నచ్చింది.

ఎందుకు? మీరు పండితులూకాదు. గొప్పవారూ కాదు, భక్తులమని గర్వమూ లేదు గనక.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

## 29

శ్రీరమణస్థాన్
26—3—59.

జగ్గారావు గారికి,

ఇక్కడ ఇవాళ మునిసిపల్ వోట్ల హడావిడి మీ వూళ్ళో మీ రమణ పెళ్ళి హడావిడి.

మీరు పెళ్ళికి వెడితే మీ పిల్లి ఎట్లావుందో !

దిబ్బాలు, కుబ్జో ఇద్దరూ పెళ్ళికి వచ్చేరా? అల్లరికి ఎంతవీలు.

ఇంక మీ బాధ్యతలు తీరినట్లేకదా !

చినార్నరావు, ప్రసాద్‌గార్ల ఉత్తరాలు తప్పకుండా ప్రచురించాలనుకుంటే, ఇద్దరూ ప్రచురించ శక్తికలవారే ననుకుంటాను.

ఈశ్వరుడిపై భారంవేసి, మీరు వారిని ప్రోత్సహిస్తే, ఆ పని జరుగుతుందనుకుంటాను.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 30

శ్రీరమణస్థాన్
8-4-59.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరం. పెళ్ళి సలక్షణంగా జరిగిందనీ, మీరు మీ వూరు తిరిగివొచ్చారనీ, మీ ఇల్లీ పిల్లలతోసహా సురక్షితంగా ఉందనీ అనుకుంటాను.

రమణమ్మగారికి భగవాన్ ఫొటో పంపుతాను. మీరు అరుణాచలం వచ్చివేయడానికి ఏ అభ్యంతరమూ చెప్పని రమణమ్మగారి ఆత్మ గొప్పదై వుండాలి.

సాధన తీవ్రంగా ఉంటుందని భయపడకండి. ఈ సాధన అపూర్వం. ఎవరినిబట్టి, వారికి సాధన మారుతూవుంటుంది. మాంసాహారం, కారం మానడం ఒకటే ముఖ్యమయింది. కారంమసాలా ముఖ్యంగా మానాలా? అంటారేమో కాని ఇవన్నీ అప్పుడేకాదు. ఏ నియమంపెట్టినా దానిని పాటించ గల శక్తి ఈశ్వరుడు ఇస్తోనేవుంటాడు. మీరు చదివిన

పుస్తకాలలో సాధనకీ, ఈ సాధనకీ సంబంధంలేదు. ఇది గురువు ఎదుట నిలిచి, అవసరాన్నిబట్టి రోజునించి రోజుకి రోజుకి మార్చే సాధన.

మీరు వచ్చినప్పుడు పందిళ్ళన్నీ వేద్దాము.

గొప్పవారికి ఎవరికి 'గీతాంజలి' నచ్చలేదు. మీ కెట్లానచ్చిందో వినాలనివుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 31

శ్రీరమణస్థాన్
27–4–59.

జగ్గారావు గారికి,

మీ రెండు గొప్ప ఉత్తరాలూ చేరాయి. ప్రస్తుతం ఓ పుస్తకం తెలుగుచేస్తున్నాను. అదికాగానే ఈశ్వరుడి ముందు మీ 'రుబాయత్' విషయం ఉంచుతాను. అంత కన్నా గొప్ప పుస్తకాన్ని తెలుగు చెయ్యమని ఆజ్ఞ అయింది. 'రుబాయత్' ఎంత? ఒక్క వారంరోజులపని!

ఓమర్ పడ్డ బాధపడ్డవాడు తప్ప ఎవరు తెలుగు చెయ్యగలరు ?

అందులో, ఆ సుబ్బారావుగారి కవిత్వానికీ, ఆ 'రుబాయత్'కీ ఎంత దూరమో! వాళ్ళందరూ ఘరానా కవులు. దేశానికి ముద్దుబిడ్డలు వారికేం తెలుసు ఓమర్ బాధ !

తొరలో ప్రారంభిస్తాను. బాగా వస్తోందో లేదో. ఈశ్వరానుగ్రహం.

మీ దగ్గిరవున్న రుబాయత్ లు తీసుకురండి.

మీ ఒక్క ఉత్తరం చాలు. గీతాంజలి తెలిగించిన సంతోషానికి ప్రతిఫలం.

మీ వ్యాఖ్యానాలు సూటిగావున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 32

శ్రీరమణస్థాన్
11 – 6 – 59.

జగ్గారావు గారికి.

మీ మొక్కలు బాగానే యెదుగుతున్నాయి. డాలి మాట ప్రకారం నీళ్ళు పోస్తోనేవుంది. ఇవాళేచెయ్యివాచింది.

మీ ఉత్తరాలన్ని ఒక కవరులోనే అందాయి. మీరు వెళ్ళాక నాచూపు అంటే, చదివేచూపు పూర్తిగాపోయింది. కనక ఉత్తరాలు చదవడం కష్టం. రాసేటప్పుడు, వొచ్చిన ఉత్తరాలు ఎదుట పెట్టుకుని కాని జవాబు రాయలేను.

మీకు ఈశ్వరుడిచ్చిన మంత్రం గట్టిగా జపించండి. అదే మిమ్మల్ని నడిపిస్తుంది.

ఇంకా నీళ్లు లేవు. మరీ అడుక్కిపోతున్నాయి. వొచ్చే నెలలో ఇద్దరు యువకులు ఇక్కడ సాధకులుగా చేర్తామని రాస్తున్నారు.

మూడు రోజులకిందట కనకమ్మగారు వెళ్లారు. వారితో అతిథులు ఆఖరు. ప్రస్తుతానికి.

పిట్టలు, పిల్లలు అందరూ బావున్నారు. కీకీ జరంపడి

లేచిండి. హీరా (నెమలి) పిల్లల్ని పొడుస్తానని బెదరిస్తోంది. రంగ (చిలక) అన్నిటినీ కొరికిపెడుతోంది, తన సొంత వొంటిని తప్ప. గిన్నెల్నికూడా చిల్లుపడేటట్టు కొరికేట్లుంది.

బుజ్జాయి బాగా పాలిస్తోంది. దుర్గ గంతులేస్తోంది.

ఇక్కడి వాతావరణం. ఈశ్వరుడి శిక్షణా, మా మనసుల్ని ఏనాటికానాడేగానితక్కింది మరచిపోయేట్టు చేస్తాయి. కాకా, కిట్టూ, తండ్రిపేరన్నా ఎత్తరు మేము ఎత్తినా అర్థం కానట్టు చూస్తారు. అట్లా కాకపోతే, మేమందరం. మీరు వస్తామని మీ వెంటపడి వుండమా ?

వెళ్ళగానే మీకు పంది మాంసం దొరికిందా ?

మీ రేదో మా అతిథ్యానికి థాంక్సు అంటో రాస్తే కొత్తగావుంది. మీరీ ఆశ్రమంలో వొకరు. మేమేదో విడి అయినట్టూ, మీ కేదోఅతిథ్యమిచ్చి నట్టూరాస్తా రేం ?మంచీ, చెడ్డా, కూడా మన అందరిదీనీ అట్లా చూసుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 33

శ్రీరమణస్థాన్
12—6—59.

జగ్గారావు గారికి,

వరుసగా మీ ఉత్తరాలన్ని, మీ ఇల్లీ సంగతులు ఎంత గొప్పగావున్నాయో.

'రుబాయత్' తయారయింది. నా చెవికి గొప్పగా వుంది. ఒకటి రెండు గీతాల్ని పోస్టులో చదివి గంతులేస్తున్నారు వజీర్ రహ్మాన్, ఎంతో గొప్పగా వుందని. ఈశ్వరుడు చివరి దిద్దుళ్ళు చేస్తున్నారు. దాని కాపీ తీయించి పంపుతాను మీకు త్వరలోనే.

ఎక్కడా వర్షం లేదు.

డాలీ చెయ్యివాచీ నీళ్ళు పొయ్యడం లేదు. ఇప్పటి వరకు చిక్కుడు మొక్కల్ని రక్షించగలిగాము. ఇంకపూర్తిగా ఈశ్వరుడికి వొదిలేస్తున్నాము.

మా శక్తికి మించింది.

'రుబాయత్' బావుంది నాకు. బావుందని ఈశ్వరుడూ వొప్పుకున్నారు.

ఇంక అలవాట్ల సంగతి.

1. మీరు ధీరులు. జయించగలరు.

2. కాని ప్రజాభిప్రాయం, ఏ అలవాటునైనా ఒక్కసారి మానాలిగాని, క్రమక్రమంగా మానడం అసాధ్యమని.

3. ఏమైనా ఈశ్వర సహాయంతో దేనినైనా సాధించడం సులభం. ఇక్కడైనాసరే, అక్కడనించైనాసరే.

కనక అలవాట్లు పోలేదేలని మీరు అక్కడే ఆగిపోనక్కర్లేదు.

మానలేకపోతే మీరు నిరుత్సాహ పడకండి.

1. ఈశ్వరుడిలో విశ్వసించండి.

2. ఏం జరిగినా ఆయనవల్లనే జరుగుతోందని గమనించండి !

3. జపం చెయ్యండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 34

శ్రీరమణస్థాన్
23 – 6 – 59.

జగ్గారావుగారికి,

రోజూ మీ ఉత్తరం. కళ్ళు బాగాలేవు. ఉత్తరాలు చదివి వివరంగా రాయడానికి వొంట్లో చురుకులేదు.

తక్కిన నా టాగూరు తర్జుమాలా ? వాటిని ఎవరు అచ్చువేస్తారు.

మీ ఉత్తరాలు ప్రతిరోజూ. నా చూపు సరిగాలేదు. నా వొళ్ళు బాగా వుండటంలేదు. నేనేం రాయలేను.

జపం అంటే ఈశ్వరుడు చెప్పిన మంత్రాన్ని చెయ్యడమే.

మీరు చాలా ధీరంగామానేస్తున్నారు అలవాట్లన్నీ. అట్లాంటివారికి ఈశ్వర సహాయం వుండకపోతే ఎవరికి వుంటుంది ?

త్వరలోనే మీ బాధలు మాయమౌతాయి. కొద్దికాలం భరించండి.

శ్రీ రమణస్థాన్

26—6—59.

మీ ఉత్తరం. సన్నని వాన, ముసురు. నాకు చీదర. కాని నా ఆరోగ్యమూ, చిక్కుడు మొక్కలూ సంతోషంతో తలలెత్తాయి.

జవహర్ నిన్నరాత్రి వొచ్చాడు. మీరు పంపిన చక్కని చెప్పులిన్ని తీసుకొచ్చాడు. ఎంత శ్రద్ధో మీకు.

జపం చెయ్యండి.

మీ బాధలు తగ్గాయా ?

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 35

శ్రీ రమణస్థాన్
27—6—59.

జగ్గారావుగారికి,

మీరు నాటిన చిక్కుడు తీగెలు పైకిసాగాయి. మీ ప్రశ్నలకి సమాధానాలు

రామ్మూర్తి చచ్చిపోయినప్పుడు అతని ఇద్దరు కూతుళ్ళూ మాతోనే వున్నారు ఇంక వారు నా పిల్లలే అనుకున్నాను. కాని వారి తల్లివచ్చి పిలిచింది. వెడతా మన్నారు. అటు తరవాత వారు సుఖంగా వున్నారని విన డమేగాని, మాకేం తెలీదు. ఆ తల్లి డాక్టరు.

'మాలపిల్ల' కథ నేను రాసిందే. చివర అంతా మార్చారు.

'గాంధినగర్' నేనురాసిందే. సంభాషణలుమాత్రమే. సినిమా రచనకు నన్నెవరూ ప్రోత్సహించలేదు.

టాగూరుగారిని ఓ రెండు నిమిషాలు రైల్లో దర్శించేను, సారిస్ ఉత్సాహంపైన. ఆయన మా యింటిపక్కకి వచ్చినా నేను చూడలేదు అంతకుపూర్వం.

ఆకాశరామన్న ఉత్తరాలు తిడుతో వొచ్చేవి. నేను వాటిని చదవలేదు. కాని అటువంటి పనులు చాలా స్వల్పం. తిట్టేవారు నా మొహంమీదే తిట్టేవారు. రాయవలసిన అగత్యమేముంది?

యూనివర్సిటీకీ, గవర్నమెంటుకీరాశారు. మీటింగులు చేసి పిటీషన్లు పెట్టారు నాపైన. ముఖ్యంగా వారి పురాణ పతివ్రతల జోలికి వెళ్లానని.

నాకు చేయూత నిచ్చినవారు ఒక్కరులేరు. నా స్టూడెంట్సుకి అసలు నేను పుస్తకాలురాస్తాననికూడా తెలీదు. తెలిసినవారికి పట్టలేదు. అర్థం కాలేదు.

నా డిపార్టుమెంటు జీవితమంతా విరోధమయమే. కాని తీసివేయడానికి కారణం కనబడక వూరుకున్నారు.

మబ్బుగావుంది.

కళ్ళజోడు మార్చడానికి వేలూరు వెళ్ళాలేమోనని బెంగ.

ఇప్పుడే మీ కార్డు.

పెసరట్టు కుర్మాచేశాము. యెంతో రుచిగావుంది. కాని గట్టిశ్రమ.

శ్రీ ర మ ణ స్థా న్

మీ చెవిపోటు బాధకి విభూతి పంపమన్నారు ఈశ్వరుడు. కొంచెం నొసటను పెట్టుకుని కొంచెం నొప్పివున్న స్థలంలో రాయండి.

జవహర్ రేపు వెళ్ళిపోతాడు.

మీరు తిరిగి ఇంత త్వరలో వొస్తారా ? నిజమే !

ఈశ్వరాశీర్వాదాలతో

— చ లం

# 36

శ్రీరమణస్థాన్
30 – 6 – 59.

జగ్గారావు గారికి.

మీ ఉత్తరం. 'రుబాయత్' పోయిందా? కాపీచేసిన శ్రమ అంతా వృధా. పైగా పోష్టువారో, మరెవరో తాము రాసినట్టే, తమదని ప్రచురించు కోరుకద !

మీ రెప్పుడో తాగుడుగురించి అడిగేరు నన్ను. తాగుడు నాకు పడలేదు, ఎప్పుడూ తాగి సంతోషపడలేదు నేను. నా దుఃఖాలు నివృత్తి కాలేదు. ఎందుకు తాగుతారో నాకు ఆశ్చర్యం వాళ్ళ ఆనందం నాకు రాలేదుగనక.

నా కళ్ళకి కొత్తజోడు వేయించాలంటున్నారు. ఆ పరీక్షకి వేలూరు వెళ్లాలి. తొరలో వెళ్ళాలని చూస్తున్నాను.

మీ ఉత్తరాలు రాస్తే, చదివిపెట్టడానికి ఇబ్బంది లేదు మళ్ళీ జవాబు రాయడానికే ఇబ్బంది. అయినా

వేలూరు వెళ్ళి కళ్ళజోడు తెచ్చుకుంటాను. మీరు ఉత్తరాలు ఆపనక్కరలేదు.

మీ చెవికురుపు ఎట్లావుంది ?

కీర్తి, ప్రజల మెప్పూ మనిషిని పాడుచెయ్యవు. వాటికోసం దేవుళ్ళాడే మనుషుల్ని తప్ప. మనిషిలో చేవా, శక్తీ ఉన్నకొద్దీ మనుషుల ఎదిరింపు అతన్ని ప్రోత్సహిస్తుంది. వెలినీ, హేళననీ, బాధనీ తట్టుకోలేనివాడు లొంగిపోతాడు.

ఎంతకీ శ్రీ టాగూరుగార్ని లొంగతీసుకోలేకపోయింది. కాని ఈనాడు నావలెనే, ఆయన తరవాతి రచనల్ని దేశం అంగీకరించింది. కాని ఈనాటికీ చలాన్ని తిట్టడం మానలేదు. ఏనాటికీమానరేమో! నా రచనలేకాక, నాజీవితంకూడా సంఘ విరుద్ధం కావడంచేత ఇంతకోపం ప్రబలింది. అదీగాక గొప్పవారు ఏంచేసినా చెల్లుతుంది. ప్రజలకి పట్టదు. కాని తమ వంటి బీదవాడు, నిస్సహాయుడు ఎదురుతిరిగితే, వాణ్ణి నలిపి వెయ్యగలమనే ధైర్యంతో హింసలు చేస్తారు.

క్రమంగా ఆశ్రమంలో పక్షులు ఎక్కువగా ఆశ్రయం తీసుకుంటున్నాయి.

ఇక్కడ విపరీతమైన గాలులు. మీ చిక్కుడు మొక్కలు ఏమాత్రం తట్టుకోగలవో తెలీదు.

అప్పుడే కోతులు పందిరిమీదఎక్కి వూగుతున్నాయి. నెమిళ్ళు ముళ్ళలో దూరి చిగుళ్ళని తింటున్నాయి.

వానలేదు. నీళ్ళెట్లా ఈ మొక్కలికి అందించగలమో తెలీదు. పైగా ఈ గాలి ఉన్న తడిని పీల్చేస్తోంది నేల లోంచీ, ఆకుల్లోంచీ.

గాంధీగారి జీవిత చరిత్ర పారాయణ జరుగుతోంది ఈ ఆశ్రమంలో.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చ ల ం

# 37

శ్రీరమణస్థాన్
11—7—59.

జగ్గారావు గారికి,

నిన్నటి మీ ఉత్తరం.

దూల గుండకాయల సంగతిబావుంది. మొదట్లోనాకు శి—రా— మీద చాలాకోపంవుండేది. ఎవరైనా మిత్రులు అతనికి తగిన శాస్తి చేయకూడదా అని వుండేది. ఇప్పుడు చాలావరకు మరచిపోయినాను.

రెక్క విరిగిపోయిన గోరింకకు,ఇంక రెక్కరాదన్నారు. బోనులో దాని అవస్త చూడలేక కొంచెం విడిచిపెడితే వెళ్ళి పోయింది. హీరా. కీకీ వున్నారు. మూడు చిలుకలు - రంగ. రాణి. ఉమ వున్నారు. రంగవొక టే వాగుతోంది. చివరి రెంటి రెక్కల్ని మనుషులు బొమికలతో సహా కత్తిరించారు.

ఇంకా 20 ఏళ్ళు బతుకుతానంటారా! కానీండి. అవును కొందరికి అప్రయత్నంగా భవిష్యత్తు తెలుస్తో వుంటుంది.

ఇందాక మీ ఉత్తరం.

ఆనాడైనా, నాకు యూనివర్సిటీ పోటీలో గెలవాలని వుంటే, పంపి పంపి, 'మైదానాన్ని' పంపుతానంటారా? ఎంత మర్యాదైన పుస్తకమైనా, చలం పేరువుంటే ఎవడన్నా బహుమతి ఇస్తాడా?

వృత్త అల్లరికి పంపాను.

పోటీకోసమైనా ఆ నీతిపరులచేత, గొప్పవారి చేత, ఈ పుస్తకాన్ని చదివించాలని. చదివారు.

సర్. రాధాకృష్ణన్ గారు రికమెండ్ చేశారు.

ఉన్నవ లక్ష్మీనారాయణ గారు కూడా.

'ఇదే ఉత్తమ నవల. కాని బహుమతి ఇచ్చే సాహసం లేద'న్నారు.

విశ్వనాథా, బాపిరాజూపోయి కాలాన్ని తిట్టి, బీద వారమని చెప్పి, బహుమతిని పంచుకున్నారు.

చివరికి మీ జయపురం రాజావారు వారికిప్పించారు.

ఇంత జరిగింది

హృదయాలున్నాయి. కాని ధైర్యాలులేవు ఆనాడు. ఈనాడు హృదయాలూ పోయినాయి.

కొత్త కళ్ళజోడు వొచ్చింది. కళ్ళు వొచ్చాయి. వర్షం లేదు. నీళ్ళు లేవు. పల్లాకుత్తులో తాడినన్నరలోతుకి వెళ్లాయి నీళ్ళు. చిక్కుళ్ళకి నీళ్ళు అందటం లేదు. తనమీదికి జారిన నీటిచుక్కనల్లా భూదేవే తాగేస్తోంది.

ఈశ్వరుడు చూశారు ఇదంతా. మన ఆశ్రమంలో బసవరాజుగారితో పాటు, శర్మ అనే అబ్బాయి చేరారు.

ఆయన మొక్కల దీనస్థితిని చూసి, వాటికి నీళ్ళు తాను పోస్తానన్నారు. పోస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 38

శ్రీరమణస్థాన్
13—7—59.

జగ్గారావు గారికీ,

మీ ఉత్తరం ఇవాళ. నా ఉత్తరం అందేవుంటుంది. 'రుబాయత్' ఇంకో కాపీ తీయించి పంపుతున్నాను.

ప్రస్తుతం బైబిల్లో 'జీసస్ చరిత్ర' తెలుగు చేస్తున్నాను.

మీ సముద్ర వర్ణన ఎంత గొప్పగావుందో! ఏ కవీ అంత భీషణంగా అందంగా వర్ణించలేదు.

చిక్కుడు పాదులు చీడపట్టి చాలావరకు చచ్చాయి, కొద్దిగా ఉన్నాయి. ఇవన్నా బతుకుతాయని ఆశ.

ఇక్కడ 24 గంటలు అమితమైన ఈదురుగాలి. ఆ గాలికి తీగెల పట్టువొదిలి కిందపడి పోయినాయి, వీటికి వరుసగా ఆపదలు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 39

శ్రీరమణస్థాన్
25 — 7 — 59.

జగ్గారావుగారికి,

మీ ఉత్తరమూ, కార్డూ—

శరత్ సంగతి ఎప్పుడో నా అభిప్రాయం ఓ వ్యాసం రాశాను, లేఖపూర్వకంగా. తన 'శరద్దర్శనం'లో గో॥ వెం॥ సుబ్బయ్యగారు దాన్ని అచ్చువేసుకున్నారు. పైగా ఆయన తోనే వాదించాల్సివొచ్చింది. అదంతా మనం కలుసుకున్న ప్పుడు మాట్లాడుకుందాము. చాలావరకు మరిచేపోయాను. అప్పటికి అంతా మర్చిపోతానేమో!

కాని మీ విమర్శ నా విమర్శకు చాలా దగ్గిరగా వుంది.

శరత్ నాయికా నాయకులకు వెన్నెముక లేదు. వాళ్ళ వాళ్ళంతా మెత్తని హృదయమే. ఎముకలులేవు. విధికి వెన్నవలె లొంగిపోతారు.

రష్యన్ నవలాకారుడు 'డాస్టవిస్కీ'కి శరత్ కు ఎంతో పోలికవుంది.

శరత్ ది గొప్ప సానుభూతి. ఎంతో అనుభవం. అతను రాసిన కాలానికి, అతను రాసిందే గొప్ప విప్లవం. అంతకన్న ధైర్యం అతనిలోలేదు. అతనికి అట్లాంటి ఎదురింపులు ఇష్టం కూడా లేవు.

'దేవదాసు'పై మీరు చేసిన విమర్శ చాలాబావుంది. ఐనా ప్రేమకు నిర్వచన మివ్వడం సాహసం. దేవదాసుది జీవితాన్ని మింగే ప్రేమ. ఆ మనిషి అటువంటివాడు. అటువంటివాణ్ణే తీసుకుని అతని బతుకుని చిత్రించడం, శరత్ ఉద్దేశ్యం. దీనులూ, అసహాయులూ, అశక్తులూ

వీళ్ళ గాథలుకూడా చిత్రించతగ్గవేకద ! అతని బలహీనాన్ని కాక అతని ప్రేమబలాన్ని చూడండి.

అతన్ని ఓ ఆదర్శపురుషు డనలేదే శరత్. అతనిపై కన్నీళ్ళవర్షం కురిపించాడు.

15 ఆగస్టు యత్నాలలో వున్నాము.

ఇంకా నీళ్ళచుక్క లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

# 40

శ్రీరమణస్థాన్
28—7—59

జగ్గారావు గారికి,

మీ ఉత్తరాలు రెండూ.

నా గొప్పకథలన్నీ వాటంతట అవే రాయించు కున్నాయి. నా ప్రయత్నం స్వల్పం.

ఏముంది ? చక్రపాణి కథ ! వూరికే పుస్తకాలు అచ్చువేసుకున్నాడు. ఒక్క పెన్ను ఇచ్చాడు. నా దస్తూరి తనని తిప్పలుపెడుతోందని.

నేను బీదవాడినైన తరవాత కొంచం పైకం ఇచ్చాడు అంతే.

పబ్లిషర్ల న్యాయం అది. అది వారి ధర్మం.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 41

శ్రీరమణస్థాన్
1–8–59.

జగ్గారావుగారికి,

మీ రెండు కవర్లు ఇవాళే.

దెయ్యాలసంగతి మనం మాట్లాడుకోవలసిందేగాని, ఉత్తరాలద్వారా నేను తృప్తిగా ఏమీ రాయలేను.

'రుబాయత్' మీకు అందిందికద! పైగా అది మీకు ఎంతో నచ్చింది. మీకోసమే దాన్ని తెలుగుచేసాను. నా సంకల్పం నెరవేరింది.

మీ ఇల్లే మీకో కొత్త సంసారం ఇచ్చిందన్నమాట.

మా చిలకల్లో చిన్నదాన్ని, అమాయకురాల్ని, కుక్క ఎత్తుకెళ్ళి చంపేసింది

వానలు లేవు. నీళ్ళులేవు, వేడిగాలులు.

బాపయ్యా! నే నెరిగిన బాపయ్య వేరు. అతను యిప్పుడు D. E. O. కాదు. ఐవుంటే నే నతనితో మాట్లాడడంగాని, అతన్నిగురించి ప్రేమగా రాయడంగాని జరిగేది రాయడంగాని జరిగేదికాదు.

ఈసారి ఉత్తరంలో విభూది పంపుతాను.

మహమ్మదుగురించి నాకేమీ తెలీదు. మీరు రాసిన సంగతులు సరైనవే ననిపిస్తోంది.

మిమ్మల్ని ఇక్కడికి రమ్మనే ప్రోత్సాహాన్ని ఆటంక పరచకండి.

రేపు నజీర్ రహ్మాన్ తిరపతి వెళ్ళిపోతున్నారు. ఇంక మిగిలేది, మా అతిథిగదిలో బసవరాజుగారు, కురంగేశ్వర్, శర్మగారు.

'|కాసింగ్' కాపీతీయించే యత్నంచేస్తాను.

అప్పుడే మిత్రులు రాస్తున్నారు 15కి వస్తామని.

వారికి వసతీ, నీరూ చూపే భారం పూర్తిగా ఈశ్వరుడిది. నేను కాళ్లు బారచాపాను.

15 వ కార్యక్రమం ముందే నిర్ణయంకాదు. చాలా మంది చేరడమే. వారిమధ్య ఈశ్వరుండడమే పండగ. రమణ భక్తుల్ని భోజనానికి పిలుస్తాము ఓ యేభైమంది పైగా వస్తారు. తరవాత బీదవారికి భోజనాలు, రాత్రి భజన. ఈ ఏడు ఇంకా ఏదన్నా వుంటుందేమో !

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 42

శ్రీరమణస్థాన్
4 – 8 – 59.

జగ్గారావు గారికి,

మీరు వర్షమూ, ముసురూ, చీదరా అంటే, ఆ మాటలు ఇక్కడ విపరీతంగా వినిపిస్తున్నాయి

మీరు చెప్పిన నీలంసీసా నీళ్ళచికిత్స చేస్తాను, రేపటినించి.

పకపకకి జరంపోయింది.

వజీర్ రహ్మాన్ తిరపతి వెళ్ళారు

మీరున్న గదిలో మళ్ళీ ముగ్గురు చేరారు అతిథులు.

ఇవాళే మళ్ళీ మీ ఉత్తరం.

మీరు రాసిందంతా నిజమే. కాని మీ సందేహాలు సరైనవికావు. ఈ విషయాలు తెలిస్తే, మీ సందేహాలలో ముప్పాతిక తీరిపోతాయి.

(1) నే నెవరినీ ఇక్కడికి రమ్మని పిలువను. పిలావ లేదు. అక్కడ అనేకమైన చిక్కుల్లోపడి కొట్టుకుంటో "మా కేదీగతి ?" అని మొరపెడితే, జాలిపడి 'సరే, ఇక్కడికి రండి' అంటాను. ఆ చిక్కుల్లోవుండగా నా పిలుపు వాళ్ళకి దివ్య వాణిలాగు వినబడుతుంది. ఆ చిక్కులు తగ్గగానే, "ఎంత మోసం చెయ్యాలని చూశాడు చలం" అని కోపిస్తారు.

(2) ఇక్కడికి వొచ్చినా, ఎవరినీ యోగసాధనలోనికి దిగమని అడగను.

(3) ఇంతకీ ఇక్కడికి రమ్మనడానికీ, పొమ్మనడానికీ నే నెవర్ని ? పిలిచేది ఈశ్వరుడు. యోగసాధనలోకి ఈశ్వరుడు దించేది. నే నెవర్ని ?

(4) ఇంతకీ అది నా జాతకం. మంచిచేసినా తప్పు అర్థంచేసుకుంటారు. విరోధులు సరేసరి.

(5) ఈ మిత్రులేకాదు ఈ మధ్య ఇద్దరు ముగ్గుర్ని ఇట్లానే చీవాట్లెయ్యవలసి వొచ్చింది.

నేను రాసిన ఉత్తరాలు తిరగెయ్యమనండి. నే నెన్న డన్నా వారిని ఇక్కడికి రమ్మన్నానా ? మోసం చెయ్య

మన్నానా? లోకాన్ని వొదలమన్నానా? వొస్తామంటే 'సరే' నన్నాను. ఆ సరే ననడమేకదూ నా తప్పు?

(6) 'చలం రమ్మని పిలిచాడే, మనబోటివాళ్ళని!' అనే కృతజ్ఞత ఐనావుండదు.

(7) పోనీ జగ్గారావుని రమ్మనిపిలిచానా? జగ్గారావుని యోగంలో చేరమన్నానా? మీరు రావాలని కోరితే, ప్రోత్సహించాను, మీపైని గౌరవంవల్ల. ఈశ్వరుడు పిలవ మంటే పిలిచాను. మిమ్మల్నే నేను పిలవలేదే, వాళ్ళని పిలుస్తానా?

(8) ముసలివాళ్ళకి సహజంగా వైరాగ్యం వుంటుం దనీ, కోరికలు తక్కువనీ అనుకోనడం పెద్దపొరపాటు. ఇంత జీవితం విచక్షణగా చూసిన మీరూ ఆ పొరపాట్లలో ఎట్లా పడ్డారో ఆశ్చర్యంగావుంది.

యువకుడికన్న వృద్ధుడికి నూరురెట్లు ఎక్కువ కష్టం ఈ సాధన; అనేకరెట్లు ఎక్కువ కోరికలు.

మీరు కీర్తనలు వినలేదా?

ముసలివాడివై ఏం చెయ్యగలవురా? 'ఇప్పుడే మేలు కోరా?' అని.

సరే, పైన రాసినవాటివల్ల మీ సందేహాలు చాలా వరకు తీరివుండవచ్చు.

మన తిండి ఎట్లా గడుస్తుంది? మన కోరికలు తీరలేదే అనుకునేవాళ్ళకీ, ఆధ్యాత్మిక జీవనానికి చాలా దూరం. ఏదో తనమీద ఎందుకో వాళ్ళకి గౌరవం వుందికదా అని

అట్లాంటివాళ్ళని సాధన చెయ్యమని పిలిచేవాడు శుద్ధ మూర్ఖుడు. తన నెత్తిమీదికి ఓ కుంపటి తెచ్చుకుంటున్నాడు.

అవును. ఆ ఇద్దరు స్త్రీలు ఆ విధంగా మాట్లాడుతు న్నారని నాకు ఇదివరకే తెలుసు.

చలంగార్ని వాళ్ళు ఎందుకు ప్రశ్నిస్తారు? ప్రశ్నిస్తే చలం "మిమ్మల్ని ఎప్పుడు రమ్మన్నాను" అని అడగడా!

ఈ యోగవిద్యలోకి దిగేవాడు, ఇటూ అటూ యోచించి "ముందు ఇది అనుభవిద్దాము, తరవాత అది అనుభవిద్దాము" అని ఏర్పాటు చేసుకోడు.

ప్రతివారూ ఈ చలంతో పోల్చుకోవడమేగాని, చలం ఇంటోవున్న ఆడపిల్లలతోగాని, గోచిపెట్టుకుతిరిగే జగదీస్‌తోగాని, బసవరాజుతోగాని, ఇంకా చిన్నవారు ఎన్ని ఆశ్రమాల్లో ఎందరున్నారో వారితోగాని పోల్చుకోరెందు చేత? తెలుగుదేశంలోనే చాలమంది యోగులున్నారే! వారి కోర్కెలన్నీ ఏమైనాయి? యోగవిద్యలో దిగితే, సృష్టివిలువలు మాయమౌతాయా? ప్రతివారికీ వున్నాయి కోరికలు. వాటితో యుద్ధంచెయ్యగల ధీరులకే ఈ విద్య.

'గీతాంజలి' పీఠిక చదివికూడా ఇంకా ఈ సంశయాలా! మిమ్మల్ని ప్రశ్నించినవారూ చదివినవారే!

ఈ విద్యకీ వయసుకీ సంబంధంలేదండీ. కష్టమనుకుంటే ఎప్పుడూ కష్టమే.

అందరూ దీనికి తట్టుకోగలరని ఎవరన్నారు?

నా మిత్రులననీ, నా ఆప్తులమనీ మాట్లాడేవారి మాటల్లోకన్న స్పష్టంగా నా విరోధుల మనేవారి మాటల్లో ఎక్కువ నిజంవుంది.

నే నేదో నాకు తెలిసినవాళ్ళనల్లా ఇక్కడికి రమ్మని, అందర్నీ యోగులూ, యోగినిలుగాచేసి ఓ మఠాధిపతిని కావాలని చూస్తున్నట్లూ, ఆ అపాయంనించి వారు తప్పించుకుంటున్నట్లూ మాట్లాడుతారు. "సకలబాధలూ అనుభవిస్తున్నాంమొర్రో"అని ఏడ్చే వాళ్ళకి, "ఇంక గతిలేకపోతే మీకు చలంవున్నాడు" అని ఓదార్పు ఇయ్యాలని చూసినందుకు, "మాబుర్రలుగొరిగించి యోగినుల్ని చేస్తాట్ట ఇదేంవిపరీతం!" అని గోల.

బావుందా ?

ఇది ఈనాటిది కాదుబాబూ. 40 యేళ్ళనించి స్త్రీ ఇదే ఆట ఆడుతోంది నాతో ఆనాటి దిక్కులేని రోడ్డుమీద తిరుగుబోతుకీ, ఈనాడు పెద్ద పరీక్షలు చదివే స్త్రీలకీ భేదం భాషాభేదం, బట్టలభేదం, కుయుక్తులభేదం వొకటే నాకు కనబడుతోంది.

ఈ ఉత్తరం మీకేకాదు, అవసరమనుకుంటే, విశాఖ పట్నం మిత్రులకు చూపండి.

ఈ యోగసాధన జన్మజన్మాంతరాలకీ నిలిచేనిధి అని ఒక పక్కన రాస్తూనే, రెండింటికి చెడినవాడవుతాడనిగూడా ఆ గుక్కలోనే రాస్తున్నారే మీరు !

చూశారా. ఎంత నిర్మలమైన హృదయంమీ లోకం ఎట్లాంటిదుమ్ము చిమ్ముతుందో !

విరోధిననిచెప్పివొచ్చేవాడినించిదెబ్బకాచుకుంటాము.
మిత్రుడు చిమ్మేవిషం సులభంగా లోపలికి పోతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో.

— చ ల ం

# 43

శ్రీరమణస్థాన్
28—8—59.

జగ్గారావు గారికి,

మీ కార్డు, మీ కవరూ.

హైదరాబాద్‌కు నేను రాసిన ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరం అందిందా? పండగహడావిడిలో మీ హైదరాబాద్ ఎడ్రసుని చూడలేదు. అందువల్ల హైదరాబాద్‌కు తొందరగా రాయలేదు.

మీారిక్కడికి వస్తామన్నారు కదా అని ఎదురుచూస్తున్నాము.

నా ఉత్తరంలేక. మీ మనస్సు పరిపరివిధాల బాధ పడివుంటుందని, నేను దిగులుపడుతున్నాను.

ఇది నా జాగ్రత్త.

కురంగేశ్వర్ తన ఉత్తరాల పుస్తకాన్ని మీకు పంపివుంటాడు. ఇవాళ నేను 'క్రాసింగ్' పంపాను మీకు.

పండక్కి మీారుకూడా వుంటే ఎంతో బావుండేది.

మీ కలలు గొప్పగావున్నాయి. వాటిల్లో ఏదో అర్థం వుంది అనిపిస్తోంది.

మీ ఇల్లీ, మిగిలిన పిల్లలూ క్షేమమేనా? పాపంమీరు వ్యవహారాల్లో కొట్టుకుంటున్నట్టున్నారు.

ఒక వైద్యం రాశారు పిచ్చికి! పాముకి పట్టుకుని, కోరలు పీకమన్నట్టుంది. రోడ్లంబడి పరిగెత్తే మనిషికి ఎట్లానండి ఈ వైద్యంచెయ్యడం? పైగా ఒకసారి ఆలోచించండి ఆ వైద్యం చెయ్యగల మనుషులు ఇక్కడ ఎవరున్నారో!

నీలంబుడ్లనీరు ఉపయోగపడ్డది నాకు చూపుమాత్రం కొంచంగా బాగుపడ్డది.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 44

శ్రీరమణస్థాన్
7 – 9 – 59.

జగ్గారావు గారికి.

ఈవాళ మీ కవరు.

'చలం కవి అవునా కాదా?'

ఈశ్వరుడు చెప్పేదేమిటంటే చలంకవికాడు. టాగూరు కాడు. వీళ్ళు కవికన్నా గొప్పవాళ్ళు–'కవి' అంటే ఈ మామూలు కవులుకాదు. కాళిదాసు, కృష్ణశాస్త్రి, నండూరి సుబ్బారావు. 'కవిత్వం' అంటే కొన్ని లక్షణాలు వుండాలి. ఆ లక్షణాలలో కొన్నేపట్టాయి చలానికీ, టాగుకుకీ–కాని కవికిలేని చాలా గొప్పలక్షణాలు కూడా పట్టాయి, వీళ్ళిద్దరికీ.

అవును, ఈశ్వరుడు రాయమంటేనే తప్ప నా చరిత్ర రాసుకోను. ఈశ్వరుడు రాయమంటే, ఆయనే రాయించు కుంటారు. నేనే రాయవలసింది వుంటే 'నా జీవితానికీ, నా సత్యాన్వేషణకీ ఉన్న సంబంధమే' రాయాల్సి వుంటుంది.

మళ్ళీ నీలంసీసాల వైద్యం ప్రారంభించాను.

ఒక్క వానపడ్డది.

బీన్సు కొంచెం ప్రాణంపోసుకుని తలఎత్తింది. బతుకు తుందా ?

మీ ఇల్లీ పిల్లల సంగతి చాలా బావుంది. పుస్తకం ప్రారంభించారా రాయడం.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 45

శ్రీరమణస్థాన్
14—9—59.

జగ్గారావు గారికి,

మీ ఉత్తరం, మీ 'గీతాంజలి దిగ్విజయయాత్ర' విన డానికి సరదాగా వుంది. 'భారతి'లో 'గీతాంజలి' విమర్శ చది నాను ఆ వ్రాసినవారు పిలకా గణపతి శాస్త్రిగారు.

ఈ ద్వైతం, అద్వైతాన్ని గురించి నేను వేదాంతాలు చదవను. నాకు తలనొప్పి.

అద్వైతం చివరిమాట, అసలీ సృష్టి అనేది జరగలేదని, ఇదంతా ఉత్త భ్రమ అని అంటుంది.

భ్రమపడేది. ఎవరు ? ఈ చిక్కుకి కూడా సమాధానం వుంది అద్వైతంలో.

ఎవరూ లేరు, భ్రమా లేదు అని,

ద్వైతం. ఇదంతా నిజమనీ, నిజంగా వుండి పోతుందనీ, అంటుంది.

శంకరాచార్ల సంగతి ఏమీ ఎక్కువ తెలీదు నాకు.

శేషాచారి అపకారం చేశాడు. ఎందరు చెయ్యలేదు. అపకారం ? అతని పేరు నా కలానికి అలవాటై ఎవర్ని ఎక్కిరించాల్సి వొచ్చినా, నా అసహ్యానికి కోపానికి శేషాచారి అని ఒక పేరుని ఆధారంగా పెట్టుకున్నాను. అంతేకాని అతనిపై నా కోపం అంత కాలం నిలిచి లేదు.

కురంగేశ్వర్ రావు వెళ్ళిపోయినాడు.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

## 46

శ్రీరమణస్థాన్
15—9—59.

జగ్గూభాయ్ గారికి,

మీ ఉత్తరాలు రెండూ.

హరిజనులస్థితి శోచనీయమే. కాని ఈ కులస్థుల, ధనికుల స్థితికన్న చాలా నయం. హరిజనుల మురికి అంతా బైట వుంది. హరిజనులకి విద్యానాగరికతా కోరుకోకండి. వారు వుండే స్థలాన్ని కొంచెం నిర్మలం చేస్తే చాలు.

రాజమండ్రిలో హరిజనులతో కలిసి వాళ్ళ గుడిశల్లో కాపురం వున్నాను. కాని నాకేమీ ఇబ్బంది అనిపించలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

## 47

శ్రీరమణస్థాన్
28 – 9 - 59.

జగ్గూభాయ్ గారికి,

చావు విషయమై మీరు రాసినవి నిజమే — అసలు నిజం తెలుసుకోవాలంటే, అది మనసు అణిగింతరవాత తెలీవలిసిందే.

అసలు సత్యం, ఇదంతా ఓ కల, అనేదికనక, మనం యోచించేదీ ఏదీ పూర్తి సత్యంకాదు. మృత్యువనేది కలలో భాగమే. కనక దాంట్లోనూ సత్యంలేదు.

ఇవన్నీ స్వయంగా మాట్లాడుకుంటేనేగాని కొంతవర కన్నా బోధపడవు.

మళ్ళీ నీలంసీసానీళ్ళు తాగుతున్నాను. ఇంక మన్ను వైద్యంకూడా చేస్తాను.

ఈశ్వరాశీర్వాదాలతో

- చలం

# 48

శ్రీరమణస్థాన్
జగ్గూభాయ్, 2—10—59.

మీ ఉత్తరాలన్నీ. మీరు, పిల్లలూ మీ ఆటలూ చదివితే, మీకు తెలీకుండానే మీరు ఎప్పుడూ, పూర్వం నించీ ఈశ్వరుడికి ఎంత దగ్గిరో తెలుస్తోంది. మనస్సు ఎంతో నిర్మలమూ, లోకం చెత్తలో బరువెక్కనిదీ ఐతేనేగాని, పిల్లలతో ఆడుకోలేరు మనుషులు. పెద్దలు ఆడుకోవాలనా్న పిల్లలు వాళ్ళతో ఆడుకోనడానికి గారు. నాలుగురోజుల కిందటే చదువుతున్నాను, "పెద్దవాళ్ళ హృదయంలో చిన్న తనం వుంటేనేకాని పిల్లలు వాళ్ళని ప్రేమించి వాళ్ళతో ఆడుకో"రని.

ఇప్పుడు ఫేషన్ అయింది. "మా తల్లి అంత గొప్పది లేదనడం, మా తండ్రిఅంత గొప్పవాడు లేడనడం" పుస్త కాల్లోకూడా అంతే. కాని ఆ అనేవాళ్ళకీ – రాసేవాళ్ళకీ తెలుసు ఆ మాటలు అబద్ధమని. అతని తల్లితండ్రులకన్న గొప్పవాళ్ళని వాళ్ళు జీవితంలో చూడకపోతే, వాళ్ళవి ఎంత దరిద్రగొట్టు జీవితాలో తెలుసుకోవచ్చు.

దోసపాదులు అప్పుడే చచ్చాయి. బీన్సు ఆలోచించు కొంటున్నాయి చచ్చిపోదామా, బతుకుదామా అని. అవి, ఈ చిక్కుళ్లు ఈ దేశంలో కాయవేమో! వాటికి ఒకటే వర్షధారలు కావాలి ఈ ఎండలు పనికిరావుగావును.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 49

శ్రీరమణస్థాన్
3-10-59.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

ప్రళయం సంగతి.

కొన్నాళ్ళబట్టి చెపుతున్నారు ఈశ్వరుడు, త్వరలో ప్రళయం రాబోతోందని. ఈశ్వరుడు మాటలుగాక, ఇతర నిదర్శనాలుకూడా కనబడుతున్నాయి ఈశ్వరుడి మాటని తీసుకోనివాళ్ళకి.

1962—ఫిబ్రవరి 4 న—తొమ్మిది గ్రహాలూ అంటే ఎనిమిదీన్నీ, ఒక్క జలరాశిలో చేరబోతున్నాయి.

ఆ కాలమే ప్రళయమంటే అంటే, ఈశ్వరుడు చాలా వరకు అవునన్నట్టే తోస్తోంది.

మీ వేపునకూడా ప్రళయం సంగతి చెప్పుకోడం విస్మయంగావుంది. లోకంలో చాలాచోట్ల చెప్పుకుంటు న్నారని చెప్పారు.

మిస్ మెర్టన్స్ ప్రపంచాన్నిచుట్టి మళ్ళీవొస్తున్నారు ఆమె రెండురోజుల్లో. మళ్ళీ అడిగిచూస్తాను, కొత్తగా ఏమన్నా చెపుతారేమో !

మీరు రాసే సిరా ఇంకొంచెం నల్లనిది సంపాదించండి. ఇది నా కళ్ళని పీకుతోంది.

1962 లో ప్రళయమైతే, ఈనాటినించికూడా ప్రజా సంహారం ప్రారంభిస్తుంది చూస్తున్నారుగా పోనుపోను ఎక్కువవుతోంది. డాక్టర్లకి తెలీని విపరీత జాడ్యాలు, క్షామాలు, భూకంపాలు, ప్రజని తుడిచిపెడతాయి. ఇల్లు వాకిలి, తిండిలేక ఈనాటి అధికార్లు, కోటీశ్వరులు బిచ్చం కూడా దొరక్కుండా తిరగబోతున్నారు. ఈశ్వరుడు పరిపాలించే లోకంలో ఎవరికీ అన్యాయంగా బాధ కలగదనే సంగతి తెలుసుకద! వీళ్ళీనాడు చేస్తున్న ఘోరాలన్నీ మీకు తెలియటంలేదా?

ఈ ప్రళయం లోకానికంతా రాబోతోంది. ఈ జాడ్యాలు మొదలెట్టినవి చెయ్యగా మిగిలినది 1961–ఫిబ్రవరి వరదలో సమాప్తమవుతుంది. ఇక్కడ బాధపడి అనుభవించిన వాళ్ళే అదృష్టవంతులు. మిగిలిన అనుభవం కోసం నరకంలో అప్పుడే ఈ ప్రజల్ని తీసుకోడానికి సన్నాహాలు జరుగుతో వుంటాయి.

ఎవరికి అన్యాయంగా బాధకలగదు. కాని పాపంచేసిన వాళ్ళకి బాధా తప్పదు.

ఈ రెండు సూత్రాల్ని మనసులో పెట్టుకుంటే మీ మనసు అట్లా తల్లడిల్లదు.

పిట్టలు మృగాలు మనుష్యులైనా సరే

(ఆరూపాలలోగాని, పూర్వ జన్మలో చేసిందే అనుభవిస్తారు

ధర్మాత్ములకి ఏ ఆపదా రాదు)

(ఎక్కడెక్కడి వాళ్ళూ, ఏదేశంలో వాళ్ళూ సురక్షిత పరచబడతారు)
ప్రళయం రాబోతోందని, ఈనాటినించి చిన్హాలు, శకునాలూ బోధలూ జరుగుతున్నాయి ఈశ్వర భక్తికలవాళ్ళు నమ్మ్తారు, ఉద్ధరింప పడతారు-తక్కిన వాళ్ళు నవ్వుతారు. "ప్రళయమా!" అని నవ్విన వాళ్ళు ఏడవ పోతున్నారు, ఏదిక్కూ లేకుండా.

ప్రళయంలో ఒక్క నిమిషంలో చావరుటండీ! కుటుంబాలకి, కుటుంబాలు దిక్కులేక తిరుగుతారట, ఇళ్ళు, వాకిళ్ళు, వంటలు. బ్యాంకులు ఫ్యాక్టరీలు అన్నీ నశించి. ముఖ్యంగా భాగ్యవంతులే నశించేది, బాధపడేది ఈ లోకంలో ఆ లోకంలో, మీకు తెలుసుగా పాపాన్ని పెరగనిచ్చి పెరగనిచ్చి, నాబోటిమీబోటి వాళ్ళు "ఓయజమాని అనేవాడు వుంటే ఈ లోకం ఇంత ఘోరంగా జరుగుతుందా!" అనేట్లుచేసి, మాడుస్తారు.

• ఈ ప్రళయం సంగతి ప్రతిమతంలోనూ వుందట. రమణ భక్తుడు ఇంగ్లీషు ఆయన ఓ పుస్తకం రాశారు, ఈ విషయమై.

ఇంకో జన్మలో ఇంకోలోకంలో మాత్రం వీళ్ళకి శాంతీ ఆనందాలూ ఎట్లావస్తాయండీ! శాంతిని, లోకమూ, జన్మా యిస్తాయా? హృదయ నైర్మల్యం ఇస్తుందిగాని!

ఈశ్వర భక్తులు రక్షణ పొందుతారు. అంటే "ఈశ్వరా" అంటూ ఘోరాలు చేసేవారు కాదు. ఈశ్వరు

నిలో నమ్మకం లేకపోయినా సరే, దయా, సత్యం హృదయంలో వున్నవారు అన్నమాట.

హింసా, అహింసల్ని గురించి మీరు రాసిన ప్రతీ అక్షరమూ సత్యం. అంతకన్న నేనేం రాయగలను ?

పంది సంగతా ? వజీర్ రహ్మాన్‌కి తురకమతం సంగతి ఏమీ తెలీదు. తురకలని కొందరు ఈలోకంలో ఉన్నారట అని ఎప్పుడో విన్నాట్ట.

వజీర్ రహ్మాన్ అత్తవారింట వున్నన్నాళ్ళూ పస్తు. ఈతిండి ఆయనకు సయించదు. పైగా అతనిచే సూర్య నమస్కారాలు చేయిస్తున్నారు. ఆకలెక్కువవుతుంది. కాని తిండి తినలేడు.

ఇంకఉత్తరాలేం రాస్తారాయన!ఉసూరో'అని ఓమూల పడివున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 50

శ్రీరమణస్థాన్
18 – 10 – 59.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలన్నీ అందుతున్నాయి, నేను వెంటనే ఉత్తరం రాయలేకపోయి మిమ్మల్ని కష్టపెట్టాను. మీరిక్కడికి హైదరాబాదునించి వొస్తామంటున్నా, రాస్తున్నాను.

ఒకవేళ రారేమో ఇంటికివెళ్ళి చూసుకుని, నా ఉత్తరం కన పడక నిరుత్సాహ పడతారేమో నని

నా సలహా మీరు ఆ వేదాంత గ్రంథాల్ని చదవ వొద్దని. అవివూరికే మనసుని తికమక పెడతాయి గాని. ఏ సహాయమూ చెయ్యావు. అవి అసత్యాలనడంలేదు. అవి చెప్పే సత్యాన్ని మనమనసులు సరిగా, పూర్తిగా గ్రహించ లేవు. మాటల ద్వారా అవి ఏమీ చెప్పలేవు. ఈవిద్య అంతా మౌనంలోంచి గ్రహించవలసిందే. మనఅవసరాన్ని బట్టి మన గురువు నోటినించి వినవలసిందే.

పాపం మీ ఇల్లికీ, మీకూ, ఎంత ఆపద వొచ్చింది!

ఆగస్టు 15కి, జ॥ రు॥ శాస్త్రిగారు మొదలైనవారు వొచ్చారు. చక్కగా జరిగింది. అతిథులు ఇంకా వెళ్ళలేదు.

ఇక్కడ సాధనకి వొచ్చిచేరిన శర్మగారికి పిచ్చెక్కింది. మమ్మల్ని కొంత కలత పెడుతున్నారు.

తురంగేశ్వరరావు "కాపిసింగు" కాపీ చేస్తున్నట్టేవుంది.

ఆ మిత్రుల సంగతి పోనీయండి. అంతే వాళ్లు. వాళ్ళ మిటి చాలామంది అంతే. నాకేం కొత్తకాదు.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 51

శ్రీరమణస్థాన్

10—10—59.

జగ్గూభాయ్,

మీరు రాసిన రెండు పెద్ద ఉత్తరాలూ అందాయి. మీరు రాసిన ప్రతి అక్షరమూ సత్యమే - ఈశ్వరుడు ఔనన్నాడు.

శ్రీ శ్రీ విషయం—

కవిత్వం రాసిన రోజుల్లో అతను భాగ్యవంతుడు కాడు. సామాన్యస్థితి. కాని కవిగనక, అనుభవాలపైన ఆశలధికం. తన మల్లేనేఆశలు తీరకఅలమటించే వారినిచూచి అందరి కోసమూ అతనుఆలాపించాడు.కానిఅతని రాతలవల్ల అతనికివిరోధాలూ, అపనిందలూ, తప్పేమీ రాలేదు. కానికమ్యూనిస్టు భావాలు దేశంలో ప్రబలిన కొద్దీ అతనికి ఆదరణ వొచ్చింది. దానిలో కవిత్వం అడుగంటింది.

రచయితలు రెండు రకాలు. తాము బాధపడుతో, ఆబాధని కాయితంమీద రాసేవారు. రాద్దామనుకుని, ఏదో వొక సమస్యని ఆధారం చేసుకుని రాసేవాళ్ళూ—

అతను కోరింది, లోకంలో సంఘస్థితిలో మార్పులు గనక, అది జరగ్గానే అతని కవిత్వానికి అవసరం పోయింది. కాని శ్రీ, శ్రీ, ఒక్క ఆర్థిక విధానాన్నే కాక ఇంకాచాలా మార్పుల్ని కోరాడు. అతని కవిత్వంలో. కనక అతని కవిత్వానికి గొప్పతనం పట్టింది.

చలం కోరింది హృదయంలో మార్పుగనక, అతను ఎన్ని శతాబ్దాలకీ లోకవిరోధిగానే వుండిపోయినాడు. వుండిపోతాడు.

మీరెంతో సునిశితమైన దృష్టితో అసలు కారణాలు, భేదాలు చూడగలిగారు. మీలో ఎన్నోజన్మల సంస్కారం వుంటేనేగాని అంతస్వచ్ఛంగా చూడలేరు.

ఈశ్వరాశీర్వాదాలతో.

— చలం

# 52

శ్రీరమణస్థాన్
8–11–59

జగ్గూభాయ్,

మీ ఉత్తరందిన్నా. మీరు రాసినకథ ఎంతోఅందంగా అర్థయుక్తంగావుంది. ఉపమానం కిందఎంతో సమంజసంగా సుందరంగా వుంది.

కాని వాస్తవమేమనుకుంటానంటే ఎన్నో బాష్పాలు రాలిస్తేనేగాని (భక్తుడంటేనే కన్నీళ్ళు) భక్తుడుగాని, జ్ఞాని కాని కాలేడు. జ్ఞాని ఐన తరవాతకూడా కన్నీళ్ళకి దూరంగా ఉండడు ఈశ్వరుణ్ణి ఈ లోకపు సుఖదుఃఖాలతో చూడలేని వాడు, అనుభవించనివాడు జీవుల్ని జీవితాన్ని వెలుగనీడలతో సహా ప్రేమించలేనివాడు, స్వర్గంలోనూ ఏమీ అనుభవించలేడు, చూడలేడు.

అట్లాంటి ఎందుకట్టైతే నరకంలోకి పోయి కాలి, ఏడ్చి, బాధంటే ఏమిటో తెలుసుకుంటారు.

మీరు మనసూ దేహము గురించి రాసిందంతా చాలా వరకు సరిగానే వుంది. మనసు శాశ్వతం కాదు. మన సాధన అంతా మనసుని నాశనం చెయ్యడానికే.

ఈ ప్రశ్నలోకి లోతుగా వెళ్ళిన కొద్దీ అంతులేని వేదాంతంలోకి పోతాము.

కాని మీరు తెలుసుకున్నంతవరకు సత్యమే.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 53

శ్రీరమణస్థాన్
20—10—59.

జగ్గూభాయ్,

మామిడిచెట్టుకింది
చిక్కుడికి
చిన్నపిందెలు రెండు.
జయ్ ! జయ్ ! జయ్ !
ఈశ్వరుడికి జయ్
ఈశ్వరరాజ్యానికీ జయ్ !
రాజుల చిక్కుడు పందిరి పైకిలేచింది.

పాపం, మీ మధుకి అంతజబ్బు చేసిందా? బతికాడు. కాని మా మధుకిపాపం, పెళ్ళిఅయింది. శరీరం చావడంకన్న పెద్దపని జరిగింది.

సినిమాకి వెళ్ళినా మీ ఆరోగ్యం చెడిపోకుండా వుంది కద! అయితే పరవాలేదు. చాలా ఆయుస్సు వుంది మీకు.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం



54

శ్రీరమణస్థాన్
16 – 11 – 59.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

రావూరి భరద్వాజగారు నన్ను కలుసుకోడానికి బెజవాడ వొచ్చారు. ఆయన్ని నేను అంతే ఎరుగుదును ఆయిన ఇక్కడికి వొస్తానని రాస్తారేగాని, వొస్తారనుకోను

చౌడేశ్వరీదేవి అనే ఆయన మొగాయన అట్లాంటిపేరు పెట్టుకుని రాసే ఆయన నన్నెందుకు కలుసుకుంటారు ?

ఈశ్వరుడు అంగీకరిస్తే, పచ్చబొట్టు వైద్యంచేయించుకుని చూస్తాను

అమెరికన్స్ చాలా పొడిపించుకుంటారు పచ్చబొట్లు.

'రుబాయత్' అచ్చువేస్తామని పబ్లిషర్సు అడుగుతున్నారు

ఇంకా కొత్త గీతాలు తెలుగు చెయ్యలేదు.

వాళ్ళు అంతబాగా సమర్థత కలిగి వుండటం లేదు.

పనులన్నీ పడుతున్నాయి.

కాని పడుతున్నాయే అనే చింతలేదు.

ఈశ్వరుడు చెప్పారనేకాని ఈ తెలుగువారికి ఇంకొక్క పంక్తి రాయాలని లేదునాకు.

ఏం చేస్తున్నారిప్పుడు ?

మీరు ఇక్కడికి వచ్చినప్పుడు తప్ప చుక్క పొడుపు పడదేమో!

మీరు పోతన్నపైన రాసింది ఎంతో బావుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

– చలం

# 55

శ్రీరమణస్థాన్
30 – 11 – 59.

జగ్గూభాయ్

మీ కార్డు. రాయడం మరచిపోయాను కాదు. అడగడం మరచిపోయాను. మీరే రాశారు. దిబ్బాలుకి ఎట్లా వుందని. దిబ్బాలుకి జబ్బుగా వుందని దిగులుపడ్డాము. ఎట్లా వుంటుందో ననుకున్నాము. ఈశ్వరుడు ఆమెని రక్షించారు ఇవాళ సంతోషమయింది.

ఈ మధ్య ముసురు. మతికాస్తా పోయింది. అందుకని మీకు రాయడం మరిచిపోయివుంటాను.

ఇవాళ ఎండ.

దీపోత్సవానికి వూరు తయారౌతోంది.

'కీకీ' అని పిచిక జ్ఞాపకం వున్నాడా ? మేము అతన్ని నండూరి సుబ్బారావు అంటాము. అతను నిన్న చచ్చిపోయి నాడు

మీ వాళ్ళు ఎట్లావుందో అని ఆలోచిస్తున్నాను.

ఈ ఉత్తరం మీకు అందేప్పటికి జవహార్ మిమ్మల్ని కలుసుకుని వుంటాడేమో !

ఈశ్వరునిపై భారంవేసి మీ ప్రయత్నంలో మీరు వుండండి. ఇక్కడికి సులభంగా చేరుకుంటారు.

దీపం 14. డిశంబరు.

జయంతి 17.

ఆంకాం కావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

## 56

శ్రీరమణస్థాన్
21—12—59.

జగ్గూభాయ్,

మీ ఇల్లీ ఉత్తరం ఇల్లీ కనపడలేదా ఇంకా ?

నేను, ఇక్కడ చేరిన మిత్రులూ మీ కోసం చూస్తున్నాము.

1—1—60

చివరికి వెళ్ళిపోయినారు. ఇవాళ కనపడలేదు మీరు, పొద్దున్నే-

ఈ పాటికి రైలు శరవేగంతో ఉత్తరదిక్కుకి.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

## 57

శ్రీరమణస్థాన్
10—1—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. నన్నంత గొప్పచేసి రాసిన ఉత్తరానికి, ఏం జవాబు రాయగలను?

చిత్రా పిల్లలూ వూరికి వెళ్ళారు.

రోజూ రసగుల్లాలు తింటున్నాము.

ఒక పిల్లిపిల్ల తనంతటతాను పకపక దగ్గిరికివొచ్చి, పాలూ అవీతాగి, నమ్మించి చెప్పకుండా వెళ్ళిపోయింది.

పిల్లుల్లోకూడా ఇంతమోసం బలిస్తే ఇంక ప్రళయం రాక ఏం చేస్తుంది?

వసుంధర మఫ్లర్ నిజంగా మీరట్లా ఇచ్చేస్తే ఎంత గొప్పగా వుండేది!

మీ చిన్నతనపు కబుర్లు ఎంతో సరదాగా ఉన్నాయి. చినారావుగారి లేఖలు అచ్చుకి తయారు చెయ్యడంలో చాలా బిజీగా వున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 58

శ్రీరమణస్థాన్
12—1—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం మళ్ళీ ఇవాళ.

రేపటినుంచి సంక్రాంతి పండగ. మీవూళ్లో వినోదంగా వుంటుంది. చిన్నతనపు అందమైన సంక్రాంతులు ఎన్నో జ్ఞాపకం వొస్తాయి మీకు.

మీ చిన్నతనానికి నా చిన్నతనానికి ఎంతవ్యత్యాసమో. నా చిన్నతనమంతా, అనారోగ్యం, బలవంతపు చదువు, పెద్దవాళ్ళ భయం, టీచర్లు, పాఠాలూ, సన్నవి బెంచీలు, బళ్ళో కూచోలేకపోవడం, పాఠాలు చదవలేని అలసట, ఘోరం.

మన పోయిన జన్మల్లో మనిద్దరికీ ఏ సంబంధమూ లేదు. మీరు మద్రాసు ఆంధ్రులు. నేను ఇంగ్లండులో అందానికీ, అవినీతికీ, ప్రసిద్ధికెక్కిన వసితను నా పూర్వజన్మ మీ పూర్వజన్మకన్న ఓ వందవళ్ళు పాతది.

కాని అంతకుముందు జన్మల్లో సంబంధం వుండీ వుంటుంది. ఈశ్వరుడు చెప్పలేదు.

చిన్నపిల్లలు ఎదిగి ఎందుకు అట్లా నిర్జీవంగా అవుతున్నారో, కొంచెం నాకే తెలుసు.

1) లోకం పాతపడి లోకంలోని అందం మామూలవుతోంది

2) ఈ విద్యా. పెళ్లి, ఉద్యోగం తెచ్చే బాధ్యతలు.

3) వాళ్ళలో జన్మలనుంచి వొచ్చేవీ ఈ జన్మలో నేర్చుకున్న దుష్టత్వం క్రమంగా బైటపడటం ప్రారంభిస్తుంది.

4) ఆశలూ, కోర్కెలూ, కోపీనాలు పనిచేస్తాయి.

5) శరీరానికీ మనసుకీ ఆనందించే బలం క్షీణిస్తుంది.

పిల్లలు ఆ విధంగా కావడానికి పెద్దలూ, టీచర్లూ, సంఘం, రాజకీయాలూ అన్నీ కారణాలే. కాకపోయినా ఆ పిల్లల్లోనే వాళ్ళ సహజమైన ఆనందాన్ని చెరిచే అంకురాలు వుంటాయి, ఇదివరకటి జన్మలవల్ల.

ఈనాడు చలం ఏదన్నా ఓ ఉన్నతస్థితిని పొందాడంటే, అది నిశ్చయంగా ఈశ్వరానుగ్రహం పక్కన పిల్లలకన్న అత నేమీ వేరువిధంగా పెరగలేదు. అతన్ని ఈ విధంగా తయారు చేసిన మంచీ, చెడ్డ ప్రోద్బలాలన్నీ అతనిలో ఫలింపచేసి వొచ్చి నవే. బైట మనుషుల, పరిస్థితుల ప్రభావం, చలంపైన చాలా తక్కువ.

ఈశ్వరానుగ్రహానికో, కాంతికో చలంలో అర్హత వుందంటే, అది పూర్వజన్మల సుకృతమేగాని, ఈ జన్మలో అతని కెవరూ నేర్పింది ఏమీ లేదు.

అట్లానే జగ్గారావు కూడా, చలాన్ని అతను అర్థం చేసుకోగలిగిన స్థితి, అతనికి ఈశ్వరానుగ్రహం, పూర్వ జన్మల సుకృతం,

వారంనుంచి దగ్గుతో బాధపడి ఇవాళే బాగున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో.

— చలం

# 59

శ్రీరమణస్థాన్
3—2—60

జగ్గూభాయ్

మీ ఉత్తరమూ, పేపరులో కట్టింగూ. స్వామిశాంతా నందుగారు గొప్పవారే అయివుంటారు. కాని ఆయన రాసిన వాక్యాలు, అట్లాంటివి ఎన్నైనా రాయవచ్చు. ఈ నాయకుల ఉపన్యాసాలు లాంటివే. ఈ ఆధ్యాత్మికోపన్యాసాలు.

నేను రాశాను కదూ, ఈ వేదాంత వాక్యాలూ, శాస్త్రాలూ ఏమీ ప్రయోజనం లేవని! కలకత్తా ప్రయాణమెట్లా చెయ్యాలో ఎంతవర్ణించి ఏం లాభం! ప్రోత్సహించి ఏం ప్రయోజనం. ఒక్కమాట లేకుండా, మౌనంలో ఆప్రయాణానికి కావల్సిన ఖర్చుని జేబులోవేసే గురువు వొక్కడే మనకి కావలసింది.

ఇంక మీ సందేహాలు.

(1) ఓంకారమంటే, ఓం అనే శబ్దం ఆదిమంత్రంకింద సాధన చేస్తారు. ఈప్రపంచం ఓం కారంలోంచి పుట్టిందని.

(2) అంతర్ముఖులం-అంటే మన దృష్టిబైట ప్రపంచం మీద కాక, మన లోపలికి తిప్పుకుని, మనస్సుని దాటి దాని వెనక ఏముందో తెలుసుకోడానికి ప్రయత్నించడం.

(3) సత్-అంటే సత్యం ఉన్నది ఒక్కటే-అదిఒక్కటే సత్యం-అదే సత్-దాన్ని సత్యమను, ఈశ్వరుడను, ఆత్మఅను.

(ఇవన్నీ మాటలండీ, ఇట్లాఏఅంతూ పొంతూ లేకుండా మూ డేళ్ళు మాట్లాడవచ్చు)

(4) తత్వమసి—నువ్వుఅది, అంటే నువ్వు 'నేను' అనుకుంటున్నావే అది కాదు. 'అది' అంటే దానికి పేరులేదు. 'అది' అనుభవించాల్సిందే.

(5) ఇంద్రియాలు మనసులో వున్నాయి—మనసులేంది ఇంద్రియాలు పనిచేయవు. నిద్రలో మనసు (చాలావరకు) పని చెయ్యదు. అంటే ఇంద్రియాలు మనసులో, మనసు ఆత్మలో అణగి వుంటుంది.

ఇట్లాంటి వ్యాసాలపైన ఆలోచనలు చెయ్యకండి. మొదట నిష్ప్రయోజనం.

(2) ఏదో తెలుసుకుంటున్నా మనన్నట్లు మోసం చేస్తుంది.

(3) మన ఆలోచనలో తప్పు వుండవొచ్చు. ఆలోచన లేనిదే సత్యం.

కనక ఆలోచన అనగానే ఎంతో కొంత అబద్ధం.

మనం ప్రయత్నించేది ఆలోచనల్ని తగ్గించు కోడానికి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 60

శ్రీరమణస్థాన్
6 – 2 – 60.

జగ్గూభాయ్,

మీ కార్డు. చిక్కడు తీగలపైన ఒక కాఫు సిద్ధంగా వుంది. కానిఅవి దేవతాలోకానికి పోయే మొహం పెట్టాయి. నీళ్లా! ఎండలు! ఎన్నినీళ్ళు పొయ్యగలం?

పచ్చబొట్టు మనిషి దొరకలేదు మీరిక్కడ వున్నప్పుడు. అతన్ని పిలిపించి మాట్లాడి వుంచుతాను.

మళ్ళీ నీలం నీసానీళ్ళు ప్రారంభించాను. మీకు వేడి తగ్గిందా ?

'ఏసు శుభవార్తలు' అచ్చుకాపీ తయారు చేస్తున్నాము.

పెద్దపని అది.

కొంచెం ఓరుబడి కాగానే తలకి మన్నుకూడా పట్టిస్తాను.

ఇక్కడ చలి పూర్తిగా పోయింది. కాలం బాగుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 61

శ్రీరమణస్థాన్

12-2-60

జగ్గూబాయ్,

మీ ఉత్తరం. నేను పంపిన విభూది అందేవుంటుంది.

సోక్రటీసుని గురించి ప్రత్యేకంగా రాయడానికి ఏం లేదు—ఏమీ తోచటంలేదు. అతనివల్ల ఉపద్రవమని యువకుల బుద్ధులు వకిస్తున్నాయని, ఆ ప్రభుత్వంవారు విష మిచ్చి చంపేశారు.

ఆయన హిందూ వేదాంతంలాంటిదే బోధించారు.

కాలం బాగా జరుగుతుందంటే మీకు సంతోషంగా ఉంది.

'మార్పులు' చేపలుతినే అదృష్టం ఈజన్మకి మరిలేదు.

మీ లోపాలన్నీ రాయాలా! మనిషికి లోపాలు వుండవా? ఎవరి లోపాలన్నా చదవాలంటే నాకు బాధ!

కాని మీకు తప్పకండా రాసి తీరాలనిపిస్తే రాయండి.

ఎన్నో మంచి ఉత్తరాలు రాస్తారుమీరు. జవాబు రాయడానికి ఏమీ కనబడదు. నానిర్లక్ష్యం అనుకోకండీ

మీరడిగిన ప్రశ్నలకి జవాబులేదు మనిషి అట్లా పుడతాడు. అంతే-కాని వివరాలు వుంటాయి. కాని రాయాలంటే ఏమీలేదు.

నేను చేసినవి ఏవీ ఆలోచించి చేసినవి కావు. చెయ్యడానికి కారణమూలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 62

శ్రీరమణస్థాన్
16—2—60.

జగ్గూభాయ్,

మీ పెద్ద ఉత్తరం—

చాలాఏళ్లు తెలుగు ప్రజ, నాలో లేని ఘోరాల నెన్నో నా కాపాదించారు. ఇంకా అపవాదులు ఆ దేశంలో నామీాద వేళ్లాడుతూనే వున్నాయి.

ఇప్పుడు ఉత్తములైన మీబోటి మిత్రులు నాలోలేని గొప్పగుణాల్ని నాకు ఆరోపిస్తున్నారు. అదంతా నామీది మీ వాత్సల్యం.

నా ఒళ్లు బద్ధకం, నా బద్ధకం వేరు. మెదడూ, చేతులూ, నడుమూచేతులూ పనిచెయవు. అట్లాంటి బద్ధకం.

మీ ఆదుర్దా నా ఆరోగ్యంకోసం.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 63

శ్రీరమణస్థాన్
22 – 2 – 60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం, మీరు పంపిన కటింగ్సుతో సహా— శ్రీ శ్రీ రాసిన గీతాలు పూర్వం అతను రాసే సందేహాలే— ఇదివరకటి అందంకూడా లేదిప్పుడు వాటికి. ఆ సందేహాలు వృత్త కవిత్వంకాకుండా, అవి గట్టిగా హృదయాన్ని పట్టి, 'ఎక్కడ' 'ఎక్కడ' అని తహతహలాడితే, అతనికి ఎప్పుడో దొరికేది కాంతి—ఋషులు 'ఇట్లా అన్నారు అట్లా అన్నారని వృత్త థియరీ రాస్తారుగాని, అసలు ఆ ఋషులు ఏం చెప్పారు? ఏంచేస్తే ఎట్లాతెలిస్తే సత్యం గోచరిస్తుందన్నారు, అనేది ఎత్తుకోరు. దాన్ని ఎత్తుకుంటే తమ గొప్పలిని, సుఖాల్ని వొదులుకోవలసివొస్తుంది.

ఏ మార్గమైనా, ఏ నమ్మకమైనా, మనోవాక్కాయ కర్మలతో విశ్వసించి, జీవితాన్ని ఫలాభాపేక్ష లేకుండా అర్పిస్తే దొరుకుతుంది సత్యం. "ఎక్కడ ఎక్కడ?" అని కొట్టుకోవాలి.

ఆ బీదల రోదనమైనా కవిత్వానికి ఆధారమయింది గాని శ్రీశ్రీకి, అదొక జ్వలించే సమస్య కాలేదు. కవిత్వం రాయడం తప్ప ఏంచేశాడు? ఈ రాజకీయ ప్రముఖుల ఉపన్యాసాలలాంటివే అదీని. పదవులకోసం, కీర్తికోసం.

ఆ 'లత'గారిది నీళ్ళు నీళ్ళుగావుంది. ఓ తీవ్రకాంక్ష కనపడదు, పత్రికల కెక్కడం తప్ప.

మనిషి సుఖం (ప్రత్యేక వ్యక్తి సుఖం) సమిష్టిగా లోకానికి సుఖం, ఈ రెండూ వేరు. ఈ రెండూ రెంటిని కలిపి రాస్తాడు శ్రీశ్రీ. అందువల్లనే అతని హృదయం వైసాల్యం—అందువల్లనే అతని ఆలోచనలో తికమక.

సుఖాన్ని కోరినన్నాళ్లూ బాధ తప్పదు. మనిషికి గాని, లోకానికికాని. సుఖానికి కాని, సుఖానికి నీడ బాధ మనిషి కావాలి మనిషి నీడ వొద్దన్నట్లుంది. సౌఖ్యాల పైనించి మనసుని తొలగించినప్పుడు సౌఖ్యాలకి కారణమైన అసలు ఆనందం గోచరమౌతుంది. రంగుల మబ్బులేన్ని చూస్తానంటాడు మానవుడు, వాటి వెనకవుండే సూర్యుణ్ణి అతని కళ్ళు భరించలేవు గనక.

'లత' ఎవరో నాకు తెలీదు.

వొచ్చిన ఖర్మం, శ్రీశ్రీ వెతకటంలేదండీ — అతని వెతుకులాట అంతా కవిత్వంలోనే.

ఇవ్వాళ్ళ మళ్ళీ మీ ఉత్తరం, మధ్యాహ్నం జాబు రాస్తాను.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 64

శ్రీరమణస్థాన్
23–2–60.

జగ్గూభాయ్,

ఇవాళ నేను రాసిన ఉత్తరం అందివుంటుంది. మీ ధ్యానం సాగడం సంతోషదాయం—

టాగూరు పుస్తకాలకి పబ్లిషర్ కావాలి. ఆ ప్రయత్నమే చేస్తున్నాను.

మీరు రాసిన నా కితాబులన్నీ పూర్వం ఎప్పుడో నా పుస్తకాలు అచ్చువేసిన అభిసారికా గ్రంథమండలివారు నాడారు. వాళ్ళు కాలేజీ అబ్బాయిలు - వాళ్ళ ఉత్సాహంలో వాళ్ళకి తోచిన టైటిల్సు అన్నీ నాకు అంటగట్టి అచ్చువేశారు.

ప్రపంచం వైఖరి చూశారా !

నన్ను అచ్చులోకూడా చాలా తిట్టుపేర్లతో పిలిచారు. వాటి విషయమై ఎవరూ ప్రశ్నించరు ఏదన్నా

గొప్ప పేరుపెడితే అవేవో నేను పెట్టించుకున్నట్టు, మిమ్మల్ని అడుగుతారు. ఏమని "నువ్వేదో చలం గొప్ప అంటున్నావే ! చూడు ఎంత డాంబికమో !" అని.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 65

శ్రీరమణస్థాన్
2—3—60.

జగ్గూభాయ్,

మీఉత్తరాలు స్త్రీ, పురుషుల సంగతులు మీరడిగారే అవి ఆయావ్యక్తులపైన పరిస్థితులపైన ఆధారపడతాయిగాని, స్త్రీఇది, పురుషుడిది అని చెప్పడం కష్టం. జనరల్గా స్త్రీలోనే సాధారణంగా ఒకరిపై మోహం కలుగుతుంది. కాని ఆమె దాచుకుంటుంది. తెలుసుకునేది ప్రయత్నించేది పురుషుడే బలహీనురాలు గనక మాయ, అబద్ధమూ కల్పించేది స్త్రీ పురుషుడేధైర్యంగా ముందుకొవుకుంటాడు. కానిస్త్రీసాహసించిందా పురుషుడుపనికిరాడు. స్త్రీలోనే కామం అధికం. కాని పైకి కనబడేది పురుషుడిలోనే. ఈ విషయమై అనుభవాల విలువ బైటకన్నాహృదయంలో ఎక్కువ ఏర్పడుతుంది. ఇవన్నీచాలా వరకు 'స్త్రీ'లో రాసినట్టే జ్ఞాపకం.

2-3-60

మీకు నేను రాసిన కార్డుచదివి, ఈశ్వరుడు ఇట్లా దిద్దారు.

"స్త్రీలో కామం తక్కువ. గనుక పైన ఆధారపడి వాటివల్ల పాలింపపడుతుంది.

అందువల్లనే ఆమె పురుషుణ్ణి ఆడించకలుగుతోంది. ఆమెలోనే కామం ఎక్కువైతే పురుషుడుకి దాసి కావలసిన గతిపట్టేది" అని.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చ లం

# 66

శ్రీరమణస్థాన్
18—3—60

జగ్గూభాయ్

మీఉత్తరం వచ్చేప్పటికి సభా గారు కూడా ఇక్కడే వున్నారు. తాంగ్రడ కూర్మారావుగారి గేయాన్ని ఆయనకి ఇచ్చేశాను.

మీరురాసిన "చంఘిజ్ ఖాన్" విషయాలు ఎంతో బాగావున్నాయి.

తత్వశాస్త్రం మొదలైనపుస్తకాలు చదవొద్దన్నారు మిమ్మల్ని ఈశ్వరుడు. అవి మనస్సుని చిక్కులో పెట్టడం తప్ప ఏమాత్రం వుపయోగించవు

ఈశ్వరాశీర్వాదాలతో
—— చ లం

# 67

శ్రీరమణస్థాన్
24—3—60.

జగ్గూంభాయ్.

ముగ్గురు గొప్పవారి చరిత్రని కళ్ళముందుకి తెచ్చిన మీా ఉత్తరం.

స్త్రీపైన ప్రేమకన్నా కూడా ఇతర ప్రాణులపైన ప్రేమ గొప్పది. ఎవరినైతేనేం తనకన్న గొప్పగా ప్రేమించ డమే ముఖ్యం.

మీా ఉత్తరాన్ని ఎంత గొప్పగా చదువుకున్నామో

ఎప్పుడూ ఇట్లాంటి బేరాలు పెట్ట కూడదు - బేరాల దేవుడు తిరుపతిపై వెలసి వున్నారు. వారికి మొక్కుకో వచ్చునే! తమ ప్రార్థన నెరవేరుతుందనే పూర్ణ విశ్వాసం వుంటేనే రమ్మనండి మీా మిత్రుల్ని.

సంతానం కలగడానికని మీారు అనుకునే మార్గాలు సనాతనమైనవే. కౌరవ వంశమంతా. ఋషి సంతతే ఈకొత్త నాగరికతలోనే ఇట్లాంటి కుహనా నీతులు—.

తాండ్రవారి భగవాన్ పై గేయం గావుంది. సభాన్ గారికి పంపడ మయింది

తాండ్ర వారింట్లో ప్రశస్తమైన తాండ్ర చేస్తారా? లేక పౌరుషం తయారుచేస్తారా!

అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

## 68

శ్రీ రమణస్థాన్
16-3-60

జగ్గూభాయ్

మీ రెండు కార్డులు. ఇవాళ మీ పెద్ద ఉత్తరం ఇక్కడ కూడా వడగళ్ళ వాన కురిసింది. కోడిపెట్టలేగాని పుంజులు రుచికావు అంటారుకదూ! మా అల్లుడు మాకు లీకులు తెచ్చిపెడతారు. మీ అల్లుడు మీకు కోడిపుంజుల్ని పంపుతారు. అన్నిటిమల్లేనే ఈ సంబంధమూ ఈ కాలంలో తలకిందులైనట్టుంది. ఇప్పుడు అల్లుళ్లు మామలకి సప్లై—

మీ పెద్ద ఉత్తరంలో మీరు రాసిన ప్రతి అక్షరమూ సత్యం.

ఇవాళ నావొళ్ళు బాగాలేదు అయినాపోష్టుమాష్టరు మల్లే ఈదినం టపాసిద్ధంచేస్తేనే కాని నిద్రరాదు.

మీరు చీట్లపేక మానండి. ఏంమానండి, పెద్దమనిషి ఎన్నటికి కాలేరు.

మీరు మీ ఉత్తరంలో తిరిగి తిరిగి ఈ ధనవంతుల్ని తిడుతోవుంటే, ఏసుబైబిల్లో ఆనాటి మర్యాదస్తుల్ని తిట్టడం

జ్ఞాపక మొచ్చింది - వాళ్ళని 'విషసర్పాలలారా,' అని పిలుస్తారు ఆయన-

దీనులపైన ఈ అధికారులు చూపే క్రౌర్యాన్ని తిట్టిన మన ప్రపితామహుడు ఆయన-తిట్లలోకూడా చలం ఆయనకి ఏ మాత్రం సరిపోలడు. ప్రేమలో అసలు ఏ మూలకీ పోటీకి రాలేడు.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 69

శ్రీరమణస్థాన్
2 - 4 - 60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం-నాగత జన్మసంగతి వజీర్ రహ్మాన్ రాసేవుంటారు. ఇంక అంతకన్న రాయడానికి ఏం కనబట్టం లేదు.

మీపూర్వజన్మని గురించీ ఆయన రాసేవుంటారు.

హిందూ పతివ్రతల విషయమైనా పైన ఒకటి రెండు సభలుచేసి గవర్నమెంటుకీ, యూనివర్సిటీకి ఫిర్యాదు చేశారు. అసలు పుస్తకాలు రాస్తున్నానని అధికార్లకి రాశారు, చేయ గలిగింది చేసారు. కోర్టులో పెట్టడానికి చాతగాక ఊరు కున్నారు-

ఈశ్వరుడి సంగతి వ్రాయగలిగిందంతా మీరే రాశేశారు. ఇంక రాయడానికి నాకేం మిగలలేదు—

మీ మిత్రుడు నిదర్శన మంటాడే, అంటే ఏమిటో కనుక్కోండి.

చలం ఎట్లా నమ్మేడు? అనేనా ఆయన ప్రశ్న?

లేక

ఆయనకి ఏదన్నా నిదర్శనం కనపడితే ఈశ్వరుడులో నమ్మాలనివుందా?

ఏదయినా విశ్వాసమనేది హృదయానిది - మనసుది కాదు. నిజమైనవిశ్వాసానికి కారణంకనబడదు, ప్రేమలేనే, మనిషిలో గొప్పదనమల్లేనే, పువ్వులో పరిమళం మల్లేనే.

ఈశ్వరాశీర్వాదాలతో

— చ లం

## 70

శ్రీరమణస్థాన్
7—4—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు చాలాబాగున్నాయి. పిచ్చివాళ్ళలో రెండురకాలు. ఆనందమిచ్చే పిచ్చి, దుఖఃమిచ్చే పిచ్చి, ఆనందమిచ్చే పిచ్చి గొప్ప అదృష్టం.

పిచ్చివాళ్ళ మనస్తత్వం ఒక విధంగా వుండదు. చెప్పాలంటే, ఒక్కొక్క-పిచ్చి ఒక్కొక్క-రకం.

మేలో వస్తారా? చాలా బావుంది. ఇంక ఒక్క నెల.

"దేవదత్తం" మళ్ళీ ప్రారంభమయింది.

ఈశ్వరాశీర్వాదాలతో

— చ ల ం

# 71

శ్రీరమణస్థాన్
9 – 4 – 60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం

"శుభవార్తలు" సంవత్సరం నించి రాస్తున్నాను. కొత్తేముంది?

ఉత్తరాలకి జవాబులు మామూలుగా నడుస్తోనే ఉన్నాయి.

వజీర్ రహ్మాన్ నా వార్తలు మీకు తెలియ చెయ్యాలని రాశారు కాని, మిమ్మల్ని ఉత్తరాలు రాయవొద్దని కాదు.

కనుక ఎప్పటి మల్లేనే రాయండి మీనించి ఉత్తరాలు లేకపోతే ఎట్లా?

ఆమెవిషయమై ఎవరన్నా పోలీసు రిపోర్టు ఇవ్వకూడదా?

ఆ కార్డు రాశానా, దానిమీద ఇంకా ఆలోచనలు వొచ్చాయి.

ఆమె ఎవరో ప్రియుడితో వుంటే పట్టుకున్నారంటే, పూర్వంమల్లేనే నా రక్తం భగ్గుమంది. "ఏం చెయ్యలేమా ఈ 1960లో కూడా ఇంతేనా!" అని. కాని వెంటనే చల్ల పడ్డాను. ఈ విధంగా మేము ఎంతో కష్టించి, భర్తలనించ, సంసారాలనించి, విముక్తినిచ్చిన స్త్రీలు జ్ఞాపకంవొచ్చారు.

గట్టి పట్టుబట్టి మీబోటివారు పోలీసు డిపార్టుమెం టుని కదలించి, ఆమెను వదిలించవచ్చు. ఆ ప్రియుడే పోలీసు రిపోర్టు ఇవ్వాల్సింది—

కాని ఇంతా వొదిలిస్తే, ఎక్కడో ఏ అదృష్టవంతు గాలో తప్ప, తక్కినవారు ఏ గతికిపోతారో! నేను కష్టాలు అనటంలేదు. బీదతనమన్నా, మృత్యువన్నా భయంలేదు. ఇంటిదగ్గిర ఘోరమే, అక్కడ స్త్రీ ఆత్మ అణగారిపోయింది. లోకంలోపడ్డ స్త్రీ ఆత్మ పుచ్చిపోతుంది చాలాసార్లు

ఏసు అంత గొప్ప కరుణతో, మహిమతో, గుడ్డి వాడికి చూపునిస్తే ఆ చూపుతో అతను కొంతధనం సంపాదించి, బిచ్చగాడల్లా మర్యాదస్తుడై "ఈ ఏసు దుర్మా ర్గుడు, శిలవవెయ్యండి" అని అరిస్తే ఎట్లావుంటుంది ?

అట్లానే అరిచారట ఏసునించి ఉపకారం పొందిన వాళ్ళు—

"శుభవార్తలు" మీరు వచ్చేప్పటికి ఆ పని అంతా పూర్తి అయివుంటుంది.

మీ ఉత్తరాలలో ఏమో అడుగుతూవుంటారు. నేను మరిచిపోతూవుంటాను.

నా పళ్ళు బాధించడం ప్రారంభించాయి కొంత కాలంనించి.

ఈశ్వరాశీర్వాదాలతో
—చ ల ం

## 72

శ్రీరమణస్థాన్
24 – 4 – 60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం- ఈ కింది రాసే రెండు సంగతులూ స్పష్టంగా తెలీక పోవడంవల్ల మీరు పడుతున్న తర్కంలో నేనూ చాలా వేళ్ళు బాధపడ్డాను.

(1) మనవల్ల ఏదన్నా మంచి ప్రపంచానికి జరిగితే, అదిమనని ఉపకరణంగా చేసుకుని ఈశ్వరుడు చేయించారు. మన ప్రయోజకత్వం లేదు-

(2) అసలయిన ఉపకారం, త్యాగం. ఇట్లాంటివి ఆలోచనా పూర్వకంగా, ప్రయత్నించి జరుగవు. ఉపకారం చేస్తున్నాం, లేక జరుగుతోంది. అనే ఆలోచన వుండదు.

(3) మనం ఆలోచించి చేసేదైనా, ప్రతిఫలాపేక్ష లేకుండా చెయ్యాలి. అంటే, లోకం మారినాసరే, మనపని

వల్ల మంచిజరగనీ, చెడుజరగనీ, మనం చెయ్యాలనుకున్నది చేసి తీరవలసిందే. అప్పుడు డిసప్పాయింట్‌మెంట్, నిష్ఫలత కలగదు.

(4) ప్రతి నిష్కామం, నిస్వార్థమైన పనివల్లా ఇతరుల కన్న చేసేవాడు ఉన్నతుడౌతాడు.

అతనివల్లనే లోకానికి అందరికన్న ఎక్కువ ఉపకారం జరుగుతుంది.

కనకనే ఇతరులకి ఉపకారం జరగలేదనీ, ఉపకారం పొందినవారే అపకారం చేశారనీ, ఎప్పుడూ ఉపకారంచెయ్య డం మానకూడదు.

ఉపకారం చెయ్యాలని పనిపట్టి, చెయ్యనక్కర్లేదు.

అవ్యాజంగాహృదయం ఎక్కడఎప్పుడు కదలుతుందో అదిచేసేసి, ఇంక వెనక్కి చూడకూడదు.

లోకం ఇంతఘోరంగా ఎందుకు వుండాలి? అనే ప్రశ్నకి జవాబులేదు. లోకంతీరు అంత. కందకి దురద ఎందు కుండాలి?

ఆ ప్రశ్నకి ఇప్పుడప్పుడే జవాబు దొరకదు.

ఆ ప్రశ్న వొదిలి, సరే ఇట్లాంటిలోకంలోకి వొచ్చాం. ఇప్పుడేం చెయ్యాలి అనేదే ముఖ్యమైన ప్రశ్న కావాలి.

తన్నేవాడివల్లా, బాధించేవాడివల్లా, ఏనాడయినా ఉపకారం, ప్రయోజనం వుంటుందనే ఆశతో వాళ్ళని గౌర విస్తారు.

మెత్తనివాడు, అప్రయోజకుడు లోకందృష్టిలో. అతని వల్ల ఏనాడూ ఏమీ ప్రయోజనం వుండదని నమ్మకం.

అంతా ప్రయోజనం-

"ధర్మమే జయం' అనివాళ్ళు ఏ అర్థంలో అన్నారో అదిచూడాలి మనం - మనఅర్థంలో (మనంచూసే ఈ కాస్త కాలంలో, ఈకాస్త స్థలంలో) ధర్మం జయించలేదు, గనక అది అబద్ధమన కూడదు.

ఆవిధంగా చూస్తే ఏసుబోధ అంతా అబద్ధమే.

అవును. ఏసు, "దీనులదీ. దరిద్రులదీ ఈరాజ్యం" అన్నారు. అంటే చేతకానివారిదీ, అప్పులపాలైన వారిదీ అని కాదు. కావలసి ధూర్తత్వం వొదులుకుని, పోటీలు పడక, "సరే మీరేతీసుకోండి" అన్ని వదలిన వారిది. దరిద్రులంటే, వున్నదంతా తగలేసుకుని ఏడ్చేవారిది కాదు. సన్యాసత్వం హృదయంలో స్వీకరించి,"నాదేమీలేదు" అనుకున్న వారిది.

ఈ అర్థాలెవరికి తెలుసు?

బీదవాడూ స్వార్థపరుడే.

ఈమతాల బోధలు.

"సరేలే, ఈలోకంలో కులుకుతున్నావు.

ఆ లోకంలో చూసుకో ఏమవుతుందోనీపని! ఈనాడు కష్టపడే వాళ్లం అక్కడ సుఖపడతాం" అంటారు.

దారిద్ర్యం, దీనత్వం ఇవన్నీ పైవికావు. చేతకాక తన్నులు తినేవాడు దీనుడు కాదు.

అట్లా ఎంతన్నా రాయవొచ్చు.

నా తెలుగు బైబిల్లో ఈ కొత్త అర్థాలు చెప్పిస్తున్నారు ఈశ్వరుడు.

అవి తెలుసుకునే వారుంటారు ఎవరో ఒకరన్నా మీ జోటువారు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 73

శ్రీరమణస్థాన్
5—5—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం—

ఇప్పుడేకాదు ఎప్పుడూ అంతే. ఎప్పుడో నన్ను కలుసుకున్న తరవాత మిత్రులు చెప్పేవారు "ఇన్నేళ్ళు మిమ్మల్ని చూడలేకపోయేము. చూడాలంటే భయంగా వుండేది" అని. ఎందుకు ఆ భయమని అడిగితే, వాళ్ళకీ తెలీదు, నాకూ తెలీదు.

డాలీకి ముళ్ళపంది ముళ్ళు కావాలిట. తెచ్చి పెట్టండి.

మీ అమ్మగారికి ఎట్లావుందో? సూర్యప్రసాద్ భార్యాసమేతుడై వచ్చి నిన్న వెళ్ళారు.

చిక్కాల వొచ్చి వున్నారిక్కడ — వీ కేశలింగంగారు త్వరలో వొస్తున్నారుట. మిత్రుడుంగో.

నాకేం శ్రమలేదు, మీరు రాసినవి నాకు అంగీకారమైనవైనాసరే, కానివైనాసరే. చిత్రా పిల్లలూ వొచ్చారు. ఎక్కడా తీరికలేదు

కూర్మారావుగారు, ఇంకారాలేదు. ఏమైనారో !

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 74

శ్రీరమణస్థాన్
6 – 5 – 60.

జగ్గూభాయ్

మీ ఉత్తరం. ఈ ప్రేమ వ్యవహారాల సంగతి ఇది సిద్ధమని తేల్చడం కష్టం—ముఖ్యంగా ప్రారబ్ధం నిర్ణయిస్తుంది, మనిషి నడకని.

ఏమైనా ఈశ్వరుడిలో భక్తి విశ్వాసాలువుంటే ఎటువంటి ఆపదలోంచీ బైటికి రాగలడు. స్త్రీకన్న ఈశ్వరుణ్ణి కాని, తాను లోకంలో చెయ్యవలసిన పనికాక (Emotion కూడింది) కళ, రచన, దేశభక్తి, సేవ మొదలైనవి ముఖ్యమైతే ఈ వియోగం అంత గట్టిగా మనసుని పాడుచెయ్యదు.

కొందరికి అసలు శృంగారంగాని, ప్రేమగాని లోతుగా వెళ్ళదు. వాళ్ళకే అపాయమూ లేదు. కొంతమంది ధీరులు, మనోబలం కలవారుకూడా ఈ ఆపదకి లొంగిపోతారు.

ప్రేమ చాలా విశాలమై, తాను ప్రేమించే స్త్రీ ఇంకొకరికి బలవంతంగా కట్టిపెట్టబడినా, చచ్చిపోయినా,

ఇంకా ప్రేమిస్తూనేవుంటారు. దేహం అంత ముఖ్యంకాదు వాళ్ళకి.

ఇవన్నీ ధీరుల లక్షణాలు.

పైన చెప్పిన పద్దులకిందికి రానివారు.

మనసులో దుర్బలులైనా,

ప్రేమ చాలా బలీయమైనా,

తట్టుకోలేరు. చచ్చిపోతారు. చచ్చిపోనివారికి పిచ్చెక్కుతుంది.

వీరిలో కొందరు అదృష్టవంతులు తమ బాధని కళలోనో, సేవలోనో పలికిస్తారు. ఈశ్వరుని శరణు కోరుతారు. ఏ యోగిదగ్గరకోపోయి తమ బాధనితీసెయ్యమని ప్రార్థిస్తారు.

డబ్బులో, సంసారపు బారియల్లో, స్వార్థంలో జీవితాన్ని ఇరికించుకున్నవారికి ఇట్లాంటి ప్రేమబాధలేవీ వుండవు. ఈ గొడవ వాళ్ళకి అర్థమేకాదు.

మానవ స్వభావం అనేక విధాలు. ఆ మానవుడు అట్లా ఎందుకు కావాలి! అని ప్రశ్నించడానికి మనకు హక్కులేదు. మన స్వభావం వేరు, పరిస్థితులు వేరు.

మీ ప్రశ్నలకి జవాబులు దొరికేవుంటాయి ఈ పాటికి. ఐనా వివరిస్తాను.

కృష్ణారావుగారు మారిపోవడానికి ఆయన ప్రేమలో తిన్న పెద్దదెబ్బ. "ఆమె లేనిది, నాకివన్నీ ఎందుకు?" అంటున్నాడాయన నాకు అర్థమౌతుంది నా కళలన్నీ ఆ బాధనే విశదంచేసి, చూపాలని ప్రయత్నించాయి.

ఏది సహజమో, ఏది అసహజమో ఎవరు నిర్ణయించగలరు ?

"ఆమె లేకుండా నా బ్రతుకెందుకు ? చావలేను. కనక నేను ఇట్లా బతుకుతున్నాను" అంటారు ఆయన.

విజ్ఞానం, వివేకం ఉన్నాయి. కాని వియోగం మరీ బలమై, వాటిని మింగేసింది.

ఆమె లేనిది ఆతనికి వేరే విలవలులేవు. అదొక్కటే విలవ——

ఈశ్వర భక్తికూడా అంతేకదా ! లోకం విలువలు మీాకున్నాయి. అతనికి లేవు.

మనసు దృఢం చేసుకునే శక్తి ఆయనకులేదు. ఎందుకు చేసుకోవాలో కారణమూా కనపడదు ఆయనకు.

తిరిగి ప్రేమించే శక్తి ఒకరికి వుంటుంది. ఇంకొకరికి వుండదు.

కుంగిపోనక్కరలేదు. నిజమే, కాని కుంగిపోతారు.

పిచ్చివాడు సంతోషపు పిచ్చిలో పడ్డాడా అది అతనికి గొప్ప అదృష్టం.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 75

శ్రీరమణస్థాన్
15—5—60.

జగ్గూభాయ్,

మీ రెండు ఉత్తరాలు. మీ అమ్మగారు చచ్చిపోతే ఆమెకీ విడుదల, మీకూ విడుదల. ఈ సంఘటన ఈశ్వరుడే ఉద్దేశించినట్టున్నారు. మీరు అవసరమేమో మరి ఈశ్వరుడికి!

చూడండి, మీ అమ్మగారికి ఎంత వైరాగ్యమో! అందుకనే మీకూ అంత దగ్గరయింది సత్యం.

నే నన్నాను "జగ్గారావుగారి తల్లి కానీ చేతిలో లేకుండా, అంత పెద్ద ప్రయాణం బైలుదేరుతున్నారు. తన కొడుక్కి ఇంకా మిగిలిన కొన్ని ఏళ్ళ ప్రయాణానికి డబ్బు దాచుకోమని చెప్పుతున్నారు" అని.

మీ రెండో ఉత్తరంలో రాశారే, ఆ నీతినియమాలు పూర్వంనించి చెపుతున్నారు, గొప్ప ప్రవక్తలు. అనేక నీతుల్ని ధర్మాల్ని చెపుతారు, తమ తరవాత లోకంలో నిలవాలనే ఉద్దేశ్యంతో. కాని ఏ ఒక్క ధర్మాని గట్టిగా పరిపాలించినా చాలు, తక్కిన ధర్మాలన్నీ నాటే వెంటనే వుంటాయి. ఏ ధర్మాన్నయినా, సంకుచితంగా తీసుకున్నప్పుడే తక్కినవాటినికూడా విడిగా అనుష్ఠించాల్సిన అవసరం పడుతుంది.

ఇంట్లో అతిథులు. రాత్రికి కూర్మారావుగారుకూడా వొస్తారేమో!

కూర్మారావుగారు రాలేదు. తన ప్రయాణం ఆపుకొని వజీర్ రహ్మాన్ ఆయనకోసం ప్రతిబండిలోకీ తొంగిచూస్తు న్నారు. పోనీ, ఆయన పేరుతో ఎవరో ఒకర్ని పంపండి.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 76

శ్రీరమణస్థాన్
19 – 5 – 60.

జగన్నాథ్ బాయ్,

మీ ఉత్తరం ఇవాళ. కూర్మారావుగారు మొన్న రాత్రి వొచ్చారని రాశానుకదూ !

నా వుద్దేశ్యం తెలుపమన్నారుకదూ. మీ అభిప్రాయాన్ని గురించి తెలుపుతాను.

"మనవంటి మొండివారు, బరితెగి విచ్చలవిడిగా సంచరిస్తారు. ఏమీ పాటించకుండా, మర్యాద, రహస్యమనేది లేకుండా."

మనం మొండివారంకాదు. ఈశ్వరుడంటే తప్ప. ప్రజలంటే భయంలేనివాళ్ళం.

బరితెగి విచ్చలవిడిగా సంచరిస్తారు. అట్లా సంచరించడం ఏమీ గొప్పపనికాదు.

వాళ్ళ దొంగనీతిని, పిరికి ధర్మాన్ని మనం అంగీకరించం. కాని మన నీతి, మన ధర్మం మనకి వుండనే వున్నాయి.

మర్యాద ఎందుకు వుండకూడదు — దొంగ మర్యాదని పాటించం. మర్యాదకోసం తంటాలుపడం. మర్యాదకోసం ఏ విలువనీ వొదులుకోము.

రహస్యం. అవసరమైనప్పుడు వుండవలసిందే విలువైన వాటిని ప్రతివారి కళ్ళయెదుటా పెట్టి, చవక చేసుకోము.

"కోర్కెలు తీర్చుకోనకండా బాధపెట్టి త్రుంచివేయడం న్యాయంకాదు అనుకుంటాను" అని రాస్తున్నారు.

హానిలేని కోర్కెల్ని సులభంగా తీర్చుకోవడంవల్ల ఏనష్టమూ లేదు.

కాని ఏనాడైనా కోర్కెల్ని నిరాకరించుకోగల, జయించుకోగల బలం మనిషికి వుండాలి.

కోర్కెల్ని తను పరిపాలించాలి. కోర్కెలు తనని నడపకూడదు.

చాలాసార్లు, తన అభివృద్ధి కోసం కోర్కెల్ని అణచు కోడం అవసరమౌతుంది.

కాని సాధారణంగా మనుషులు లోకానికి భయపడి బైటికి కోర్కెల్ని అణుచుకున్నట్లు, అణుచుకొనిదొంగతనంగా కృత్రిమ విధాల తీర్చుకుంటారు.

అవును. మ కోర్కెలవల్ల ఇతరులకి ఉపద్రవం కలిగే ట్టుగా వుంటే. వాటిని అణుచుకోమని చెపుతుంది సంఘం. వాటినిమీరు అణుచుకుంటేచాలు సంఘానికి ఆకోర్కెలు అణిగి మీలోవునానా లేకపోయిన సంఘానికి పట్టదు, న్యాయ మేగా!

ఏలోపాలనైనామనం మనందాచిపెట్టుకుంటే పోవు కావు కాని వాటిని పోగొట్టుకోవాలని మనం గట్టిగా నిర్ణ యించుకుంటే, తప్పకుండా పోతాయి. ఈశ్వరుడి సహాయాన్ని అడిగితే, మరింత త్వరలో ఆనీచాలు నిర్మూలమౌతాయి. దాస్తే పోవుగాని, మనం యత్నిస్తే మనలోపాలు భస్మ మౌతాయి.

కోర్కెలిన్ని తీర్చుకున్నకొద్దీ వాటిబలం మనమీద హెచ్చుతుంది.

మనలోని లోపాల్ని మనం ఏఉద్దేశ్యంతో తీసేసుకోవాలని చూస్తామో ఫలితం ఆ ఉద్దేశ్యంపైన ఆధారపడుతుంది.

మనం దొంగలమై ఆలోపాల్ని కనపడకుండా చెయ్యాలనుకుంటే, అవిమనకి తెలీకుండా మనలోనే దాగివుంటాయి. కాని వాటిని మనలో ఉండకూడదనే ఉన్నతోద్దేశ్యంతో, ఈశ్వర సహాయాన్ని కోరి యుద్ధంచేశామా, అవిత్వరలో నాశనమౌతాయి.

చేసినపనికి పశ్చాత్తాపపడి, ఇంక చెయ నని తీర్మానించుకోవడం, ఈశ్వరుడి సహాయం అడగడం.

జారిపోయినా, బెంగపడక, తిరిగి ప్రయత్నించడం.

అదే సాధన.

ఈశ్వరాశీర్వాదాలతో

— చ లం

# 77

శ్రీరమణస్థాన్

24—5—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు.

పుట్టడం చావడం అనేది లేకపోవాలి అని ఏ మానవుడన్నా నిశ్చయించుకుంటే, ఒక్క నిమిషం ఆ రెంటినీ

దాటిపోవడం. కాని సుఖాపేక్షవల్ల ఏ మానవుడు ఆ స్థితిని కోరుకోడు. అతనికి సుఖం కావాలికాని, ఆనందం అక్కర్లేదు. సుఖం అంటే వెంటనే బాధవుంటుంది.

లోకమూ ఇదంతా ఎందుకో ఆ రహస్యం తెలుసుకునే శక్తి, ఆ లోకంలో భాగమైన ఈ మనస్సుకిలేదు—

ఈ పంపు "దేవదత్తం' అందిందా? 8–జూన్ నించి పడతాయట శుభవార్తలు

మీరు నా కాలునొప్పికిచ్చిన వైద్యంకన్న, మీ చికిత్స భయంకరంగావుంది — పైగా ఆ ఱెల్లు!

మీ కవిత్వం ఎంతో బావుంది.

కూర్మారావుగారు మిమ్మల్ని తలచుకుని గర్వపడుతున్నారు

చలం ఎట్లా ఈశ్వరభక్తుడైనాడో అది మీరిక్కడికి వచ్చినప్పుడు చెప్పవలసిందే.

ఏది పాపం? పుణ్యం అనేదానికి ఒకటే జవాబు అది చలం జవాబు.

నీ అంతరాత్మలోకి చూసుకో, నీకు చాతనైనంత మాయపొరల్ని చీల్చుకుని. నీకే తెలుస్తుంది.

కాలాన్ని, దేశాన్నిబట్టి మారడమేమిటి? మనిషి మనిషికీ మారుతుంది నీతి మారదు. నీతికి సంబంధించిన పాప పుణ్యాలనే ఆచారాలు మారతాయి.

ఆ సంగతిని అంగీకరించదు సంఘం. అందరికీ ఒకటే నీతిని రుద్దుతుంది - అదే చలం తగాయిదా సంఘంతో—

మన అంతరాత్మ మనకేం చెప్పాలో శాసిస్తుంది సంఘం.

మనసు అంటే ఆలోచనలు. ఆలోచనల వెనక సాక్షిగా నుంచున్నది ఆత్మ. ఆకాశం—ఆత్మ - మబ్బులు—ఆలోచనలు అదే మనసు. అవును—మనసు నశిస్తేనే ఆత్మ (ఆకాశం) ప్రకాశిస్తుంది. కనపడుతుంది. అదే ఆనందం——

ఈ మనసే జగ్గారావు. మనసు లేకపోతే జగ్గారావు ఈశ్వరుడే——

ఏదుపంది ముళ్ళు త్వరలో పంపండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 78

శ్రీరమణస్థాన్
2–6–60.

జగ్గూభాయ్,

మీ కార్డు. వజీర్‌రహ్మాన్ త్వరలో ఇక్కడికి వొచ్చే స్తారు సంభయంలేదు. ఈశ్వరుడు చూస్తున్నాడు వ్యవహారాలన్నీ - సమస్యలకి భయపడి పరిగెత్తినా, దాక్కున్నా, వొది లేని కావు ధైర్యంగా ఎదుర్కోవాలి. ఆ బలం సంపాయించాలి అదిబాధేమరి !

ఆ విశాఖపట్నం పబ్లిషర్ చిరునామా వెంటనే రాయండి.

మీరుచెప్పిన వైద్యం చేస్తున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 79

శ్రీరమణస్థాన్

9 – 6 – 60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

విశాఖపట్నం కబుర్లతో వజీర్ రహ్మాన్ నిన్న వొచ్చారు. ఆవూరి చలంభక్తజనంమధ్య మీరెట్లా మెలగ గలిగారో! ఎవరిన్నీ తన్నకుండా అని ఆశ్చర్యంగా వుంది

సముద్రం నదీంముఖచుంబనంతో ఎన్నాళ్ళని తృప్తిపడు తుంది. ఒక్కసారి విజృంభించి తనప్రియురాళ్ళ జన్మస్థానాలకే పోయి అందర్నీ ఒక్కసారిగా తనలో ఐక్యం చేసుకోడానికి బైలుదేరి పోతోంది 1962లో–

సముద్రంపైన మీరు రాసిన కవిత్వం బాగుంది.

ఏడు పందిముళ్ళకి డాలీ తొందరపడుతోంది. వెంటనే ంపండి.

ఈశ్వరాశీర్వాదాలతో.

— చలం

# 80

శ్రీరమణస్థాన్
14–6–60

జగ్గు భాయ్

మీ ఉత్తరం.

విరోచనాలు కట్టడానికి మంచిమందు చెప్పారు. కనక ఆమందునికూడా మీరే సప్లయి చెయ్యాలి.

నాకు బ్లడ్ ప్రెషర్, చెవులో శబ్దాలు-

మీ ప్రార్థనను ఈశ్వరుడు విన్నారు.

ఇప్పుడే బావి తవ్వడం ప్రారంభించారు. నీళ్ళులేవు, వానలేదు. ఇప్పటినించి ఎక్కడ బతికించగలం చిక్కుడు మొక్కలిన్ని

మీరు వచ్చేప్పుడు తీసుకురండి, నిరుటిమల్లె మొద లెట్టుదురుగాని.

అవును. ఈఆధ్యాత్మిక అనుభవం అన్నిటికన్న శాంతి ప్రదం, ఆనందదాయకం.

మనం వెనుకటి సంగతులు జ్ఞాపకం తెచ్చుకునేప్పుడు సంతోషమైన సమయాలలో పొందిన సంతోషమే జ్ఞాపకం వొస్తాయి. కష్టాలు జ్ఞాపకంరావు. కష్టాలు జ్ఞాపకం తెచ్చుకుంటే ఆ బాధే జ్ఞాపకం వొస్తుంది. ఆనాటి సుఖం జ్ఞాపకం రాదు.

కనక అవి గొప్పగా అనిపిస్తాయి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 81

శ్రీరమణస్థాన్
16–6–60

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

వొళ్ళు బాగాలేదు.

మీరు రాసిన సందేహాల్ని "మ్యూజింగ్స్"లో సమగ్రంగా చర్చించాను, ఆనాడు నాకు తెలిసినంతవరకు.

ఇట్లాంటి సందేహాలకి అంతులేదు. సముద్రంలో అలల వంటివి. ఒకటి తప్పించుకుంటే, దానివెనక ఇంకోటి ఈ అలల్నిదాటి నిశ్చలమూ, నిర్మలమూ ఐన సముద్రం మధ్యకి మానవుడు చేరుకున్నదాకా తప్పవు. మానవుడి బుద్ధిబలం హెచ్చినకొద్దీ ఈ సందేహాల సంఖ్య హెచ్చుతుంది.

ఏదో జాబులు రాస్తాను. కాని వాటిపైన ఇంకా ప్రశ్నలువుంటాయి. స్వయంగా మాట్లాడుకుంటే కొంత మెరుగు.

మానవుల్లో (జంతువుల్లోకూడా) ఈ భేదాలు (నా అనుభవం) మనం అనుకున్నంత గొప్పవికావు. పరిస్థితులు ఎట్లాంటివైనా అసలు మానవుడు అనుభవించే, సుఖబాధలలో అంత భేదాలులేవేమో! జీవితంలో ఓ నాలుగు రోజులే చూస్తాము. జీవితమంతా కొలిస్తే అంతభేదం కనిపించదు.

అవును. ఈ భేదాలు పూర్వజన్మకర్మలవల్లనే కలుగుతున్నాయి.

కాని ప్రకృతి చిత్రాల్ని, వైషమ్యాల్ని, తారతమ్యాల్ని, లెక్కలు కట్టినట్టు మెషీనుమల్లే చూడకండి—

చిగురించే చెట్టు, జ్వలించే అగ్ని, పైకెగిరే జలపాతం, ఓ ఆర్టిస్టు ఊహాచిత్రం, గానం, కథాకల్పనలాగు చూడకండి. అంతా ఎక్కడా ఓ తోవా తెన్నూ లేనట్టే వుంటుంది. కాని గానంలో, కళలో, అది గొప్పదైతే, ఎన్ని రూల్సు. ఎంత ప్రొపోర్షన్, ఎంత న్యాయం, ఎంత సత్యం !

పాడుతోవుంటే గాయకుడు కావలసి సరైన తాళం వేస్తాడా ? దానంతట అదే పడుతుంది. అట్లానే ఈ సృష్టి విలాసంలో ఏదీ గతితప్పదు. ఎక్కడా అన్యాయం జరగదు. అందానికి, సంపూర్ణత్వానికి, లోపరాహిత్యానికి భంగం కలుగదు.

ఈ కార్యానికి ఈ ఫలమా ! ఈ జన్మకి ఆ జన్మ అని లెక్కలు పెట్టుకుని సందేహపడుతోవుంటే, అసలు ఈ నిరంతర నిర్వికల్ప మహానాట్యానికి అంధులవుతారు.

గొప్ప విశ్వాసంతో అదంతా ఈ జగన్నాటక సూత్రధారికి వొదిలేసి, హాయిగా విలాసంచూసి సంతోషిస్తో కూచోండి

తెరవెనక రంగులుపూసేవాళ్ళూ, డ్రెస్సులు వేసే వాళ్ళూ, చాలా నేర్పరులున్నారు. మనకెందుకా గొడవ ! నాటకమైనాక వీడికి ఈ రంగు ఎట్లా వొదులుతుంది ?" అని దిగులుపడుతో వుంటే, నాటకమేం చూడగలం ?

ఈ సందేహాలన్నీ మీ చుట్టూవున్న మనుష్యులు, పుస్తకాలు రేపుతాయి.

వీడికీ కష్టమేమిటి? వాడి కా లాభమేమిటి? సన్మార్గుల్ని మోసంచేసేవారికి శిక్షేమిటి? అంటో ఎందుకు వ్యర్థంగా జీవితాన్ని క్షుద్రం చేసుకోవడం?

ఈ సమస్యలన్నిటినీ, ఒక్కొక్కటే విప్పుకుంటో కూచుంటే, చివరికి జవాబు దొరికినా మనకేం వొరుగుతుంది.

జలప్రళయం చూడబోయేవారికి ఒక్కొక్క నీటి బొట్టు, ఎటులేచి ఎటుపడుతుందో చూడవలసిన దౌర్భాగ్యమేమిటి?

వీటన్నిటికి, మీ సందేహాలన్నిటికీ జవాబులున్నాయి-అవి అల్పులకి—మీకూ, నాకూ కావు.

దయచూపండి అన్ని ప్రాణులమీదా. నవ్వండి హాయిగా దయగా.

ఇదంతా ఓ తమాషా.

దునియా క్యాహై ఏక్ తమాషా.

ఈ తమాషాని మీ వినోదం చేసుకోండి.

మీకు చేతనౌను అది.

ఆ సరదాలోనే నిలిచిపోండి

మనసుమారిన కొద్దీ లోకస్వరూపమే మారుతుంది.

పైని రాసినవన్నీ మీకేకాదు నేను రాసేది. అంతకన్న ముఖ్యం నాకునేను బోధించుకుంటాను.

నెలాఖరులోగా "రుబాయత్" వెలువడుతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

## 82

శ్రీ రమణస్థాన్
25-6-60

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు- వైద్యం సంగతి సోమవారం రాస్తాను, ఈశ్వరుణ్ణి కనుక్కొని.

ఉత్తరాలు ఆపకండి.

ఇన్ని ఉత్తరాలు వొస్తుండగా మీ ఉత్తరాలేనా భారం! పైగా నేనేమీ యోచించ నక్కర్లేదు నాటికోసం.

నేనేమీ మెదడుపని చెయ్యటంలేదు.

నా ఆరోగ్యం అట్లా అట్లావుంది. వైద్యం సంగతి. ఈశ్వరుడు మీరు రాసిన మూడో వైద్యం, సిద్ధమకర ధ్వజం నిర్ణయించారు.

ఇంక ఖర్చు సంగతి, స్వల్పమేకద! మేము భరించ గలము మీకు సరదా తృప్తిఅయితే, దానికి అడ్డంరావడం ఇష్టంలేదు.

ఎట్లా అయినా సరే. మీరు మామూలుగానే ఉత్త రాలు రాయండి—

'మహాస్థాన్' సంగతి, అదెప్పుడో పూర్తిఅయింది. కాని కాపీలు పంపరు నాకు.

మీరెట్లా వున్నారో రాయండి.

మీ ఉత్తరాలలో ముఖ్యమైనవే దాచివుంచాను. కనుక ఎక్కువ కట్ చెయ్యనక్కరలేదు.

కూర్మారావుగారిని వాళ్ళవాళ్ళు బంధించారా? ఏడుస్తున్నారా ఆయన?

మీకు ఈశ్వరుడు విభూది పంపమన్నారు. సరే, పంపుతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 83

శ్రీరమణస్థాన్
30 – 6 – 60.

జగ్గూభాయ్,

ఇవ్వాళ వొళ్ళు బావుంది. ఇంక బావుంటుందేమో! ఈశ్వరుడు ఇన్‌జక్షన్ ఇప్పిస్తున్నారు. కాని ఆ సిద్ధమకరధ్వజ ట్రీటుమెంటుకోసం ప్రయత్నించండి.

మనుషుల హృదయాలు, అందులో స్త్రీ హృదయం ఆమెకే తెలీదు మనకేం తెలుస్తుంది.

మీకు చెప్పిన వ్యవహారంలో ఆమె పెద్దదయింది. పిల్లల్ని కన్నది. ఆమెకి రొమాన్సు, శృంగారం అవసరమయింది. మీరు ఆమె జాబితాలో ఉన్నారు. కనక అటు చేతులు చాచిందేమో?

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 84

శ్రీరమణస్థాన్
29—6—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

ఆ గోపీచంద్‌గాని, ఎవరూగాని, ఎందుకట్లా చలాన్ని అంటారో తెలుస్తోనేవుంది! నాకు ఆ మనుషులంటే అసహ్యంవేసేకదా వొదిలి వొచ్చేశాను. వాళ్ళేమనుకుంటే మనకేం? ఇంకా వొదలకండా అట్లా కోపిస్తున్నారంటే, వాళ్ళు ఎటువంటివాళ్ళో ఆలోచించండి.

అయినా వాళ్ళు ఏదో వాగితే మీ రెందుకంత ప్రాముఖ్యత ఇచ్చి మీ మనస్సులోకి తీసుకుని చర్చిస్తారు? నాకు ఇదంతా రాసే శ్రమ ఎందుకు? పోనీండి.

కూర్మారావుగారు నిన్న రాత్రి బైలుదేశారు. మా కబుర్లు చెపుతారు. అందరమూ ఆయన్ని చాలా ఇష్టపడ్డాము.

ఆయనకి నాపై ఎందుకంత ప్రేమో చెప్పారు ఈశ్వరుడు. నన్ను చిన్నప్పుడు ప్రేమించి చచ్చిపోయి తిరిగి పుట్టారు ఆయన. ఆ యన పూర్వజన్మ మిత్రత్వం 'మ్యూజింగ్స్'లోకూడావుంది.

మీరు రాసిన ప్రశ్నల్లో ఏదీ అసహజంకాదు. ప్రవృత్తులు వివిధరకాలు. ఇవన్నీ మనుష్యుల స్వభావాలూ, పూర్వజన్మ సంస్కారంమీద ఆధారపడతాయి.

శ్రీ రమణస్థాన్

జెలసీ చాలా సహజం. ప్రేమకి అదొక బలీయమైన బంధం. ప్రేమ అంటే మామూలు ప్రేమకి, గొప్ప స్టేజ్ కి వెళ్ళిన ప్రేమలో జెలసీ వుండదు.

పాపం మీకు, మళ్ళీ కోర్టువ్యవహారాలా ! ఆ విశాఖ పట్నం పబ్లిషర్ అడ్రసు ఇవ్వండి.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 85

శ్రీరమణస్థాన్
7—7—60.

జగన్నాథ్,

మీ రెండు ఉత్తరాలూ ఇవాళే అందాయి. నేను B. V. N. గారికి రాయాలా! ఎన్నిసార్లు రాశానో మననించి అచ్చుకి పుస్తకంగాని ఓటుగాని తీసుకున్నదాకానే, తరవాత పలుకుతారామనుష్యులు మీరింకా సత్యకాలంలో బతుకు తున్నారు. మానవుడిపై ఆశ ఇంకాపోలేదుమీకు. సరే లెండి తొందర పడకండి ఎప్పటికోప్పటికి 1962 లో పలపంపుతారు పుస్తకాలు నాకు. నేను మీకు పంపుతాను.

సరే-సిద్ధ మకరధ్వజం అందాక ఏంచెయ్యాలి? ఆ వివరాలన్నీ రాయండి.

ఇంతకీనాకు బ్లడ్ ప్రషర్ అవునోకాదో కొంచెం అనుమానంగా వుంది. కొంత బాగు చేశారు వాళ్ళు ఈశ్వరుడు.

అన్ని పెసలు తింటే 10కి ఆకలి అవుతుందా ?

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

## 86

శ్రీరమణస్థాన్
13—7—60.

జగ్గూభాయ్,

అవును. మీ ఉత్తరాలూ నావీ కలిపి పబ్లిష్‌చేస్తే చాలా బాగుంటుంది. కూర్మారావుగారు మీ ఉత్తరాల్ని సరిగా కాపీచేసి పెడతా మన్నారు. ఎప్పుడో!

నానించి మీకు ఉత్తరాలు, పెద్దవి వొస్తాయంటారా? ఎవరన్నా నన్ను గట్టిగా కదిలించ గలిగితేనే కానినేను పెద్ద ఉత్తరాలు రాయలేను. ఎక్కువ మాట్లాడనూలేను పైగా బ్లడ్ ప్రెషర్ కూడానా ఏమాత్రం రాయగలనో!

1962-కూడా తథ్యం. ఇంక ముద్రణాలయాలు ఏముంటాయి. చదివే వాళ్ళెవరు ?

నా ఉద్దేశ్యంలో— మీ ఉత్తరాలు ఎంతో సరిగా ఉంటాయని .అచ్చువేస్తే, మీవీ, నావీకలిపి తేదీవారీగా పక్క పక్క గా అచ్చువెయ్యాలి. కనక మీరు లూజ్ షీట్సు మీాద కాపీచెయ్యాలి.

సరే. ఇంతా చేస్తాము, అచ్చువేసే నాథుడెవరని ?

ఇది ఈశ్వరుడికి వొదిలేసి మనపని మనం చేద్దాము.

నా బ్లడ్ ప్రెషర్ కాదుగాని, దాని కోసం మీ రెంత శ్రమపడుతున్నారో! మీరు చెప్పే వైద్యాలు ఒక్కటి కూడా చెయ్యలేని అశక్తుణ్ణి. ఆ వైద్యాలుకన్న బ్లడ్ ప్రెషర్ నయం. ఈశ్వరుడు ఇప్పటికే తగ్గించారు చాలావరకు మీ రింక గొడవపడకండి. నా ఆరోగ్యం విషయమై ఈశ్వరుడు చూస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 87

శ్రీరమణస్థాన్
9—7—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. 14న ప్రళయంరాదు. 1960-మొదట్లో ఖాయం.

ఉత్తరాల కాపీ – చిక్కని కాయితమైతే రెండు వేపులా రాయవచ్చును. కాని ప్రతి ఉత్తరమూ వేరే కాయితంతో ప్రారంభించాలి.

ఇక్కడా ఓ రెండు వానలు కురిశాయి.

విత్తనాలు పంపండి.

మీ కురుపులు నయమేనా ?

వాటికి మంచిగంధం రాయండి.

శ్రీ రమణస్థాన్

18—7—60

మీ 12 తారీఖు ఉత్తరం ఇవాళ అందింది.

విభూతి కావలసినప్పుడల్లా రమణప్పగారిని రాయమనండి. లేక మీరు రాసినాసరే. అది నియమం.

కలకత్తావారికి రాశాను — ఇవాళ ఇక్కడకూడా వాన. అక్కడి వాన లెట్లావున్నాయి ?

27—7—60

మీ రెండు కార్డులు. 11 తేదీ, 19 తేదీ ఒకేసారి— కూర్మారావుగారుకూడా. ఇంకా మందులు రాలేదు. బావి తవ్వుతున్నారు. దొడ్డి అంతా రాళ్ళమయం. ఓ 15 రోజులు పడుతుంది చిక్కుడు గింజలు నాటడానికి.

మీరు నాకు రాసిన ఉత్తరాలు (నేను దాచినవన్నీ) కూర్మారావుగారికి యిచ్చాను

నా ఆరోగ్యం బాగానే ఉంటోంది.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

**88**

శ్రీరమణస్థాన్

28—7—60.

జగ్గూభాయ్

మీ ఉత్తరం — మీరెన్నో ప్రశ్నలు వేశారు. ఇది వరకు రాశానుకదా !

శ్రీ రమణస్థాన్

(1) అవేం సాధకుడి ముఖ్యమైన విషయాలు కావని.

(2) వాటికి జవాబులు ఈశ్వరుడు చెప్పినవే కాని, నాకేం స్వతహాగా తెలీవని.

(3) అవి స్వయంగా మార్చుకోవలసినవే గాని, ఉత్తరాలలో రాసుకోవడంవల్ల ప్రయోజనం లేదని.

అయినా ఏదో కొంచెం రాస్తాను.

దుర్మార్గానికి ఎందుకు కొందరు ఎదురుతిరుగుతా రంటే, అది వారి పుటుక. వారి జీవితం అల్లా నడవాలని ఈశ్వరోద్దేశ్యం అదే వారి సాధన.

అవును. ఈ జన్మలో పొందిన ఆత్మవికాసం కాని, ఆత్మ అంధత్వం కాని, ఈ లోకానా, ఆ లోకానా, ఈ జన్మలో, ఆ జన్మలో మనిషిని వెంటనంటివుంటాయి.

అవును—అభివృద్ధి అయ్యేవారు ఇంకా అభివృద్ధిలోకి పోతారు - పతనమయ్యేవారు ఇంకా పతనమౌతారు. ఎప్పటికో కొంచెం జ్ఞానోదయమై, తిరిగి కాంతివేపు ముఖం తిప్పుతారు. క్రమంగా ముందుకి నడుస్తారు.

కడకు మానవుడు వెళ్ళేస్థితి, అక్కడికి వెళ్ళినవాళ్ళకి తెలీవలసిందే—మన మనసులకి అతీతం - ఆ స్థితిలో ఈశ్వరుడనే వేరుగా ఒకరు వుండరన్ని అంటారు. తననించి ఏదీ వేరు కాదు - చీమా, బ్రహ్మ అంతా తమలోనే వుంటుంది. అవును. లోకమంతా ఆ స్థితివేపే నడుస్తోంది. కొందరికి తోవ తెలీక దూరంగా నడుస్తోవుంటారు. సాధనలూ,

యోగం అంతా, ఆత్మలోని సత్యాన్ని తాను ఒక వేరైన వ్యక్తిని కాదనే అనుభవంలోకి పోవడానికి – తాను వేరైన ఓ మనిషిని అనుకోవడమే మాయ, అజ్ఞానం.

అధోగతిలో నిలిచిపోయేవారెవరూ లేరు. ఏ జన్మ ఎవరు ఎత్తుతారో, ఏం తెలుసు? ఎవరికైనా? మొత్తానికి చేసినదానికి అనుభవించితీరాలి – ఏ జన్మ ఎత్తితేనేం? ఎప్పటికి ఎవరికి జ్ఞానోదయమౌతుందో మానవుడికి తెలీదు. అవును, ప్రతిజీవీ దీర్ఘయాత్ర సాగించవలసిందే.

ఆత్మ శాశ్వతం—దానికి ఎదుగు బొదుగులు లేవు, మార్పనేది లేదు. ఆత్మచుట్టూ చుట్టుకున్న అజ్ఞానం విడి పోవాలి. ఆ జ్ఞానాన్ని చీకటిని ఇంకా దట్టంచేసేదే పాపం.

మీ మనస్సుని ఊరికే అట్లాంటి ప్రశ్నల్లోకి పోనీయకండి. ప్రశ్నలవల్లకాని, వాటి ప్రత్యుత్తరాలవల్లకాని జరిగే ఏ ఉపయోగమూ లేదు. ఆలోచనల్ని ఆపే సాధన చెయ్యండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 89

శ్రీరమణస్థాన్
10 – 8 – 60.

జగ్గూభాయ్,

మీరు శృంగారం ఆధ్యాత్మికంమీద రాయమన్నారే!

ఆధ్యాత్మిక మార్గానికి అనేక సాధనలు - అన్నిటిలోకీ సుఖమైనసాధన. మన జీవితాన్నే మామూలు జీవితాన్నే ఆధ్యాత్మిక సాధన చేసుకోడం—ఏదిచేసినా మనం రోజూ చేస్తున్నదాన్నే అది ఒక ఆధ్యాత్మిక సాధన అనే దృష్టితో చెయ్యడం—అదే ఈశ్వరుడికి అర్పణ చెయ్యడం, రెండూఒకటే.

ఇది చాతకానప్పుడే తక్కిన సాధనలు అవసరమౌతాయి. సాధనలలో భేదాలు కష్టమైనవీ, కష్టం తక్కువైనవీ. స్త్రీ పురుష ఆకర్షణ, ఆహారం మొదలైనవి సహజావసరాలు గనక, వాటిని ఈశ్వరుడికి అర్పించి అనుభవించడం సులభం

ఆధ్యాత్మిక సాధనఅంతా ఏకాగ్రతను కుదర్చడానికే, సమస్తం ఈశ్వరుడికి అర్పించిన కొద్దీ ఏకాగ్రత కుదురుతుంది. ఏకాగ్రత రావాలంటే, Emotion ఎమోషన్ భావతీవ్రత చాలా సహాయకారి— ఈశ్వరునిపై భక్తిలో ఎంతో భావావేశం వుంది. అందుకని ఏకాగ్రత సులభమౌతుంది. అట్లానే శృంగారంలో గొప్ప భావతీవ్రత Strong emotion వుంది. కనక ఏకాగ్రతని సులభంగా ఆధ్యాత్మిక మార్గానికి ఉపయోగించుకోడానికి వీలవుతుంది.

దేహంతో మానవుడు శృంగారంలోకన్న మరిదేంట్లోనూ ఎక్కువ ఆనందాన్ని అనుభవించలేడు. కళకి సంబంధించిన ఆనందం చాలావరకు మనసుది. మనసుని మించిన ఆనందం ఆధ్యాత్మికం-శృంగారంలోని ఆనందం శరీరానిది తక్కువ పాలూ, మనసుది ఎక్కువపాలూ, అంటే గొప్పకళ ఇచ్చేఆనందంకన్న, శృంగారం నిశ్చయంగాఎక్కువ

ఆనందాన్నిస్తుంది. శృంగారంలో, శరీరం, మనసుకూడా ఏకమై ఆధ్యాత్మికపు పొలిమేరల్ని తొక్కుతాయి.

ఈసంగతి తెలీక, ఈ అనుభవానికి రోతని, సిగ్గని, మనసుల్లో అంటకట్టుకుని, తమ శృంగారపు బతుకుల్ని బూతు చేసుకుని, తామేదో అధికులమని విర్ర వీగుతున్నారు ఈ దౌర్భాగ్యులు. ధనం, అధికారం అనేసారంలేని మురుగులో కుళ్ళే ఈనాటి ప్రజలకి, వాళ్ళకి జన్మనిచ్చిన కార్యం అసహ్యమైపోయింది.

"కామి గాక, మోక్షకామికాడు" అంటే, ఆ కామి అనే మాటకి అనేక అర్థాలు తీసుకోవచ్చు—'కామి' అంటే కోరేవాడు. ఏదిగట్టిగా కోరినా, అది మోక్షానికి దగ్గర చేరుస్తుంది మోక్షాన్ని పట్టుదలతో కోరేవానికి, అంతకుముందు దేన్నికోరినా దాంట్లోనూ పట్టుదల వుంటుంది. అంతేదాని అర్థం అంతేకాని కామికాని వాడెవడు?

జీవిత వృక్షానికి, మకుటాలైన ఈ రెండు పుష్పాలూ శృంగారమూ, ఆధ్యాత్మికమూ, ఈనాటివారి కళ్ళకి కనపడనంత అంధులైనారు. ఒకటి అసహ్యం, రెండోది మూర్ఖం వీళ్ళకళ్ళకి ఏం చేస్తాం? చెప్పినా వినరు. చూపినాకనరు. వాళ్ళగతి అంతే 1962 తప్ప ఏదీ రక్షించలేదు వాళ్ళని, ఆ వరదలో పూడ్చుకుపోయి నరకంలో పరిశుద్ధులై జన్మిస్తేనే గాని వాళ్ళకళ్ళు విప్పుకోరు.

ముళ్ళపందితోక చివర గొట్టాలవంటి ముళ్ళువుంటాయట. చూశారా? అట్లాంటివివుంటే ఓ రెండు తీసుకురండి.

కూర్మారావుగారు పట్టుమని ఇక్కడ వుండగలరా?
ఏం తోస్తుంది.

కొన్నాళ్లు మదరాసు వెళ్ళారు.

ప్రస్తుతం కొన్ని రోజులనించి తిరపతిలో వుంటున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

## 90

శ్రీరమణస్థాన్
2—9—60.

జగ్గూభాయ్,

ఒక్కసారి మీ నించి రెండు కవర్లు గులాబి రేకులు, ఒక కటింగు, ఒక కార్డు.

మందు తీసుకుంటోనే ఉన్నాను.

మీరురాసిన ఉత్తరాలు, కాపీచేసేప్పుడు అవసరమైన చోట తగ్గించడమే గాని, హెచ్చించడం చెయ్యకూడదు. అది న్యాయం కాదుకద!

మీ. వాళ్లు బాగున్నందుకు సంతోషం.

మీరుపంపిన కటింగ్‌లో దీక్షితులు గారిని గురించి రాసింది బావుంది

మీరు రాసింది అంతకన్నా బావుంది.

'రుబాయత్'ని గురించి మీరురాసింది చాలా బావుంది. ఎంత విచక్షణతో సరైన అర్థాలిచ్చారు మీరు!

ఇట్లాంటివన్నీ, మీలేఖల ద్వారా ప్రచురణ కావడం అవసరం. ఈ జనం చదవనీండి చదవక పోనీండి.

'ఫల్లి' తినకూడదంటే, చింతపండేనా? లేక ఏ ఫల్లని పదార్థమూ నిమ్మకాయ మొదలైనవి కూడా తినకూడదా? వెంటనే రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 91

శ్రీరమణస్థాన్
6—9—60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం-ఆ ఉత్తరంలో మీరడిగిన సమస్యలన్నీ నా "మ్యూజింగ్స్"లో, వ్యాసాల్లో, సమగ్రంగా చర్చించాను- ఆ ప్రశ్నలకి సమాధానాలు నేను మీకు రాసిన ఉత్తరాల్లో ఉన్నాయి, చాలావరకు.

ఉమర్ కవి - అతని కవిత్వానికి పట్టుకు ప్రశ్నించి ప్రయోజనం లేదు. అతనో సమగ్రమైన వేదాంతాన్ని బోధించలేదు. అవిఒక్కొక్క-Moodలో రాసిన గీతాలు.

లోకంవంక చూస్తోవుంటే, ఒక్కొక్కప్పుడు అంతా విధి నిర్ణయమనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు అంతా మానవుడి చేతులలో వుందనిపిస్తుంది. కాని మీ మనసులో ఏమనిపిస్తుంది? మీకు స్వతంత్రం వుందనేగా! కాని ఆస్వతంత్ర్యం సంపూర్ణం కాదు. భౌతిక పరిస్థితులు పరిపాలిస్తో వుంటాయి. ఎగర గల మనిపించినంత మాత్రాన ఎగరగలమా!

మానవుడు చేసిన పనులకి, ఫలితాన్ని అనుభవించక తప్పదు. అదివిధినిర్ణయం. వాటినించి తప్పించుకునే శక్తిలేదు మానవుడికి. కాని తన మనసుపైన అతనికి స్వాతంత్ర్యంవుంది. తన జీవితాన్ని నడుపుకోడానికి ప్రయత్నించగలడు. ఒక్క రోజులో సాధించలేడు. అట్లా పరసగా ప్రయత్నించి తనని తాను నడుపుకోగలడు. ప్రారబ్ధం ఇంకా పెరగకుండా చూసుకునే శక్తి అతనిలోవుంది. ఆ శక్తినివినియోగించుకోకుండా, బద్ధకించాడా, చాతకాదన్నాడా, తన బలహీనమన్నాడా! బాధలువచ్చి మీదపడి పాఠాలు నేర్పుతాయి. శక్తినిస్తాయి. ఓమనిషి కదలలేనంటాడు. అనుకుంటాడు. కాని కాలిన గరిట చూపండి, లేచి పరిగెత్తుతాడు.

నేనిప్పుడు రాసింది సంపూర్ణమైన సమాధాన మనుకోకండి ఇంకా సందేహాలు వుడతేవుంటాయి. ఎందుకంటే మీ ప్రశ్న పెద్దది. సాధనాలవల్ల అజ్ఞానం పోగొట్టుకుంటేనే గాని, పూర్తి సమాధానం దొరకదు.

ఈశ్వరాశీర్వాదాలతో

\- చలం

# 92

శ్రీరమణస్థాన్
13—9—60.

జగ్గూభాయ్,

ఇవాళ మీ పెద్ద ఉత్తరాలు రెండూ ఎంతో గొప్పగా వున్నాయి. మీరంత ఘాటుగా విమర్శ రాశారు గనకగాని, కాకి ఈ తక్కినవాళ్ళమస్తే చలాన్ని ఇట్లా

తిట్టారు, అట్లా తిట్టారు అంటో రాసి చేతులు నలుపుకుంటో, తామే ఎందుకు చెయ్యలేరో కుంటి సమాధానాలురాస్తే... నేను ఎందుకబ్బా! ఇదంతా అనుకునేవాణ్ణి.

వొస్తే అట్లా ఉద్రేకంవొచ్చి గట్టిగా రాయాలి, చెయ్యాలి. లేదా మనం అసమర్థులమనో, మనకేం పట్టిందనో వొదిలేయాలి. కాని నాకు రాస్తారు? నాకేం వొద్దు బాబూ, అని అన్నీ వొదిలేసి వచ్చినవాడికి!

మీరు రాసింది. అచ్చువేసుకునే పత్రిక ఏదన్నా వుంటే బావుండును.

'దేవదత్తం' నిద్రపోతోంది.

సరే ఎవరూ అచ్చువేసుకోకపోతే, ఉత్తరాల్లో ఎట్లాగూ అచ్చవుతుందికాదా!

ఈ పత్రికలూ, విద్యాసంస్థలూ, ప్రభుత్వాలూ అంతా ఒకటే దొంగలముఠా, మర్యాదస్తుల మంత్రాంగాలయాలు.

ఈ ఆంధ్రపత్రికవాళ్ళు ప్రకటనలకోసం, సినిమా తారల కాళ్ళు పిసుకుతారు రోజంతా. వీళ్ళా నీతులు మాట్లాడేది.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 93

శ్రీరమణస్థాన్
16–9–60

జగ్గూభాయ్,

ఇవాళ మీ ఉత్తరం.

గొప్ప కల వొచ్చింది మీకు. అవును. మీ ఆత్మ మిమ్మల్ని మేల్కొలుపుతోంది. "ఇంకా ఎన్నాళ్ళిట్లా ఈ చీకట్లో బంధిస్తావ"ని అడుగుతోంది. చాలా అదృష్టవంతులు. ఇంక వూరుకోదు, మీకు చాలా అశాంతి నివ్వబోతోంది, బోనులో పెద్దపులిమల్లే.

మిమ్మల్ని నిద్రలేపే శక్తి నాకెంతో కొంత వుండవచ్చు. కాని మీరు నిద్రలేచి 'వొచ్చాను' అన్నరోజున మిమ్మల్ని ఉద్ధరించగల శక్తి ఏదీ చలానికి. చలం ధైర్యం, బలం ఈశ్వరుడు. అందుకే ఏ జంకులేకుండా 'రా' అంటాడు.

అవును. ఒక్క సంవత్సరం, ఆ ఒక్క సంవత్సరం తరువాత, మీకేం? అందరూ రావలసిందే. ఎవరు ఎన్ని బంధాలు, బాధ్యతలు పెట్టుకున్నా ఎట్లాగూ రావాలి. వాళ్లుకాదు వచ్చేది; నీళ్లు తరుముతాయి.

ఆకలిమంట పెట్టి తరుముతుంది అప్పటికీ రానివాళ్లను.

ఇవాళ ఔషధానికి ఆర్డరిచ్చాను. మందు మంచి గుణమిచ్చిందని రాశానుగా !

జవహర్ రాశాడు ఆ పబ్లిషర్ సంగతి. జవాబు రాశాను, ఆ విషయమై తప్సీళ్ళు

మీ వ్యాసం ఎవరూ ప్రచురించరట ఒక పత్రిక రాసింది. దాన్ని కాదని ఇంకోరు ప్రచురించరు. అందరూ గూడుపుఠానీ. వాళ్ళ స్పర్ధలు వాళ్ళకి వుంటాయి. కాని ఏమాత్రం విలువలేని నాబోటి రచయితలపైన అందరికీ ఏకాభిప్రాయమే క్రమంగా ప్రపంచాన్నంతా సబ్బుతో

కొ నేసి బంధిస్తున్నారు. మనబోటివాళ్ళకి కొండల్లో తప్ప స్థలంలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 94

శ్రీ రమణస్థాన్
19–9–60.

జగ్గూభాయ్,

రమణప్పగారికి విభూది పంపుతున్నాను.

మీరు చేస్తున్న ధ్యానం గొప్పగావుంది. అట్లానే చెయ్యండి, క్రమంగా మనసు లగ్నమవుతుంది—అని రాయమన్నారు ఈశ్వరుడు.

ఇంక జవాబులు.

కొంతమందికి ప్రథమ సందర్శనంలోనే ప్రేమ కలుగుతుంది. దానికి మన మిచ్చుకునే సమాధానం — జన్మాంతర సంబంధం.

మనకి గట్టిగా కారణం లేకండా ఇష్టం కలిగేచోటల్లా అట్లాంటి పూర్వజన్మ సంబంధం ఉండనేవుంటుంది

రెండో వారికి ప్రేమ కలగకపోతేనేం. తమకి ప్రేమ కలగడమే ఒక అదృష్టం. ఆ ప్రేమ తమని కాల్చిపెట్టినా సరే.

అవును. స్నేహం హెచ్చినకొద్దీ ప్రేమగా మారవచ్చును. ప్రేమకన్న అంతకు మించిన విలువలు అంటున్నారు—నా దృష్టిలో అట్లాంటివి లేవు.

ప్రేమ అంటేనే హృదయ మాధుర్యం. ఆ మాధుర్యం లేనిది ప్రేమకాదు. హృదయ శూన్యత్వంలో ప్రేమ ఏమిటి?

ధీరత్వం, త్యాగం, మొదలైనవి ప్రేమే నేర్పుతుంది. నేర్పకపోతే, అది ప్రేమకాదు.

అతను మోహానికీ, ఆకర్షణకి వశ్యుడు కాకూడదు, హృదయాన్ని చంపుకుని.

నన్ను దేవుడన్న సినిమాతార ఎవరో నాకు తెలీదు.

చిత్తూరు నాగయ్యగారికి నన్నుచూస్తే గొప్ప గౌరవంవుండేది. ఇప్పటికీ వున్నట్టే వినికిడి.

పత్రికా సంపాదకు లెవరూ నన్ను ఇష్టపడేవారులేరు.

నేను 'మ్యూజింగ్సు'లో రాసింది నార్ల వెంకటేశ్వ్రరావే!

ఇతర రాష్ట్రాలలో ఎవరైనా తెలుగువాళ్ళు నన్నభిమానించేవాళ్ళు ఉంటూనే ఉన్నారు.

నా ఉత్తరం అర్థంకావడానికి తిప్పి పంపుతున్నాను మీ ఉత్తరం.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

## 95

శ్రీరమణస్థాన్
15–10–60

జగ్గూభాయ్,

మీ ఉత్తరమూ, అభ్రక భస్మమూ అందాయి. రాశానుకదూ అభ్రక భస్మం దొరికిందని- ఆ కలకత్తావారు

పంపనే పంపారు సరిగాచూడకపోవడం నాదేపొరపాటు. పైగా ఖరీదు తులం రూపాయిలోపే మీకు బొబ్బిలి వెళ్ళేశ్రమ కలిగించాను.

నా ఆరోగ్యాన్ని గురించి గాని, ఆయుస్సును గురించి గాని, నాకే ఆందోళనాలేదు అవన్నీ ఎప్పుడో వొప్ప చెప్పాను ఈశ్వరుడికి. ఆదుర్దాఅంతా నాపైన అంత ప్రేమగల మీకే వొదిలాను.

నాకు రెండే భరించలేనివి. అశక్తుణ్ణయి పోవడమూ, రెండోది బాధా. బాధని ఏమాత్రం భరించలేను. నానరాలు భరించవు. నామనస్సు భరించదు. శరీరానికి వొచ్చినాసరే మనసుకి వొచ్చినాసరే, కాని నేనుపుట్టేప్పుడు నా నుదుటిపైన ఒక టేవాక్యం పెద్ద అక్షరాలతో రాశారు.

బాధపడు.

బాధలోంచే తెలుసుకో అని.

మీ కుర్రాన్మరావు చాలమంచి కుర్రాడు. కాని బాధ్యత నెరగడు. ఇక్కడ ఈశ్వరుడు అతన్ని గట్టిశిక్షలో పెట్టారు. ఇంకావుంటే, ఇంకాబిగిసేవే ఆనియామాలు. కాని అన్నీ భరించాడు వోపికతో, ప్రేమతో, అతనికి గట్టిగాశిక్షణ కావాలి.

'సుధ' అనే నా కావ్యాన్ని విశాఖపట్నం పంపాను.

నేను పెరుగుమీద వుండగలను. సరైన పెరుగైతే. కాని ఎక్కువ తినలేను. చిక్కి నాకు వున్నబలం పోతుంది.

అయినా ఈశ్వరుడు కొబ్బరినూనె చలవ అంటున్నారు. అవసరమైతే, ఈశ్వరుడే పెరుగన్నం మీద పెడతారు నన్ను.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

## 96

శ్రీరమణస్థాన్
16 – 11 – 60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. ఆ పేపరు కట్టింగులూ అవీ పంపకండి నేను చదవను, ఏదో ఒకటిచలాన్ని తిట్టడానికి. కొత్తేముంది?

మీరు త్వరలో వొస్తున్నారనేది ఈమధ్య నేనువిన్న ఒకేఒక శుభవార్త.

కూరలు గట్రా పట్టుకొస్తున్నా రనేది రెండోది.

ఇప్పుడే చిక్కుళ్ళు వొలేశాం. మొక్కలు పైకి లేచాయి

మీ కురుపులు ఎట్లావున్నాయో!

నా వొంటిసంగతా? ఫరవాలేదు. ఈశ్వరుడు చూస్తున్నారు వొస్తున్నారుగా మాట్లాడుకుందాము.

మీకు మనుమరాలు పుట్టడం సంతోషం. మీరు ఆడుకోడానికి ఈనాడు మనుమరాలేం? ఎప్పుడూ అన్నిచోట్లా వున్నారుగా, మీకు, పిల్లలూ–పిల్లలూ.

నా ఆరోగ్యం నయంగా వుంది. మన్ను వేస్తున్నాను తలకి.

దీపోత్సవాలు ప్రారంభం ఇక్కడ. మీ ఉత్తరాలు అందుతున్నాయి, దీపోత్సవం-మిత్రులు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 97

శ్రీరమణస్థాన్
31–10–60.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం చాలాబావుంది. అవును హృదయం లోనే ఈశ్వరుణ్ణి ప్రతిష్ఠించుకోవాలి. కాని ఈపై కార్యాలు, ధర్మంచేయ్యడం, గుళ్ళు సత్రాలు కట్టించడం-ఆడంబరానికీ, స్వార్థానికీ చేసినా, కొంత ఈశ్వరుడిపైకి దృష్టి మరలిస్తాయి. చాలాసార్లు దుర్మార్గులకి కూడా వరాలిస్తాడు ఈశ్వరుడు. అట్లాగుననా వారిమనసు తన పైనిలుస్తుందేమోనని.

పద్మావతి పిన్ని ఈ పదేళ్ళూ ఈశ్వరుడిపై చాలా విరోధించి ఇదంతా అబద్ధమని గట్టిగా ప్రచారం చేసింది. మరి ఎట్లాతిప్పారో ఆమె దృష్టిని ఈశ్వరుడు భర్త, కొడుకు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు వీళ్ళు వొద్దన్నా, ఎదిరించి ఇక్కడికి వొచ్చేసింది ఇక్కడ ఇల్లు కట్టుకోడానికి యత్నాలు చేసింది. మళ్ళీ మద్రాసువెళ్ళి ఇల్లువొద్దు మీతోనే వుంటాను

డబ్బిస్తాను అని రాసింది. దానికి ఈశ్వరుడు, "ఆశ్రమంలో వుంటే, సమస్తమూ అర్పించుకుని, నా ఆజ్ఞలో వుండాలి" అని రాయించారు ప్రస్తుతం జబ్బుగావుంది. ఆమెకి-జబ్బు నయమయాక వొస్తుందట. నేను ఆమెకి "అర్పించుకోవడం, చాలా కఠినమైన సాధన, తట్టుకోలేవు ఇల్లు కట్టుకో" అని సలహాఇస్తో రాశాను.

అదీ సంగతి-

జయంతి—జనవరి 3, దీపం—డిశంబరు 3-

మీరు వొస్తారా?

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 98

శ్రీరమణస్థాన్
17—1—61.

జగ్గూభాయ్,

మీ కార్డూ. కవరూ- మీ రైల్వేస్టేషన్ సంగతి తెలుసుగా మీకు-రాత్రిరైల్లో ఎందుకు దిగేరు? పాపం! ఎంతో బాధపడ్డట్టున్నారు. నాకు మల్లేనే మీరూ బాధకి తట్టుకోలేరు.

ఇప్పుడు ఈ కుటుంబంలో మీరుచూసే వెలుగంతా, ఈశ్వరుడు ఈ పదేళ్ళూ మమ్మల్నిఅనగతీసి మాలోకి తెచ్చిన

సౌమ్యం ఇటవరకు మాకు కలుకు ముళ్ళుండేవి. ఇతరులకు గుచ్చుకునేవి. ఇప్పుడిది ఆయన ఆశ్రమం వొచ్చేక మిగిలిన లోకాన్నంతా ఇముడ్చుకోగల విశాలత్వం వెలగాలి ఇక్కడ, మీరు సవ్వుమీద రాసింది, గొప్పకవిత్వంలాగా నడుస్తోంది. చదివితేనే.

మీలోని ఆత్మ ఎదగాలని, విస్తరించాలని రెక్కలు చాస్తోంది ఆబలం. ఆ కాంతి మీకు శక్తినిచ్చేబలం ఇక్కడ ఈశ్వరుడిసించే వొస్తుందని, గుర్తించింది మీ ఆత్మ—మీరూ గుర్తించారు. కాని మీ బంధాలు, అలవాట్లు తెంచుకుని ఇక్కడ నిలిచిపోగల శక్తిచాలదు ఇక్కడవుంటే సులభమాతుంది—కాని వుండలేదు. అదీ మీ దుఃఖానికి కారణం దాన్నే ప్రేమవియోగం అంటాము.

మీరు రావడానికేం! మీకు రాదలుచుకున్నారా. ఈ నిమిషాన రాగలరు— కాని రాలేరు. అందువల్లనే ఆ దిగులు

స్త్రీ అత్తవారింటిని వొదిలి, ఒక్క నిమిషంలో ప్రియుడి చేతుల్లోకి దూకగలదు – ప్రియుడు ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నాడు తీసుకోడానికి – కాని ఆ ప్రియుడు ఈ లోక ప్రకారం దరిద్రుడు, బైరాగి. అందుకని ఆ స్త్రీ కదలదు, కదలలేదు.

అల్లుడికి లొంగకండి.

బాధ్యతల్ని తప్పించుకోడంకాదు, వాటిని ఎదిరించాలి

మన సొంత సౌఖ్యాలకోసం సంఘాన్ని ఎదిరించడం కాదు. మనమీదికివొచ్చే అల్లుణ్ణికూడా "ఎవడా నువ్వు! నామీదికి రావడానికి" అని అన్యాయాన్ని ఎదిరించాలి. అధికారాన్ని కూలతన్నాలి – మనమీదికివొస్తే.

"నా కూతురో !" అన్నారా !

కూతురూ అల్లుడూ మీ నెత్తిన కూచుంటారు. ఊరివాళ్ళనంతా జయించినా, మీ ఆత్మకి స్వేచ్ఛవుండదు.

తమ స్వేచ్ఛకోసం తల్లిని తం డినీ పిల్లల్నీ వొదిలేస్తారు. కాని ఓ ధర్మానికి, ఓ సంస్కారానికి నుంచోమంటే "మా అమ్మ! మా పిల్ల, మా మామ" అంటారు.

అందువల్లనే ఎంతటి ఉదారులూ, గొప్పతనాన్ని సంపాయించలేకపోతారు. వారినించి ఇంకోరి కేమీరాదు.

మీరు వర్ణించిన నవ్వులకి కురంగేశ్వర్ బొమ్మల్ని చిత్రీకరించి పంపించారు.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

## 99

శ్రీరమణస్థాన్

19–1–61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం – నేనీవూరు వొచ్చాక, పారిస్‌కి ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యేవరకు, ఓ ఈశ్వరు డున్నాడని

నాకు నమ్మకంలేదు — దానికి ముఖ్యకారణం ఈశ్వరుడంటే ఏమిటో తెలీకపోవడమే. నా రచనల్లో నా జీవితంలో వ్యక్తమాతున్న ఉన్నత ఆశయాలమీది నా విశ్వాసం, మానవ హృదయంలో ప్రతిఫలించే ఈశ్వర కాంతి అని తెలీ లేదు. ఏదో గొప్పది దూరంగా గోచరించినా, అది ఆర్టిస్టు కల అనిపించేది. కాని దాంటో ఓ వాస్తవ ముందనీ, ఓ సాధనవల్ల ఆ ఔన్నత్యాన్ని పొందడం సాధ్యమాతుందనీ నాకు నమ్మకంలేదు. చావుతో జీవితం అంతమాతుందని విశ్వాసంలోవున్న నాకు, ఈ విలవలూ విశాలత్వాలూ సత్యమని ఏం నమ్మకం వుంటుంది ?

ఎందుకట్లా జరిగిందంటే, తెలీదు. పూర్వజన్మమో, లేక ఈశ్వర విలాసమో అనాలి. చలం ఒక్క అంగలో ఆధ్యాత్మికంలోకి ఉరకగలిగితే, మిత్రులకి వెలుగునిచ్చిన ఈ పుస్తకాలు ఎట్లా సృష్టి అయ్యేవి? తాను తోవ వెను క్కని, నలిగి, తెప్పరిలి, జయిస్తేనేగానీ, ఆ పోరాటమూ, ప్రయత్నమూ అంత సూనృతంగా అక్షరాలలోకి రావు అదేనేమో ఈశ్వరోద్దేశము.

మానిషిలో, ముఖ్యంగా, చలంవంటి ఆర్టిస్టు మనసులో, ఎప్పుడూ రామరావణ యుద్ధం జరుగుతోనేవుంటుంది. తాను ప్రయత్నించు తనలో ఉత్తమమైనదానినే ముఖ్యం చేసుకున్నాడా, తనలోవుండే ముడికి క్రమంగాచచ్చిపోతుంది.

ఇదివరకే రాశానుకదా. మనలోని తక్కువ గుణాలు ఈశ్వర సహాయంతోనేకాని, చావవని.

సమస్తమూ ఈశ్వరుడే. మంచీ, చెడ్డా; మాయలో, మకిలిలో కలిసినకొద్దీ, ఈశ్వరుడి పాలు చాలా తక్కువవవుతుంది. కాని దాంట్లోనూ ఈశ్వరుడున్నాడు. అందుకేగా ఏ ఆశా లేనంత క్షుద్రుడు ఎవరూ లేరు.

మన స్వభావం ఉన్నతమైనకొద్దీ ఈశ్వరుడిది ఎక్కువ పాలూ, మాయ తక్కువపాలూ ఉంటుంది. ఈ మాయని తప్పించి, నిర్మలమైన ఈశ్వరత్వాన్నిమాత్రం మనలోకి తెచ్చుకోడమే ఆధ్యాత్మిక సాధన.

ప్రేమా, సౌందర్యం, దయ, సూనృతం-ఈ రూపాల్లో ఈశ్వరుడు మనిషి మనసులో సాక్షాత్కరిస్తాడు మనః పీ మాయలో పడ్డకొద్దీ, ఈశ్వరుడి మానుర్యం తగ్గి, ప్రేమ ద్వేషంగా, సౌందర్యం వికారంగా, దయ క్రూరత్వంగా, సూనృతం, అబద్ధంగా మారుతుంది.

అందువల్లనే ఈశ్వరుడిలో విశ్వాసంలేని వాడిలో కూడా ప్రేమా,దయా,ఇట్లాంటివివుంటే, అతనిలో ఈశ్వరుడు ప్రకాశిస్తోనే వుంటారు.

అరుణపాత్ర, శుద్ధకల్పితం.

భగవాన్ కనపడ్డాక, ఆయనే్న గురువు అనుకున్నా కూడా, నాకు యోగవిద్యలో నమ్మకంలేదు. ఎందుకంటే, చావు తరువాత వుంటామని నమ్మకంలేదు.

దానికి నా విశాలమైన చదువు, సునిశితమైన నామనో బలం, కత్తివంటి నా హేతువాదం, నా ప్రతి కష్టంనోళ్ళు మూసిన నా తర్క బలం— కారణం.

తెలివి హెచ్చినకొద్దీ, హృదయాన్ని కోస్తుంది-మనసు కత్తిలాగు కొయ్యగూడదు. అగ్నిలాగు దహించాలి.

ఈశ్వరుడు వొచ్చి, నాతో తర్కించి తన తర్కంతో, నా తర్కాన్ని నోరుమూసి, వోడించి, అణచేవరకూ, నా మనసు తన తెలివిని చూసి తాను గర్వపడడం మానలేదు.

అవును. ఈశ్వర సహాయమే మనలోని మలినాన్ని మండించ గలదు— మనం బలవంతంగా అణుచుకున్నంత మాత్రాన ఏదీచావదు— నశించదు, అణగి దాక్కుంటుంది. అంతమాత్రమే.

మన సమయం రానిదే ఈశ్వరుడు మనవైపు చెయ్యి జాచనిదే, అంటే— ఓగురువు దొరకందే— మనకై మనమేదో సాధించగలమని ఎన్ని సాధనలు చేసినా, నాశనం తప్ప ఏ ఫలమూ రాదు—అంతవరకూ, మనం తయారు కావాలి. వాంఛించాలి, ప్రార్థించాలి.

ఈ ఆధ్యాత్మిక సాధన, శరీరవ్యాయామం కాదు.

భగవాన్ దర్శనం 1936. అయినా చలాన్ని అట్లా తాడుకట్టి వుంచేశారు. చలం అహం కొంతవరకు అణగి, యోగవిద్యకు అర్హుడయ్యే వరకు. ఇప్పుడూ ఇంకా ఈ దోర కాయని, అట్లా మాగేసేవుంచారు; ఏమన్నా ఏమూలన్నా కొంచెం పండిందా, అని రోజూ పరీక్షిస్తో—

ఈనాడు జగ్గారావుకి చలానికి తెలిసినంతా తెలుసు. ఆధ్యాత్మికానుభవమే సర్వోత్తమమనీ తెలుసు. కానిఎందుకు దిగడు ?

జగ్గారావు కేమిటి ప్రతి హిందువుడికీ తెలుసు-ఎవరూ దిగరేం?

వాళ్ళని ఎదురు ప్రశ్నించండీ. తేలిపోతుంది.

చేతిలోవున్న ఈ సౌఖ్యాలు వొదులుకుంటే, తీరా అది వొస్తుందో లేదో అని భయమేగా!

అట్లానే చలమూనూ, అన్నెళ్ళు ఆలస్యం చేశాడు. ఈశ్వరుడు ఓతన్ను తన్ని తాలింఖానాలోకి తోసిందాకా.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 100

శ్రీరమణస్థాన్
31–1–61.

జగ్గూబాయ్,

మీ ఉత్తరం-మీ సందేహం.

పైనేమో 'ఆనందాన్ని అనుభవించేది ఆత్మ' అని రాస్తో, మనసుపోతే, ఆనందాన్ని అనుభవించేదెవరు? అని ప్రశ్నిస్తున్నారు. ఆత్మవుంటుంది కదా!

అసలు రహస్యం ఏమిటంటే ఆత్మే ఆనందం- ఆత్మకి బైట వేరే ఆనందం అక్కర్లేదు అనుభవించడానికి.

ఆ ఆత్మని కప్పేసి అడ్డంగా వుంది మనసు- 'నేను' అంటో-

అనుభవించడం- అన్నమా; సుఖంగాని కష్టంగాని- అది మనసే.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 101

శ్రీరమణస్థాన్
7—2—61.

జగ్గూభాయ్,

మీా ఉత్తరం — విభూది మీారు అడిగిన సంగతీ, నేను పంపిన సంగతీ జ్ఞాపకం లేదు.

నారాయణరావుగారి ప్రకారం చలం రాసిన వేదాంతం ఏమిటంటే, వున్న అభ్యంతరాల్ని తొలగించుకుని హాయిగా వొంటినీ, మనసునీ సుఖపెట్టుకోమని — ఆయనికి రాశాను. వూరికే తినికూచుని సుఖపడడం చలం దృష్టిలో ఎంత నీచమో! కాని ఆయన సుఖాన్నించి కదలనంటాడు. ఆ ముసలి ఆడవాళ్ళు అన్ని అవసరాలూ చూస్తో సేవచేస్తో సుఖపెడుతూవుంటే, వాళ్ళ మూర్ఖత్వాన్నించి ఎదురు తిరిగే ధైర్యంకూడా లేదు—చాలా బద్ధకం. చలం చెప్పినవి బావున్నాయనడమేకాని, ఒక్క వేలు కదల్చడు. వీళ్ళా— చలం మారాడని విమర్శించేది — పోనీ. సయిన్సు అబద్ధం అంటోందని తద్దినాలు ప్రజలు మానాడా? ఏదో ఒక దేవుణ్ణో, సయిన్సునో, దేనోని సూనృతంతో అనుసరించని వాళ్ళకి ఏం అధికారముంది ఇంకోళ్ళని విమర్శించడానికి?

ఎంతకీ వాదించడమేగాని, మీ గురు వారి జీవితం విషయమై ఒక్క ప్రశ్న వెయ్యండి — తేలిపోతుంది.

చలం పూర్వం చెప్పినదాని ప్రకారం బతికినవాళ్ళకే అధికారంవుంది. చలంలో, ఈనాటి మార్పుని విమర్శించ డానికి—అయినా ఆనాడైనా చలం చెప్పిన ప్రకారం జీవిం చారు గనకనా !

చలం నానాబాధలు పడలా ! సత్యంకోసం !

నువ్వేమో కుర్చీలో కూచుని, విమర్శించడం నీ పనా !

అంతేలెండి వాళ్ళు—

ప్రళయంలో నమ్మవొద్దు—కాని ప్రళయంలో బాధ పడేవాళ్ళకి సహాయం చేస్తావా ?

దానికి జవాబు వుండదు—

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 102

శ్రీరమణస్థాన్
10—2—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు వరసగా, వేదాంత చర్చలతో— జవాబు రాయాలంటే, మొదటి సంగతి వేదాంతం నాకేం తెలీదు — రెండోది ఆ చర్చ నాకు తలనెప్పి. మీ దస్తూరీ నన్నేమీ ఇబ్బంది పెట్టడంలేదు—

మీ ఉత్తరాల అచ్చు ప్రయత్నం ఏమన్నా చేస్తు న్నారా ?

అసలు సత్యం ఎవరికీ తెలీదు—ఈశ్వరుడూ, లోకం, ఆత్మ, వీటి సంబంధం ఎట్లావుంటుందో, ఈ మనసుతో వూహించుకోలేము. మనసే పోయినరోజున అంతా వొకటే—ఆ వొకటి కాక ఈశ్వరుడూ లేదు, లోకం లేదు, ఆత్మ లేదు, జగ్గారావూ లేడు. అద్వైతం, ద్వైతం, ఇవన్నీ సత్యం తెలుసుకునే ప్రయత్నాలు అంతమాత్రమే.

ఏం తిను, ఏం తాగు, ఏం తినకు, ఏం తాగకు — ఏది నిన్ను ఈశ్వరుడికి సమీపంగా తీసుకుపోతే అదే సరైనది, సూక్ష్మమైనది, సత్యమయింది.

మీరు సరైన విభేదం చెయ్యటం లేదు — శైవులు వేరు. వైష్ణవులు విష్ణు ఒక్కడే దైవమన్నట్టే వాళ్ళు శివుడు వొక్కడే దైవమంటారు. వీళ్లు ఎక్కువగా దత్తమండలం మైసూరులో వుంటారు. వాళ్ళకి విష్ణునామం గిట్టదు. లింగధారులూ, జంగాలూ వీరిలో చేరినవారు.

కాని చాలామంది హిందువులు, వైష్ణవులూ కారు, శైవులూ కారు—స్మార్తులు. వీరే కొంత వేదాంతులు. విష్ణుశివభేదం లేదనేవారు.

సరదాగా ఉత్తరాలు రాస్తే రాయండి—కాని ఈ విషయాల్నీ, భేదాల్నీ మీ మనసులోకి తీసుకోకండి.

ఈశ్వరుడు అంటున్నారు—

"అన్నిటికన్న గురువులో విశ్వాసం, చేతులు వొదిలేసి అన్నీ ఆయనకు వప్పచెప్పడం, గొప్పది, సూక్ష్మమైనది." అని.

పలగరనించి ఉత్తరం భయంకరంగా ఉంది.

చాలా గట్టిపట్టులో, జాగ్రత్తగా ఉండండి.
మీరు రాసిన ఉత్తరాలు ఓ నాలుగు దొరికాయి.
మీరు రాయగానే మీకు పంపుతాను

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 103

శ్రీరమణస్థాన్
27 – 2 – 61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు ఇవాళ-అవి అందేప్పటికే రమణప్ప గారికి ఉత్తరం పోస్టుచేశాను.

రమణప్పగారికి ఉత్త॰ం రాశానన్నమాటేకాని, ఆమెకి మీ మనసుని ఎంతవరకు అర్థంచెయ్యగలిగానో, ఎంతవరకు మీకు సహాయపడగలిగానో అనుమానమే—

ఫలితం ఆమెకి నాపై కోపం తెప్పించడమే అవుతుంది బహుశా.

అవును మీది గొప్ప ఆత్మ మీరు మీ ఆశయాన్నించి దిగజారకూడదు. మీరు దిగజారరు, నాకు తెలుసు.

జవహారుతో ఉత్తరాలు ప్రారంభించండి – లేదా, మీరే పబ్లిషర్‌తో మాట్లాడండి. మీ ఉత్తరాల్ని ఏమీ తగ్గించవొద్దన్నారు ఈశ్వరుడు రమణప్పగారికి నేను పంపిన ఉత్తరంకూడా తీసుకోండి అచ్చుకి—

మీరు అచ్చువేయించకపోతే, ఆ ఉత్తరాల్ని తనకిస్తే, తాను అచ్చుపెట్టు చూస్తానన్నారు ఈశ్వరుడు.

మీ ఫూళ్ళో ప్రచారంచేస్తేచాలు మీరు పొరు గూళ్ళకి వెళ్ళనవసరంలేదు.

లతగారి పుస్తకం నాకు చదవబుద్ధివేయలేదు.

మీకు పంపుతాను—జ్ఞాపకంచెయ్యండి మళ్ళీ.

చిక్కుడు ఎదిగింది. పువ్వులు పూస్తోంది కాని ఆ కాయలులేవు. మీరు చెప్పిన ఎరువులేసి చూస్తాము.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

జగ్గారావుని మళ్ళీ పెళ్ళిచేసుకోమంటున్నారు రమణప్పగారు. అతను యిష్టపడటంలేదు. పెళ్ళి అన్న చలం ఇష్టపడడని తెలియక, రమణప్పగారు చలానికి ఉత్తరం రాశారు, జగ్గారావుని వొప్పించమని. చలం చెపితే జగ్గారావు వొప్పుకుంటాడనే ఉద్దేశ్యంతో.

## 104

శ్రీరమణస్థాన్
27 – 2 – 61.

రమణప్ప గారికి,

మీ ఉత్తరం సావధానంగా చదివాను-

1962 మొదట్లో గొప్ప ప్రళయం రాబోతోంది. ఆ ప్రళయం తరవాత మిగిలేవారెవరో, పరిస్థితులు ఎట్లావుంటాయో తెలీదు—పెళ్ళిళ్లూ ఇట్లాంటివి అటుతరవాత యోచించవలసిందే గాని అంతకు ముందు కాదు.

జగ్గారావుగారిని నేనెరిగినంతవరకు, నేనేమాత్రంఆయన వివాహం చేసుకోవడం, ఆయనకి అభిలషణీయమనిఅనుకోను. పెళ్ళి ఆయనకిగాని, మీలో ఎవరికినిగాని శ్రేయస్కరం కాదు.

వంశాలు నిలబెట్టడం, ఆస్తుల్నివ్యాసం పెంచుకున్న పిల్లల్నిఅంటకట్టడం, ఇట్లాంటివీ వాటివుద్దేశ్యాలూ, వాటిల్లో వుండే స్వార్థంనాకు చిన్నప్పటినుంచీ తెలుసు.

మీరేమో దైవ చింతగల వారనీ వేదాంతగ్రంథాలు చదువుతారనీ, వైరాగ్యం కలవారనీ, రాస్తారు జగ్గారావు గారు. ఆయనకి మీపై ప్రేమ, గౌరవం, కృతజ్ఞతా వున్నాయి ఆ కారణంగా మీరావిధంగా ఆయన్ని మొహమాటపెట్టడం, బలవంతం చెయ్యడం మీవంటివారికి తగిన పనికాదు. ఇట్లాంటిఎత్తులు మూర్ఖులూపామరులూ చేసేపనులు.

అవును. ఆయనకి చాలా అలవాట్లూ, దేహబంధాలూ వున్నాయి. వాటి నెట్లానైనా వొదిలించుకోవాలని ఆయన ప్రయత్నిస్తూవుంటే అన్నిటికన్న పెద్ద బంధం సంసారబంధం ఆయనకి కడతామంటున్నారు మీరు. ఇదేనా మీ ప్రేమ! ఇదేనా మీ జ్ఞానం, వైరాగ్యం!

ఆధ్యాత్మికంవేపు నడిచేవారిని వారించడం మహాపాతకం.

మేము అన్నీ వొదిలి ఇక్కడ ఆశ్రమ జీవితం గడుపుతున్నాము. భార్యా, పిల్లలు, సంసారం, ధనం, ఇంద్రియ సుఖాలు, మనుషులకి పెద్ద సంకెళ్ళు అని బోధించే మిమ్మల్ని- ధనం, వివాహం, ఆస్తి, కీర్తి – ఇట్లాంటివాటికి వొప్పుకోమంటే ఎట్లా వొప్పుకుంటాము.

నాకు జగ్గారావుగారిమీద ప్రేమే. నేనూ ఆయన శ్రేయోభిలాషినే. నా శిష్యుడు ఆయన. ఆయన్ని ఆ పెళ్ళికి వొదలను, నా కొనవూపిరితో 'ఆ పెళ్ళి వద్దు' అంటోనే వుంటాను ఆయన తన బాధ్యత నాపైన వేశారు, అందుకు.

తన తిండికి జగ్గారావుగారు ఎవరిపైనీ ఆధారపడడమూ నా కిష్టంలేదు. అరుణాచలం వొచ్చి భిక్ష మెత్తుకో మంటాను.

ఆయన ఇక్కడ భగవాన్ సముఖంలో వుంటె, భగవాన్ దయవల్ల ఆయన అలవాట్లు పోవడం ఎంతసేపు!

మీ రేమో జగ్గారావు బలహీనుడు, సోమరి, ఏం చెయ్యలేడు అని అంటోనే జనక మహారాజు సంసారంలో వుండికూడా ఆధ్యాత్మిక సాధన చెయ్యలేదా? అని అడుగుతున్నారా? ప్రతివారికీ సాధ్యమా? అది. సంసారంలోవుండి సాధన! ఎందుకట్లా మోసపరుచచూస్తారు, మీరు ప్రేమించే మనిషిని!

జగ్గారావు నాకు రాసిన ఉత్తరం మీకు పంపిస్తున్నాను.

ఈ పెళ్ళిచేశారా, ఆ క్లేషంలోపడి కొట్టుకుంటూ ఆయన మిమ్మల్ని ద్వేషిస్తారు.

ఈశ్వరుడిట్లా రాయమన్నారు మీకు.

"వంశం" అంటె పుత్రికవున్నా వంశమే—ఆ పుత్రికకి మొగపిల్లలు పుట్టరా!" అని.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 105

శ్రీరమణస్థాన్
4—కే—61.

జగ్గూభాయ్,

మీఉత్తరం-నిన్ననే వెళ్ళివుంటాను పలగరకి-మీసందేహాలు- ఇవినా "మ్యూజింగ్సు"లో విపులంగా చర్చించాను.

1.భగవాన్ మల్లేనే మనోనాశనమైనవారికి'పెర''వేరు' 'భిన్నము' అనేవిలేవు- గనక ఎక్కడా మాలిన్యం కనబడదు.

2. చిన్నపిల్లలకి ఇతరులలోని దుర్గుణాలు కనబడవు; వాళ్ళలో ఆ దుర్గుణాలులేవు గనక, అబద్ధం చెప్పినా, నమ్ముతారు. కాని వాళ్ళకీ, అబద్ధంచేత కాగానే, ఇతరుల్ని "నువ్వు అబద్ధం చెప్తున్నావు" అంటారు.

3. చాలామంది సత్పురుషులకి ఒకరు తమని మోసం చెయ్యతలచాడనే అనుమానమే రాదు. వారికి ఇతరుల్ని మోసం చెయ్యాలనే ఉద్దేశ్యమేలేదు గనక—

ఇతరులు మోసగాళ్ళు అని వాళ్ళని నమ్మించడమే కష్టం—

'ఎందుకు మోసం చేస్తాడు ? ఏంలాభం మోసంచేసి ?' అంటారు అమాయికంగా.

ఇట్లానే తక్కినవన్నీ.

అర్థమయిందా—

మనం మోసం చెయ్యనక్కర్లేదు. మోసం చెయ్యం. కాని మోసం చెయ్యగల బుద్ధి మనలో అణిగివుంది. అందువల్లనే సుళువుగా ఇతరుల మోసాన్ని గ్రహించగలం.

దొంగే దొంగని పట్టగలడు.

మనలో ఓ దుర్గుణం గట్టిగావుంటే ప్రతివాడిలోనూ అది వున్నట్టే అనుమానిస్తాము. అబద్ధాలు చెప్పేవారు ఎవరి మాటలూ నమ్మరు.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చ లం

# 106

శ్రీరమణస్థాన్
10—3—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. అవును. హిందూదేశమే ఈఆధ్యాత్మిక విషయమై ఎక్కువ కృషిచేసి, గొప్ప సత్యాల్ని కనిపెట్టింది. ఈదేశంనించే పర్షియా, టిబెట్, చైనా, జపాన్ మొదలైన దేశాలు ఈ విజ్ఞానాన్ని సంపాయించి, గొప్ప ఋషుల్ని ఉద్భవింప చేసుకున్నాయి—

పశ్చిమ దేశవాసుల కృషీ, అన్వేషణా బైట ప్రపంచంలో జరిగాయి. ఈ దేశంలో, మనసులోపల అన్వేషణ జరిగింది. అందువల్ల పశ్చిమ దేశాలువారు ఈ సత్యాలకి పూర్తిగా అంధులైనారు. తెలిపినా తెలుసుకోలేని స్థితిలో ఉన్నారు.

వారి మతస్థాపకుడైన ఏసు తూర్పు దేశాలలోనే పుట్టాడు. ఆయన ఈ ఆధ్యాత్మిక సత్యాన్నే బోధించాడు. కాని ఆ బోధని ఆయన మతం మరిచిపోయింది. పరిత్య జించింది. ఏసు బోధించింది. అసలు ఇదిరా అని చెప్పినా తెలుసుకోరు, నమ్మరు మతఆస్తులు— అయినప్పటికీ, ఏసు మీది ప్రేమ, భక్తి వారిలో కొంతమందిని యోగుల్ని చేసింది. మనోనాశన స్థితికి తీసుకు వెళ్ళింది.

ఈ ఆధ్యాత్మికానికి అనేకమార్గాలు జ్ఞానం, యోగం, భక్తి, సేవ, మొదలైనవి. ప్రేమమార్గం ఇంకోటి—ఏమార్గ మైనా, మనిషి తననితాను మరిచేదిఅక్కడికే తీసుకుపోతుంది ముందు మనసుని కట్టేస్తుంది. తరవాత నాశనం చేస్తుంది. ఏసుని ప్రేమించి, ఆయనలో లీనమైనాడు— క్రమేపీ అతను వుండడు. చాలాగొప్ప క్రిష్టియను Saints nupies ఉన్నారు. పూర్వం.

చివరికి కళ, వయస్సు,సత్యం, దేశభక్తి, మాతృభక్తి ఇవన్నీ యోగసాధనలు కాగలవు— ఇతరాపేక్ష లేకుండా, వాటినే ప్రేమించి అర్పించుకుంటే.

ఈనాటికీ ఆ దేశవాసుల్లో గొప్ప తత్వసాధకులు ఉన్నారు. D. H. లారెన్సువంటివాళ్ళు—పూర్వం అట్లాంటి కవులు వున్నారు. వాళ్ళు చివరి సత్యంకోసం ఎంతో వెదుకు తున్నారు. కాని వారికి సత్యాన్ని బోధించి, నడిపించగల గురువులులేక, అంధకారంలో నిస్సహాయులై, వెతికి వెతికి పరమపదించారు.

వృత్తి మానవ సేవద్వారా గొప్ప ప్రవక్తలు వుండే వారు క్రిష్టియను మతంలో.

మనోనాశనాన్ని గురించి వినకపోయినా వొకటే-అన్వేషకుడికి, మనోనాశనం సంగతి తెలీకండానే, మనో నాశనం జరుగుతుంది. ప్రియులకి జరగడం లేదా గొప్ప ప్రేమలో తాత్కాలికంగానైనా. మనోనాశనానికి ముఖ్యమైన సోపానం, అహం నాశనం "నేనూ, నా గొప్ప" అనేది పోవడం.

దీనికంతా ఈశ్వరానుగ్రహం ముఖ్యం. చలానికి పూర్వంకూడా ఈ ఆధ్యాత్మిక విషయాలన్నీ తెలుసు, కాని నమ్మాడా ?

వేదాంత శాస్త్రాలూ, మనోనాశనం ఇవన్నీ క్షుణ్ణంగా చదివి నమ్మిన పండితులకి ఏమొచ్చింది ?

ఏం సాధన చెయ్యాలో తెలుసు. చెయ్యరు, చెయ్యలేరు.

జన్మలున్నాయని నమ్మితే, ఏ దేశంలో ఏ అన్వేషకులు చచ్చినా, తరవాత జన్మలో వారి నా అన్వేషణ సరైన దేశంలో పుట్టిస్తుందని నమ్మాలి - లేక ఇతర లోకాలలో సాధిస్తారేమో, మనకేం తెలుసు ?

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 107

శ్రీరమణస్థాన్
16–3–61.

జగ్గాభాయ్,

మీ ఉత్తరం అందింది. మీ నిశ్చయానికి చాలా సంతోషించాను. అమ్మా! పెళ్ళి అపాయం వొదిలిపోయింది కద!

మీ ఉత్తరాలు ఎక్కడా ప్రచురణ కాకపోతేనే, వాటిని తనకి పంపమన్నారు. ఈశ్వరుడు.

నేను రాశానుకదూ, ఈ స్త్రీ పురుష తత్వాలు అన్నీ అన్నిరకాలు—వాటి సృష్టి అంతే. మీరు రాసిన వాళ్ళిద్దరూ చాలా సహజంగా ఉన్నారు వాటికి Explanation వాళ్ళే-పూర్వమైతే అట్లాంటివాళ్ళని ఓచిన్న కథచేసి 'మ్యూజింగ్స్' రాద్దును. ఇప్పుడా విషయాలపై చూరవలేదు.

అంతేలెండి ఈ తెలుగువాళ్ళు. వాళ్ళ ప్రసక్తి వొదిలెయ్యండి.

ప్రళయం సంగతులు పత్రికల్లో పడుతున్నాయి. చూస్తున్నారా?

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 108

శ్రీరమణస్థాన్
27 – 3 – 61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు చేరుతున్నాయి. పూర్వంరోజులైతే, కొట్టుకునే రాడీ ప్రియులపైన ఓ కథ రాసివుందును. మీ రిక్కడవుండి ప్రోత్సాహిస్తే ఇప్పుడైనా రాసేవాణ్నేమో ? ఈశ్వరుడు అనుమతిస్తే

సినిమా రుక్మిణీ కళ్యాణమా ?

అవును. శ్రీశ్రీ అప్పుడో రెండు ఉత్తరాలు రాసి ఊరుకున్నాడు—అంతే.

ఆ ఫిల్మ్ని ఆదిభట్లవారికి అంకితమిస్తారట.

సినిమా సంగతా. అదంతా శ్రీశ్రీ హడావిడి. నా పేరే కావాలి వాళ్ళకి, నా రాత ఎట్లాగూ అవసరంలేదు. నాచేత పేరుకి రాయించుకున్నా వాళ్ళెట్లానూ రాసినదాన్ని ఉపయోగించుకోరు.

చిత్రా పిల్లలూ హైదరాబాదు బైలుదేరారు. నర్తకి తెనాలి వెళ్ళింది వాళ్ల అన్నయ్యని చూడడానికి. ఎల్లుండు వొస్తుంది

ఇల్లు నిశ్శబ్దంగావుంది. జిమ్మీ మొరుగులూ, రాజా చిలక అరుపులూ — అంతే.

ఎండల్లోకూడా పేకాట జోరుగా సాగుతోందా ?

ఈశ్వరుడు చేయించేదేమిటి ? మనమేకదా మన పనుల్ని కావలసి నిర్ణయించుకుని చేస్తున్నాము ? ఇంక

ఎవర్నో అనడమెందుకు? చేసిందానిని అనుభవించాలి.

అంతే నాకు తెలిసింది—

31—3—61.

మీ ఉత్తరాలు రెండూను, మీతొలిమాటబావుంది.

శామశేషయ్యగారు ఆశ్రితులకు తోడ్పడతామని ఉత్తరం రాశారు.

నా దగ్గరున్న మీ ఉత్తరాలు త్వరలో పంపుతున్నాను.

ఆ జగడాల దంపతుల వివరాలు రాయండి.

కథరాయగలనని తోచదు-కాని-ఏమో!

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 109

శ్రీరమణస్థాన్

18—4—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం- ఇదిచాలాకాలం కిందిమాట. Paul Brontin. తన పుస్తకంలో రాశారు. యోగిరామయ్య అనే ఆయన ఆ రోజుల్లో ఇక్కడ ఒకయోగి యోగులకి విషజంతు వుల్ని చూస్తే భయం ఉండదంటారు కద!

ఆ మాటలా! ఆమాటలకేం లెండి! అవి గొప్ప మాటలు.

ఆత్మఅంతా వొకటే, మనంవేరు అనుకుంటునాము. పిల్లలు చందమామల్ని అనుకున్నట్టు-

మనలో భయంపోతే. ద్వేషంపోతే ఘాతుక జంతువులు మననేం చేయవు. ఒక్క మనిషి తప్ప 25-4-61

అవును. శ్రీశ్రీ రాసింది చూశాను. ప్రళయం సంగతి ఆయనకేమీ రాయలేదు. రామశేషయ్య గారూ ఏమీ రాయలేదు ప్రళయాన్ని గురించి, ఇలస్ట్రేటెడ్ వీక్లీ సంగతి నా కేమీ తెలీదు. పూర్వం కొంతకాలం కిందట ఆ ఎడిటర్ నాగథ కావాలన్నాడు. పంపితే, ఇంకోరకం కావాలన్నాడు. నేను వూరుకున్నాను. భగవాన్ బోటివారికి అంతా ఒక్కటే ఆత్మ. వేరు అనేది లేదు. కనక ఏమిచేసినా తనకి చేసుకున్నట్లే.

మనలో ఉన్నది ప్రతీదీ బైట పెట్టవలసిన అవసర మేముంది? మన అంతరాత్మ ఏమి చెపుతుందో అదే మన కర్తవ్యం.

నేనిప్పుడు ఏమీ రాయలేను ఆ విధంగా బుద్ధిపోవటం లేదు.

తక్కిన మిత్రుల ఉత్తరాలు చలం దాచలేదు ఆ కాలంలో- ఇప్పుడు ఈశ్వరుడు వొచ్చాక. ఆయన కొన్ని దాచమన్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 110

శ్రీరమణస్థాన్
16—5—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు – చిక్కుడు పందిరినిండా అల్లుకొని అట్లానేవుంది. ఒకటి రెండు వానలు కురిశాయి. ఇంకా ఎదుగుతుందేమో !

అంతేలెండి ఈ తెలుగువాళ్ళు, వాళ్ళ ప్రసక్తి వొదిలెయ్యండి.

పా–వారు జీసస్ చరిత్రని అచ్చువేస్తానని చెప్పారా ! పుస్తకాన్నీ డబ్బునీ తనదగ్గరే వుంచేసుకుని, ఏ మాటాలేక వూరుకున్నారు. రుక్మిణీనాథ శాస్త్రిగారు తిరిగి తిరిగి వారి కోసం మొన్ననే డబ్బునీ పుస్తకాన్నీ తీసుకున్నారు. ఇప్పుడు అచ్చువేయించాలంటే, అన్ని ప్రెస్సులూ బడిపుస్తకాలు అచ్చువేస్తున్నాయి. త్వరలోనే అచ్చుకి ఇయ్యాలని చూస్తు న్నాము.

చలం సినిమాకి రాయడంలో కూర్మా అన్న మాటల్లో (Point) పాయింట్లు లేకపోలేదు.

(1) డబ్బుని దృష్టిలో పెట్టుకు రాయడం.

(2) రాయించేవారి ఇష్ట ప్రకారం తనకిలాస్న వంకర తిప్పడం–ఇది తప్పు.

అట్లా కాకుండా డబ్బుకి లెక్క–చెయ్యకుండా, తన ఇష్టప్రకారం రాసినదానికి సినిమావాళ్ళు ఇచ్చే డబ్బు తీసు కోడంలో తప్పు కనబడదు–ఈ సంగతే మీరూ అన్నారు. ఇంతకీ––

(1) నేను రాయడంలేదు.

(2) ఈనాడు నాకు తప్పొప్పులు లేవు.

ఈశ్వరుడు ఏది చెపితే అదే––

ఈ బ్లడ్ ప్రషర్ నయంకావడమూ ఈశ్వరాజ్ఞ కావడమూ, జరిగితేకాని నేనేం కథ రాయగలను ?

ఈశ్వరుడు చెయ్యమన్న రాతపనులే మూలపడి వున్నాయి, నా రక్తపుపోటు మూలంగా—

కానీ నేనే రాస్తే అది ఎంత గొప్పకథ అయ్యేదో ? అయినా వొచ్చేది సత్యయుగం. అట్లాంటి కథలు అచ్చులోకి రానీరేమో !

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 111

శ్రీరమణస్థాన్
16 – 5 – 61.

జగ్గూభాయ్,

ఇవాళ మళ్ళీ మీనించి ఉత్తరం. కర్మసిద్ధాంతం సంగతి.

(1) బాధలే కాదు, సుఖాలుకూడా అనుభవిస్తున్నాము—సుఖాలు కావాలి అనే కోర్కె వున్నంతవరకు వాటి వెంటనంటిన బాధలు తప్పవు. బాధలులేని స్థితి ఈ లోకంలో సాధ్యంకాదు.

పోయిన ఏడాది చేసినదానికి ఈ ఏడు అనుభవించడంలో న్యాయంలేదా ! జన్మల సంగతీ అంతే

ఏం పాపాలు చేశారో, వాటికి ఏం శిక్షో ఎందుకు చెప్పరంటే, శిక్షలకి జడిసి పాపాలు మానుకోడం ప్రవృత్తి

పిరికితనం అసలు పాపంమీద కాంక్షవుండే బుద్ధిపోవాలి. బాధ ఆ కాంక్షని నశింపచేస్తుంది.

రోగానికి మందు వేసేప్పుడు, వైద్యుడు రోగమెందుకు వచ్చిందో చెప్పడమెందుకు? మీకు తెలుసా ఎందుకు వొచ్చిందో. కాని చేదుమందు తాగుతారు. ఆ మందు ఎట్లా కుదురుస్తుందో మీకు చెప్పవలసిన పనేముంది? "అదంతా నీకెందుకు? ఈ చేదుమందు లాగుతుంది, నీకు కుదురుతుంది" అంటాడు.

లోకం చూస్తున్నారుగా, ఎంతమంది మేలుకుని తెలుసుకుని మానుకుంటున్నారో! ఎవరూ మానుకోటం లేదు. రోగాల బాధలు అనుభవిస్తోకూడా స్త్రీని ఎవడు వొదులుతున్నాడు.

పెళ్ళివల్ల ఇన్ని అనర్థాలున్నాయిరా అని ఎంత రొద పెట్టినా, చలం శిష్యుల్లో ఆ మాటని లక్ష్యపెట్టినవాణ్ణి ఒక్కణ్ణి చూపండి.

ఆ చెడ్డగుణం పోయిందాకా ఆ లోకంలో ఈ లోకంలో బాధలు వొస్తూనేవుంటాయి.

గర్భంలో వున్నప్పుడు బాధ—అదంతా అబద్ధం. ఏది తప్పో ఏది వొప్పో అంతరాత్మ చెపుతోనేవుంది. తెలీదన డం వుత్త వంచన

తక్కినవాళ్ళ సంగతి మీకెందుకు? మీ అంతరాత్మ చెపుతున్నట్టు చేస్తున్నారా?

ఈశ్వరుడు చెప్పకేం ? మీ హృదయంలో కూచుని ఎప్పుడూ చెపుతోనేవున్నారు. ఆయన ప్రవక్తలు చెప్పారు శాస్త్రాలు చెప్పాయి.

ఏ వొక్కదాన్ని నమ్మినా, సరిగా నడుచుకోవచ్చు.

అవును. మానవుడు తప్పుచేయకండా నిలవలేడు. అందుకే ఈ శిక్షణ — శిక్షలు—

పాడు మనసును ఈశ్వరుడిచ్చారో లేదోకాని, జన్మ జన్మ మన మనసుని, మన కార్యాలవల్ల, మనం పాడు దానినిగా చేసుకున్నాము.

సౌఖ్యాలు అనుభవించడం తప్పుకాదే. కాని వాటి నంటుకుని బాధలున్నాయి మీ యిష్టం. రెంటినీ తీసు కోండి, రెంటినీ వొదులుకోండి.

ముక్తి నిజంగా కావాలనుకుంటే, ఒక్క నిమిషంలో వొస్తుంది. యుగాలెందుకు ? అన్నీ వొదిలెయ్యగా కోర్కెలు కూడా తీసేసుకోండి.

ఈ కష్టాలన్నీ ఈశ్వరుడు మానవుడికి ఇస్తున్నసహాయాలే.

ఆ కర్మ చేసేప్పుడు అస్వతంతుడ ననుకుంటో చెయ్యడే మానవుడు ? అనుభవించేప్పుడేనా అస్వతంత్రత !

క్రిస్టియన్ల ప్రకారం నిజమైన పశ్చాత్తాపంవల్ల, క్రీస్తులో నమ్మకంవల్ల పాపాలు నశిస్తాయి. ఆ మాట నిజం. కాని పశ్చాత్తాపమంటే ఏమిటో యోచించుకోమనండి.

అట్లానే హిందూమతంలోకూడా గురువు అనుగ్రహం వల్ల ప్రారబ్ధం మండిపోతుంది.

ఈ జ్ఞానమంతా నాకు ఈశ్వరుడిచ్చినది — నా సొంతంగా నేను తెలుసుకోలేను—

ఆయన చెప్పినదంతా చాలా న్యాయంగావుందికదూ!

ఈశ్వరుడు మాట్లాడితే, ఆయనకి మనకన్న ఎక్కువ తర్క చాతుర్యం వుండడం ఆశ్చర్యమా ? ఇది తర్కంకాదు- సత్యం—

తర్కంతోనే సత్యం రుజువుచేస్తారు ఆయన-

ఈశ్వరాశీర్వాదాలతో

- చలం

# 112

శ్రీరమణస్థాన్

జగ్గూభాయ్, 19—5—61.

మీ అందాల ఉత్తరం-మొన్ననే పోస్టుచేశాను మీ బైబిలు పరిశ్నలకూ కర్మప్రశ్నలకూ జవాబుఇస్తూ.

ప్రళయాన్ని గురించి అన్నిదిక్కులనించీ, పూర్వపు రాతలనించి వార్తలు వొస్తున్నాయి.

మీ పెద్ద ఉత్తరం- ఆత్మ అంటేనే. ఆనందం—అనుభవించేది మనసు. మనసు అనుభవించే ఆనందమంతా ఆత్మనే అనేకరూపాల అనుభవిస్తోంది. అనుభవించడానికి ఆత్మకి తాను కాక వేరైనది లేదు.

తక్కిన సందేహాలు తీర్చడం కష్టం. అవి అతి ముఖ్యమైనవి కావు మాట్లాడుకుంటే సులభంగా అర్థమౌతాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 113

శ్రీరమణస్థాన్
24 – 6 – 61.

జగ్గూభాయ్,

సన్యాసం సంగతి-

పరిశయం సంగతి చిత్తూరులో బాగా అల్లుకుంది, ముఖ్యం సభాగారి ప్రచారంవల్ల-అదిగాక ఈశ్వరుడు కొన్ని చిత్రమైన మహిమలు చూపారు. దాంతో అనేకమంది ఈశ్వరుణ్ని చలాన్నీ దర్శించాలని కుతూహల పడ్డారు. వాళ్ళందర్నీ తీసుకొచ్చారు సభా. పనిలో పనిఅని చలానికి ఓ సన్యాసం కూడా సంకల్పించారు - అదీ కథ ... ఓయాభై మంది వొచ్చారు.

ఆగస్టు 15–కి వందమందికి పైగా వొస్తారట-

రక్షణ కేంద్రం స్థాపిస్తారట, ఎంత మందికైనా-

ఏదో విధంగా మీ పుస్తకం అచ్చయ్యేటట్టు చూడండి.

ముందు డబ్బిచ్చి పుస్తకాలుకొనే డిస్ట్రిబ్యూటరు ఈ భూమిపైన ఇంతవరకు జన్మించ లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 114

శ్రీరమణస్థాన్
6 – 6 – 61.

జగ్గూభాయ్,

ఇవాళ తారీఖు చూడండి. ఎంతబావుందో! చలాన్ని గూర్చి మీరు చాలా రాశారు—కాని మీ కలంవల్ల అక్షరాలు తెలీక ఏం చదవలేకపోయాను.

బుద్ధుడి సంగతి నాకేం తెలీదు. ఆయనకి జ్ఞానోదయమయింది మాఘశుద్ధపూర్ణిమకు అని విన్నాను-షేక్స్పియర్ కూడా పుట్టినరోజునే పోయినాడు.

చాలామంది అతిధులు.

ప్రతిరోజు కొత్తకొత్తవారికోసం చూస్తున్నాము. వస్తామని రాస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

—చలం

# 115

శ్రీరమణస్థాన్
30–6–61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు- మీ వేదాంత ఉత్తరాలు చదవలేకుండా వున్నాను-అసలు వేదాంతం నాకు విసుగు-మీకేమన్నా ముఖ్యమైన సందేహాలువుంటే వాటికి జవాబు రాస్తాను.

ఇవాళ మీటాగూరు చలం ఉత్తరం. టాగూరుసంగతి మనకి చాలా స్వల్పం తెలుసు. బెంగాలీనించి చాలాస్వల్పంగానే ఇంగ్లీషులోకి వొచ్చాయి.

ఈనాడు టాగూరు ఎవరికీ అవసరంలేదు. ఈనాటి ఈ హడావిడి అంతా రాజకీయస్టంటు. కనక ఇంక ఆయన పుస్త

కాలు ఎక్కువగా ఇంగ్లీషులోకి రావు. విదేశాలలో అసలు ఎవరికీపట్టలేదు ఈనాడు. కనక ఇంక ఆయనపుస్తకాలు బైటికి వొచ్చేట్టులేవు.

ఇప్పుడు ఇంగ్లీషులో వొచ్చినవి కూడా ఆయనవి ముఖ్యంగా ఈశ్వరభక్తిని వెల్లడించేవీ, గొప్పగా ధ్వనించేవీ, అందరూ అంగీకరించేవే ఇంగ్లీషైనాయి – ఆయనకి నోబెల్ బహుమానంవొచ్చి ఆయనోగౌరవనీయమర్యాదపురుషుడుగా పరిగణించ బడ్డతరవాతే వొచ్చాయి పుస్తకాలన్నీ–

ఆయనకి యవ్వన కాలంవుండేది. ఆనాటి రాతల్ని దేశమంతా ద్వేషించింది. ఎంతగట్టిగా ఉతికాడో ఆ ప్రజల్ని! అవన్నీ మనకి తెలీవు– సారస్వత ప్రపంచంఆయన్ని బహిష్కరించింది. ఆనాటి రాతలుఇంగ్లీషులోకి రాలేదు. ఈసంఘాన్ని ఆయన చాలా దెబ్బలుకొట్టే. నవ్వి, హేళన చేసినట్టు కనిపిస్తుంది. కాని ఆయన కవిత కరుకుతనాన్నించి తప్పుకుంది. ఏ దెబ్బలు కొట్టినా అందమైన మొహమల్ కొరడాతో కొడతాడు.

ఇప్పుడునాకు ఓ పుస్తకం దొరికింది ఆయన 80 యవ ఏట చరిత్ర. దాంట్లోచూస్తే ఆయనకీ ఆయన కవిత్వానికీ దూరంలా వుంది. అక్కడే చలానికి చలం రచనలకీ చాలా దగ్గిర సంబంధం. నాజూకైన సూర్యకాంత తీగెకి మృదువు, వుజ్వలమైన ఎర్రటివువ్వులు పూసినట్టుంటుంది టాగూరు కవిత్వం–ఆయన కవిత్వం మీరనన్నట్టు ,ఆయనకే అంతుచిక్కని ఆయన హృదయంతరాళంలోంచివొచ్చింది. ఆయనమనసుపై పొరలు ఆకవిత్వాన్నించి కొంతదూరం. చలం రచనలూ

హృదయంలోంచి వచ్చినవే- కాని హృదయంలోంచి బైలు దేరి మనసు ద్వారంగుండా వొచ్చాయి టాగూరు కవిత్వం- హృదయంలోంచి సరాసరి వొచ్చింది కినకనే మీారన్నట్టు, మనుష్యుడి నిత్య జీవితంనించి, కష్టనష్టాలనించి, సందేహా భయాలనించి దూరం ప్రతివాటికీ చలంసిగ్గిరైనట్టు, టాగూరు కాలేరు. ఆయన ఎప్పుడూ ఓపీఠంనుంచే పాడతారు ఆయన ఎన్నడూ తనతోటి మామూలు మానవుడి పక్కన నేలమీాద చతికిల పడలేదు.

మనుషుడి వాంఛలు, ప్రయత్నాలు, భయాలు, పాపాలు, బాధలు- ఆయనకి తెలీక పోలేదు. ఆయన పడక పోలేదు. దరిద్రంకూడా ఎరుగును. కాని వాటిని ఆయన తన రచనల్లోకి తీసుకురాలేదు ఆయనకి సందేహాలెన్నో కాని రచనలో మాత్రం సంపూర్ణ విశ్వాసాన్నె ప్రకటించారు. అందువల్ల అవి మోసపు రాతలుకావు ఎందుకంటే, ఆయన రచనలు ఏ సందేహంలేని హృదయంలోంచి వొచ్చాయి.

కోవెల కూస్తుంది.. కాని దాని బాధల్ని, ఆకలిని కూతలో వినిపించనీదుకద !

ఆయనది చాలా శృంగారకవిత్వం వుంది. కాని అది ప్రచారంలోకి రాలేదు.

జన్మ, మృత్యువు, బాధలు, పరలోకాలు ఇవన్నీ ఆయన తరిచినవే, ఆయన మనసులో. కాని ఆయన రాయ లేదు. వాటినిగురించి ఎక్కువగా - ఆయన మనసులో ఈశ్వరుడి ఆత్మనిగురించీ సందేహాలు లేకపోలేదు. కాని చలంమల్లే వాటికి ప్రాముఖ్యత నియ్యలేదు.

బెంగాలులో టాగూరు ఎన్నో తిట్లుతిన్నారు. ఆ Nobel Prize వొచ్చి విరోధుల నోళ్ళు ముయ్యకపోతే, ఆయన సంగతి బైటికి రానిచ్చేవారేకాదు. చలానికే ఓ బహుమానం వొస్తే ఈ మొరిగే కుక్కలన్నీ అతని అరికాళ్లు నాకవా ?

ఒక భేదం

టాగూరు తన జీవితాన్ని చాలా మర్యాదగా గడుపుకున్నాడు—చలం చూసిన అన్యాయాలూ, క్రూరాలూ, స్త్రీల దీనచరిత్రలూ తెలిసినవాడే. పిల్లలు పడే బాధలు చూసినవాడే. కాని చలంనల్లే బాధపడలేదు. ద్వేషం పూనలేదు. దీనికంతా అర్థమేమిటని ప్రశ్నించలేదు.

అతని హృదయంలోని విశ్వాసం చెపుతోంది. అతనికి వీటికెక్కడో సమాధానం వుందని, ఆ సమాధాన మేదో అతనికి తెలీదు. కాని ఉందని శాంతంగా బతికాడు.

సంఘానికి ఎదురు తిరగలేదు.

చలం ప్రత్యేకత అతను నమ్మిందాన్ని ఆచరించడం. ఇతరులకోసం త్యాగం చెయ్యడం. కష్టాలలోకి పోవడం.

కనక అతనికి ప్రతిష్ఠ రాలేదు.

చలమే అరుణాచలానికి పోకపోతే చలంతో సహకరించడానికి ఈనాడూ భయపడేవారు. ఎందుకూ పనికిరాని నిర్భాగ్యుడని తిట్టి తగిలేశేవారు.

ఒక స్త్రీ విషయమేకాదు. వీళ్ళ బతుకుల్లోని నీచత్వాన్ని, దొంగతనాన్ని, బూతుని, మోసాల్ని, అసత్యాల్ని

బైటపెట్టాడని ప్రజలకి చాలా కసి. ఎన్నడూ అతన్ని క్షమించలేరు.

అందుకనే చలం రాతలకి అంత బలం, టాగూరు రాతలో అంత సౌందర్యం, సత్యం.

మొదటనించీ టాగూరు ఈశ్వరభక్తి, మామూలునీతీ, మర్యాదలిన్నీ పాటించడంవల్ల అతనికి చలానికి పట్టిన రొష్టు పట్టలేదు.

మీ ఉత్తరం చదువుతోవుంటే మీకెంత సునిశితమైన లోతుగాచూడగల దృష్టివుందా అని ఆశ్చర్యపడతాను

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 116

శ్రీరమణస్థాన్
10—7—61.

జగ్గూభాయ్,

వేదాంతం తలనొప్పి అంటోనే, వేదాంతంతో సంసారు ఉత్తరం — జాగర్త — ఏ ఉపయోగం లేదుకదా, హానికూడా చేస్తుంది. పూర్వం వాళ్ళకీ ఉపయోగపడలేదు. ఏదో అభివృద్ధి వొచ్చేసిందనే భ్రాంతిలో ముంచేసింది వాళ్ళని.

నేను రాశానే ఆధ్యాత్మిక గ్రంథం అదే 'సుధ.'

నిజమైన ఆధ్యాత్మిక జ్ఞానం 'మౌనం' రాయడానికేం లేదు.

ఇవాళ 20 ఉత్తరాలు వొచ్చాయి. వీటికి జవాబు రాసేప్పటికి—

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 117

శ్రీరమణస్థాన్
14 – 7 – 61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. మీరింక ఈ వేదాంతాన్ని వొదిలేస్తే మంచిదేమో! ఉత్తరాల్లో ఈ గురుశిష్య సంవాదం ఇట్లా సాగుతోనే వుంటుంది. దీనివల్ల ఏ ఉపయోగమూ లేదు. ఏవన్నా సు దా కథలు చదువుకోండి ఇంకా ఎక్కువగా పిల్లలతో పిట్టలతో కుక్కలతో ఆడుకోండి.

మీ ప్రశ్నలకి సమాధానం.

(1) ఆధ్యాత్మికానందం, కళానందంకన్నా గొప్పది. నిరంతరం వెంటనుండేది.

(2) అవును. ఈ బతుకు ఓ కలే – మరోలోకంలో వుంటున్నామనుకున్నా అదీ ఇంకో కలే—

ఈశ్వరుడి మాటతప్ప నాకే ఆధారాలూ లేవు. ఉన్నా నమ్మను.

(3) అంతా నీ మనసే కల్పిస్తుంది. మనసు శుభ్రమైనకొద్దీ, ఈ లోకాన్నే ఈ వస్తువులేనే ఇంకా అందంగా వున్నతంగా చూస్తుంది.

(4) లోకం మనసులోవుంది. మనసు మనం లోకంలో వున్నామంటుంది. మనసుతో లోకమూ మారుతుంది. రంగులూ ఆకారాలూ అన్నీ శుద్ధమాయ, అబద్ధం.

(5) అసలు సత్యం ఒకటే-మనసు చూసేదంతా సత్యం కాదు గనక. మనసునించి మనసుకి మారుతో వుంటుంది. అసలు సత్యమే ఈశ్వరుడు.

(6) అందరి ఆత్మావొకటే. మనుషులు వేరువేరు.

(7) అవును. సంతోషాన్నివ్వడానికి బైట వస్తువులు ఆధారం—ఎంతవరకు ఆధారమో మీ సంస్కారంపైన ఆధార పడివుంటుంది.

ఏదీ ఆధారంలేకుండా అనుభవించేదే ఆధ్యాత్మికా నందం ! ఆత్మే ఆనందం ప్రతివాడికీ ఆత్మవుంది కనక ఆనం దం వుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 118

శ్రీరమణస్థాన్
26—7—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు చూస్తూ ఒకేరోజున — చిక్కుడు పందిరి అంతా పాకింది. ఇప్పుడే ఓ పదిపిందెలు వేసింది. చిక్కుడు గింజలు వున్నాయి. కాని వానలులేవు. బావిలో

నీళ్ళు లేవు. మేఘాలన్నీ చాలా పనిమీద వున్నాయి దక్షిణాదిన.

మీ కల గొప్పగావుంది.

నేను సహాయం చేసిన స్త్రీలు మూడురకాలు. నా ఆదర్శాలు, నా పుస్తకాలు, నా స్నేహం, నే నిచ్చిన ధైర్యంతో జీవితాన్ని ఏదో కొంతకాలమన్నా గడుపుకున్నవారు—వీరిలో ఒక్కరికీ పశ్చాత్తాపం రాలేదు. నానుంచి దూరమై మర్యాదలోకలిసినా, జీవితాన్ని గొప్పగా స్మరించుకుంటారు.

నే నెరిగినవారు—నా పుస్తకాలు చదివి, నా జీవిత పద్ధతిని, వాళ్ళ జీవితాన్ని నడుపుకున్నవారు — వాళ్ళప్పుడప్పుడు నాకు తెలియపరచుకుంటూవుంటారు కృతజ్ఞతతో. కాని ఎంతోమంది నన్ను పలకరించకుండానే వుండిపోయారు.

మూడోరకం- ఇది మాడాక్టరుగారి సహాయంతో. నా భార్యగారి సహాయంతో జరిగినది. దిక్కులేని వాళ్ళని ఆదరించి ఆర్థికంగా వాళ్ళని ఓ స్థితిలో నిలబెట్టడం-వాళ్ళు మళ్ళీ కనబడరు. నాపేర త్తరు. వు త్తభీరులు.

కాని నన్ననుసరించడంవల్ల దుర్గతిలో పడ్డామని నాతో అన్నవారు కాని, రాసినవారుగాని లేరు

రమణ భక్తురాలు ఒక ఇంగ్లీషు ఆమె పిల్లని పెంచి దేశమంతా తిప్పి ఋషుల చేతులతో దువ్వించింది. అది ఓ పుస్తకం రాసింది. చదువుతున్నాను. ఇంగ్లండులో అచ్చేశారు ఆ పుస్తకాన్ని. మీరు వుంటే బావుండేది ఇక్కడ. ఈశ్వరుడు చదివి చెపితే అందరమూ వినేవాళ్ళం.

మీకు పెద్ద కవరు రాయాల్సింది. కవరు లేదు.

మీకు వచ్చిన బాధలు ఆమెకీ వచ్చాయి. ఇదంతా మాయ, మమత, భ్రమ అని మనసుని తీసేసుకోవాలని చూస్తుంది, కాని చాతకాదు.

బాధ అంతా కర్మేకద !

స్వార్థరహితమైన బాధ—ఇతరుల బాధనిచూసి పడే బాధ, చాలా ఉదారమైన హృదయాన్ని సూచిస్తుంది. అట్లాంటి హృదయాలు లక్షలో ఏ ఒక్కరికోగాని వుండవు. వారు ఉత్తములు. వారు వీటికి అతీతులై మనసుని అణిచి నప్పుడేకాని వారికి బాధలు తగ్గవు. బాధపడేవారు అసలు అవసరమైన సహాయాన్ని చెయ్యలేరు

విజయనగరం పబ్లిషర్ ఏమన్నాడో రాయండి.

మీ ఉత్తరాలు బైటికి తీశాను. ముందు Pack చెయ్యాలి, రాజాం వెళ్ళండి.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 119

శ్రీరమణస్థాన్
18—8—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరాలు అచ్చుకావడం సంతోషం— ఇక్కడ వున్న మీ ఉత్తరాలు మేము సరిచూచి పంపమా? ఆ వేదాంత ఉత్తరాలన్నీ తీసెయ్యాలి.

మీ అంకితం బావుంది.

మనిద్దరి పేర్లూ వేద్దాం. పుస్తకం అచ్చు ప్రారంభం కానీండి, ఆ సంగతులన్నీ తేల్చుకోడానికి చాలా టైము వుంది.

ఉత్సవానికి వొచ్చిన మనమిత్రులు ఇంకా వున్నా రిక్కడ. చాలా సరదాగా.

ఆ పబ్లిషరుకి మన ఉత్తరాలు ఇవ్వడానికి నా అభ్యం తరం లేదు.

ఇంక మీఉత్తరానికి జవాబులు-మనం వూహించుకో లేనన్ని శక్తులున్నాయి మానవుల్లో-కాని వాటిని పట్టుకుని అబద్ధపు శక్తులెన్నో వున్నాయి.

ఏమీ నిశ్చయంగా చెప్పడం ఎవరితరమూ కాదు.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 120

శ్రీరమణస్థాన్
29 – 9 – 61.

జగ్గాభాయ్,

మీ ఉత్తరాలు

నాస్తికుడూ అస్తికుడూ అనికాదు. ఎవరు సూనృతులూ, ఎక్కువ సత్యాన్వేషణా తత్పరులైతే వారు ఈశ్వరుడికి దగ్గిర.

'గోరా' గారు (గోపరాజు రామచంద్రరావుగారు) వొచ్చారు. ఒకరినొకరు ప్రశ్నించుకోవలసిన అవకాశమే

కలగలేదు. వెంటనే వాళ్ళిద్దరికీ స్పష్టంగా గోచరమైన అన్యోన్యతలో. అభిప్రాయభేదాలు చాలా స్వల్పంగాతోచి ఆవేపుకి రాకండా ఎగిరిపోయాయి. ఆ నాస్తికుడు కాదనేదంతా, ఈ లోకంలోని ఎందుకూ కొరగాని అంధకారాన్ని. ఈ ఆస్తికుడు ఔననేది అంధకారం వెనకదూరంగా కనిపించేకాంతిని. అంధకారాన్ని కాదన్నా కాంతిని ఔనన్నా-మాటల్లో భేదమే కాని, మాటలవెనక భావంలో ఐక్యతేచూశారు వాళ్ళిద్దరూ.

గోరాగారు ఈశ్వరుడితో ఏమీ వాదించలేదు. తను నడుపుతున్న కార్యక్రమాన్ని గూర్చి మాట్లాడారు.

మీరు "గోరా" గారు మారారా? ఈశ్వరుడిలో విశ్వసించారా? అని అడుగుతున్నారు.

చలంమారాడా అరుణాచలంవొచ్చి? సత్యంలోకి ఎదిగాడు. సత్యాన్వేషకుడు. గడపదాటినట్టు, దాటమారాడు. ఈశ్వరుడిలో విశ్వసిస్తున్నాడంటే అర్థమేమిటి? ఈశ్వరుడు ఉన్నాడు అని పెదవులతో అనడమా! ఈశ్వరుణ్ని హృదయంలోకి తెచ్చుకోడం. అది ఒకనాడు జరిగేపని కాదు.

'గోరా' ఆవిధంగా అన్వేషిస్తో, ఎదుగుతోనేవున్నారు. అందువల్ల 'గోరా'లో ఆస్తికుణ్ని చూశాడు చలం—

ఎప్పుడూ అనృతాన్నిచీల్చి చూడాలని యత్నిస్తూనే ఉన్నాడు చలం. కనుక చలంలో నాస్తికుణ్ని చూశారు 'గోరా'. చిన్నారావుగారు ఇక్కడే వున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 121

శ్రీరమణస్థాన్
8 – 11 – 61.

జగ్గూభాయ్,

చాలానాళ్ళకి మీ ఉత్తరం.

(1) నాభాష సంగతి నాకు తెలీదు. నేను ఆలోచించి రాసింది కాదు. నా ప్రయోజననానికి సరిపడే భాషఅది.

(2) నా ఉత్తరాలవల్ల ఎంతోమంది సహృదయులు నాకు మిత్రులు కావడమే నా జీవితానికి మహోపకారం— ఆమిత్రులలో కొందరు, ఎన్నో వింత విషయాల్నీ, గొప్ప మనుషుల్నీ, స్థలాల్నీ వర్ణించి నాకు ఉల్లాసం కలుగచేశారు. నాకృషి వృథా కాలేదు. ఇన్ని హృదయాల్ని నాకు దగ్గిరిగా తెచ్చుకోగలిగాననే తృప్తినీ, విశ్వాసాన్ని నాలో కొంత విలువ వున్నదనే సంతోషాన్ని ఇచ్చాయి నాకు. అంతకన్న ఏంకావాలి ?

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 122

శ్రీరమణస్థాన్
9 – 11 – 61.

జగ్గూభాయ్,

వ్యక్తితన బైటి సుఖాన్ని చూసుకోవడం కన్నసంఘ క్షేమానికై పాటుపడడం ఉత్తమం.

కాని సంఘాన్ని అభివృద్ధి చెయ్యడానికి ప్రూనుకోడం కన్న, తనలోపలి అభివృద్ధికై పాటుపడడం ఉత్తమం.

ఈశ్వర సాక్షాత్కారం సంగతి మీరు రాసింది చాలావరకు నిజమే, తక్కింది స్వయంగా మాట్లాడుకుంటేనే కాని తెలీదు.

ఓ పదిమంది మిత్రులకు నేను రాసిన ఉత్తరాలలో కొన్ని ఏరి ఓ పుస్తకంగా అచ్చు అవుతున్నాయి.

"చంద్రవంక"ని సరిగా అర్థంచేసుకున్నారే ఇంకేం కావాలి ?

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 123

శ్రీరమణస్థాన్
15—12—61.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

మీ గీతం బావుంది. మీరు నవ్వులు రాసినప్పుడే తెలిసింది, మీరు కవిత్వం రాయగలరని. జీసస్ పటంకూడా అందింది.

ఆంధ్రప్రభవాళ్ళు నేను శివరామారావుగారికి రాసిన లేఖలు వేస్తారట.

ఆ శేషయ్యగారు ఏంరాస్తే నాకెందుకు ? మీరూ నేనూ, మనమధ్య మిత్రత్వం, ఇదితప్పించి ఇంకోరు ఏమంటున్నారో వినాలని లేదని ఎన్నిసార్లో రాశానుకదా !

నాకు వేమన్న సంగతి తెలీదు.
"కామిగాక మోక్షకామికాడు."
అన్నదాని సంగతేమో ఆ శేషయ్యగారు రాసింది.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 124

శ్రీరమణస్థాన్
21–12–61.

జగ్గూభాయ్,

మీరేదో మారమైనారు కొన్నాళ్ళు. ఈ మూడో కవరు చివర మళ్ళీ దగ్గరైనారు.

నేనెంతో పనిలో ఉన్నాను. పైగా జయంతి. వొళ్లు బాగాలేదు. మీ మూడు ఉత్తరాలు చదివేటప్పటికే మూడురోజులు పట్టింది. ఈశ్వరుడికి వినిపించాలి, తీరుబడి ఐనప్పుడు. అది ఎప్పటికో, అప్పుడు రాస్తాను ఈశ్వరుడేమన్నారో అదీ ముఖ్యం.

మీ భార్యతో మీరు వ్యవహరించిన విధానం గొప్పగావుంది—చలం తన బోధనల్ని చూసి గర్వపడవొచ్చు. తాను నమ్మినదాని ప్రకారం ఆచరించినవాడు లోకంలో బైటపడేప్పటికి దెబ్బతింటాడు. లోకులు అతని ఊర్ధ్వదృష్టిని పురస్కరించుకుని అతన్ని హింసిస్తారు, అధర్మంగా—అతను అధర్మానికి దిగడని తెలుసు కనుక—ఇన్ని తిప్పలుపడీ, మీ భార్యని అంత గొప్పగా అర్థంచేసుకోడం తెలుపుతోంది.

మీదెంత ఉదారమైన హృదయమో ! ఏ కారణంలేకుండానే ప్రపంచంకిన్న ఉన్నతాశయాలున్న వాణ్ణి ద్వేషిస్తారు మనుషులు. ఎవరూ చెప్పకండానే అతను తమకన్న భిన్నమని తెలుస్తుంది.

జనవరిలో వొస్తారా ? తప్పక రండి.

"జీసస్ జీవితం" డిశంబరు ఆఖరులోపల వస్తుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

— చ ల ం

# 125

శ్రీరమణస్థాన్
3—1—62.

జగ్గూభాయ్,

మీ భార్య విషయమై రాసిన ఉత్తరాలు చదివాము ఈశ్వరుడినుండు. మీరు చాలా Noble గా వర్తించారు. ఆమెకూడా అసాధారణమైన వ్యక్తి మీరు వివరించినట్లు మీ గ్రామంలో మనుషులూ, ఆమె కుటుంబమే ఈ అల్లరికీ, మీ దుఃఖాలకీ కారణమైనారు. మీ వకీలు ఎవరో వృత్తి పనికిమాలినవాడులాగున్నాడు. మీకు సరైన సలహా ఇవ్వలేదు.

కాని ఆ కథ చాలా బావుంది.

నేను మీకు రాశాను. నాకు మిత్రులు రాసిన ఉత్తరాలు ప్రచురిస్తున్నారనీ, మీవీ ఓ రెండు ఉత్తరాలు పంపమనీ. దానికి సమాధానంలేదు మీనించి. చలి, చీకటి,

కదలలేను. నా కళ్లు కనపడవు. పైగా ఏమీ తీరికలేదు. మళ్ళీ రాస్తాను.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

## 126

శ్రీరమణస్థాన్
16—1—62.

జగ్గూభాయ్,

మీరు సంఘం విషయమై అడిగే ప్రశ్న పెద్దది. జవాబు విపులంగా రాయాల్సివుంటుంది. స్వయంగా మాట్లాడుకుంటే మంచిది. ఎంత రాసినా స్పష్టంగా సరిగా అర్థంకాకపోనూవచ్చును.

మీరు రాసినట్టు, హృదయం ఆదేశించిన ప్రకారం చెయ్యటం సరైన సంగతి.

సెక్సు కంట్రోలు విషయం స్త్రీ పుస్తకంలో దీర్ఘంగా చర్చించాను. తిరిగి ఒకసారి చదివిచూడండి. అవును వీర్య శక్తి ప్రతిఘన ఉద్యమానికీ సహాయపడుతుంది. ఆ శక్తి ఉపయోగపడాలంటే అతని సమస్త శక్తులూ ఆ కార్యం మీదనే, సాధనమీదనే లగ్నమైవుండాలి.

లారెన్సునుగూర్చి నే నట్లా రాయలేదు. అతను ఏ ఆధ్యాత్మిక స్థితినీ పొందలేదు. అతనికీ విషయం తెలీదు.

మీరు అడుగుతున్న తక్కిన ప్రశ్నలు ప్రేమలూ, కోరికలూ- వాటివిషయమూ స్వయంగా మాట్లాడుకో వలసిందే.

ముందు పాపమేమిటో, పుణ్యమేమిటో తేల్చుకోవాలి. ఇదంతా మనం కలుసుకున్నప్పుడు.

ఏమిటి అట్లారాస్తారు? మీరు మాయెడల తప్పులు చెయ్యడ మేమిటి? మీ కెందుకు అట్లాంటి ఆలోచన వొచ్చింది?

సారీస్ మీదా, చలంమీదా, సందేహాలు రావడం సహజం. అట్లాంటి తుపానులకి తట్టుకున్నప్పుడే విశ్వాస మందిరం గట్టిగా నిలుస్తుంది. మీ కేమిటి చలానికిరాదా సందేహం లేక తనపుస్తకాలు నిజంగాగొప్పవా, లేక వృత్తమోసమా' తాను నిజంగా ఏమన్నా సాధించాడా, లేక తనువృత్త 'హంబగ్గా' అని, ఏదో తనలో గొప్పవుందంటే వొప్పుకుంటో ఇతరుల్ని మోసం చేస్తున్నాడా చలం! అని ఎన్నోసార్లు సందేహం వొస్తుంది.

మీ ఉత్తరాలు పంపమని రాశాను. ఆఉత్తరంమీకు ఎందుకు అందలేదో.

మీరు జీసస్ విషయమై రాసింది చాలా నిజం.

మీ ఉత్తరం చూసి చాలా సంతోషించాను, విశ్వాసం అట్లావుండాలి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 127

శ్రీరమణస్థాన్

జగ్గూభాయ్,

మీనుంచి ఉత్తరంలేదు. మీవాళ్ళు ఎట్లావుందోనని ఆలోచిస్తున్నాను. నేనుపంపిన విభూది అందేవుంటుంది. మళ్ళీ పంపుతున్నాను.

వెంటనే జవాబురాయండి.

మీ ప్రకృతి వైద్యం పుస్తకానికి బైండు చేయించి భద్రంగా వుంచాను

వైద్యానికి మన్ను కట్టడం మొదలైన విషయాలూ రంగునీళ్ళ ఉపయోగాలూ ఇంకా విపులంగా వున్న పుస్తకం ఏమన్నా వుంటే పంపండి.

మీ ఉత్తరం—దానికి సమాధానాలూ, ప్రశ్నలు మీకు జ్ఞాపకం వుండవని మీ ఉత్తరం తిప్పిపంపిస్తున్నాను.

(1) సాధకులకు ఆలోచనలు ఏమీ ఉపయోగకరం కాదు. తగ్గించుకోవాలి.

(2) లోకం అంతా మనసుమీదనే ఆధారపడి వుంది.

(3) అవును, సృష్టి రహస్యంకోసం హృదయంలోనే వెదకాలి.

(4) జన్మలున్నాయి. కాని వాటిని రుజువుచెయ్య లేము. దృష్టాంతాలు దొరికినా, వాటిని శోధించి సైన్టిఫిక్‌గా రుజువు చేసినవారు లేరు.

(5) మనసు నాశనం చెయ్యడం వల్ల.

(6) అవును. ఆత్మే అన్నిటికీ కారణం. ఆత్మతప్ప ఇంకేం లేదు.

(7) అవును. మనసు పోతే, ఆత్మ ఒకటే మిగిలేది.

(8) మనసుపోతే కాని సత్యం తెలీదు.

(9) ప్రతిజీవికీ కొంత ఒకేరీతిగా కొంతభిన్నంగా కనపడుతుంది సృష్టి.

(10) హృదయమేవుండాలి. ఆర్టుకి కృషి, ఆత్మవై శాల్యం రెండూ వుండాలి.

ఇవీ సమాధానాలు. మీరుప్రశ్నలు వేస్తే, జవాబు ఇవ్వకుండా వుండలేను.

ఇట్లాంటి ప్రశ్నలు ఇంక వెయ్యకండి
నాకు శ్రమ

నా ప్రత్యుత్తరాలవల్ల మీకేమీ ఉపయోగంలేదు. ఇవన్నీనేను ఈశ్వరుడినించి తెలుసుకున్నవే గాని, నా స్వానుభవం వీటిల్లో ఏమాత్రంలేదు.

నా మనసు అలిసిపోతోంది. విసుగుపడుతున్నాను. ఈ వేదాంతం నాకు వొద్దు. మీకూ వొద్దని నే నెంత చెప్పినా మీరు వినరు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 128

శ్రీరమణస్థాన్
14—3—62.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం, అంతా చదివాను, మీ భావాలన్నీ బావున్నాయి సరే, మీ తృప్తికై ఉత్తరాలు రాస్తూనే వుండండి. మీరు ఉత్తరాలు రాయడానికేం ? రాయండి—కాని సమాధానాలు రాసే వోపిక నా కిప్పుడు లేదు. 'యువ' వాళ్ళకి ఉత్తరాలు ఇవ్వడానికి నాకు అభ్యంతరం లేదు——కాని వాళ్ళు ఏమి చేస్తారో అని అనుమానం. జవ్వార్ రాసిందాన్ని అంతా అసహ్యంగా మార్చి, వేసుకున్నారుట. అట్లాగే మన ఉత్తరాల్ని కూడా తప్పుడు అర్థాలు వొచ్చేట్టు మార్చివేయవొచ్చు. తీరా వాళ్ళ చేతుల్లోకి వెళ్ళింతర్వాత ఏం చెయ్యగలరు మీరు ? అట్లా మార్చకండా జాగ్రత్తపడగలరా ? పూచీ తీసుకోగలరా ? అవసరమైతే, వకీలుద్వారా పత్రం రాయించుకోండి.

21——3——62.

మనం షరతులు పెట్టడమే గాని, కోర్టుభయం వుంటేనే గాని, వాటిని పాటించరు పత్రికలవాళ్లు.

'సుధ' జ్ఞానమార్గం.

'మాత్రా' భక్తిమార్గం.

ఈ రెంటిలోనూ, గొప్ప రహస్యాల్ని, ఆ పద్ధతుల్ని ఆచరణలోపెట్టే విధానాన్ని విశదీకరించారు ఈశ్వరుడు, నా పేరుమీద.

'మార్తా' అచ్చువడం ఈశ్వరుడి చేతులోవుంది. తన బోధని ఏసు తన జీవితంలో తన శిష్యులపట్ల ఎట్లా ఆచరణలో చూపారో ఆ కథ 'మార్తా.'

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 129

శ్రీరమణస్థాన్
4—4—62.

జగ్గూభాయ్,

మీరు 29 న రాసిన భిక్షాందేహి ఉత్తరం నిన్న చేరింది నాకు. మీరు రాసిన ప్రతి ఉత్తరానికి జవాబు రాస్తోనేవున్నాను. మీకు ఎందుకు అందటంలేదో! అల్లాడ పార్వతీశంగారుకూడా నా ఉత్తరాలు అందటంలేదంటు న్నారు. శ్రీకాకుళం జిల్లాలో ఏ పోష్టువారో చలం ఉత్తరాలు దాచుకుంటున్నారా, లేక కోపంతో చించేస్తున్నారా!

వజీర్ రహ్మాన్ ఆంధ్రదేశం వెళ్ళారు. విశాఖపట్నం వెళ్ళబోతున్నా రనుకుంటా కాకినాడనుంచి. పకపక మద్రాసు వెళ్ళి ఓ 20 రోజులు విందులు చేసివొచ్చింది. అయినా

ఇప్పుడు నా ఉత్తరాలు — రోజుకి ఒకటి రెండు కార్డులు మాత్రం రాస్తున్నాను. నా దగ్గరి మిత్రులు, మీబోటివారికి ఏ నలుగురికో తప్ప, తక్కినవారికి ఉత్తరాలు రాయడం మానేశాను.

పాపం, కురంగేశ్వర్రావు మీరన్నట్టు, ఆ లోకం సరి హద్దులకి వెళ్ళి తిరిగివొచ్చాననని రాస్తున్నాడు జరం. ఇప్పుడే తేరుకుంటున్నాట్ట. నయంకాగానే ఇక్కడికి వొస్తాట్ట.

గడిచిన ఆరువారాలూ ఈశ్వరభక్తులకి, చెడ్డరోజుల్లా గున్నాయి. ప్రతివారినించీ బాధాయుత ఉత్తరాలే నా ఆరోగ్యమూ తిప్పలు పెట్టింది. ఇప్పుడు బావున్నాను. ముఖ్యమైన వైద్యం మీరు దానంచేసిన మృత్తిక నా ఆరోగ్యాన్ని చాలా జాగ్రత్తగా కాపాడుతున్నారు ఈశ్వరుడు.

రెండేళ్ళ కిందట నాటిన చిక్కుడుచెట్టు ఎండిపోయింది. ఆఖరికాపు కాస్తో చచ్చిపోతోకూడా చివరికాపునిచ్చి మరీ పోతోంది — టాగూరుగారిమల్లే.

బుజ్జాయి చచ్చిపోయింది, మీకు తెలుసా? బుజ్జాయి కూతురుకి పెద్దగడ్డ వేసింది. ఏ వైద్యానికి కుదరలేదు. వాతపెట్టాలన్నారు. ఆ పని చెయ్యడం ఇష్టంలేక వూరుకున్నాము. ఇప్పుడు మన్ను కడుతున్నాము. నయమయేటట్టు కనబడుతోంది.

ఈశ్వరాశీర్వాదాలతో

—చలం

# 130

శ్రీరమణస్థాన్
21—4—62.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం—మీరు రాసిన ప్రక్రియల్ని ఆచరణలో పెట్టడానికి యత్నిస్తాను

బుజ్జాయి కూతురు కుప్పికి కురుపు పూర్తిగా నయమయింది.

చలంమొడలగాని, ఇంకెవరి విషయంగాని, మీ ఆలోచనా పద్ధతిని మార్చుకోవాలి చలం ఉపయోగపడ్డాడు, చలానికి మనం ఉపయోగపడ్డాము-కనక పరస్పరంగా క్షేమం కాంక్షించాలనికాదు. ప్రేమనేది ఉపయోగంపైన ఆధారపడకూడదు. నాకు తెలుసు మీ ప్రేమ ఉపయోగాన్నిమించి పనిచేస్తుందని. కాని తెలపటం చాతకాక అట్లా రాశారు.

ఎందుకంటే, నేనేనాడూ ఎవరికీ ఉపకారంచేసే స్థితిలోలేను. ఉద్యోగాలిప్పించడం ధనసహాయం చెయ్యడం ఇట్లాంటివి. ఈనాడు పుస్తకాలు రాయను. ఉత్తరాలుచాలా స్వల్పం. ఎవరికేం ఉపయోగం? మాటలుకూడా చాతకావు-ధనసహాయం ఉద్యోగసహాయం వైద్యసహాయం పొందినవారు మళ్ళీ మొహం కనపరుస్తున్నారా !

చలాన్నే అందరూ అంగీకరిస్తే. ఇంకజగ్గారావు ప్రత్యేకత ఏముంది? సూర్యుడు చాలా తేజోవంతుడని పూజ

చెయ్యడంలో ప్రత్యేకత లేదు. తుమ్మిపువ్వులో అందాలు చూసిరాసిన కవిహృదయానికే కద అసలు సౌందర్య దృష్టి.

చలం చెప్పింది అందుకోలేరు. కాని అవి తమకి కావాలని ఆశ. అందుకే అంత ఆగ్రహం. చలం వాదులుకో మన్నవివాదులుకోలేరు. కాని వాటివల్ల బాధ. వాళ్ళబతుకులిన్ని చూసుకుని వాళ్ళకే సిగ్గు— చలాన్ని ఎరిగివుండి. అతని పుస్తకాలు చదివిద్వేషించేవారు చాలా తక్కువ. రచతయిలూ, మర్యాదస్తులూ, రేపే అపవాదులవల్ల ద్వేషించేవారు చాలా మంది. చలాన్ని ద్వేషించేవారు పలుకుబడి, ధనం, స్థానాల్లో వుండడం వల్ల వాళ్ళమాట చెల్లుబడి అవుతోంది.

ఎవరు ఏమిరాసీ ప్రజల మనసులోని దురభిప్రాయాన్ని పోగొట్టలేరు. చలం తనగురించి తాను రాసుకున్న దానికన్న ఎవరు రాయగలరు.

మాలతిగారు నాకు తెలుసు—కాని అంతే, ఆమెకి ఓ స్థానం, ఓ పరువు, ఇవన్నీ ఉన్నాయికదా! పత్రికల మనిషి. ఆమె ఏంచెయ్యగలదు, చలంపైన అభిమానం ఏదో కొంత ఉన్నాకూడా.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 131

శ్రీరమణస్థాన్
27—4—62.

జగ్గూభాయ్,

మీ రెండు కవర్లూ. మీరు అమితింగా చదివి, మీ మనసుని అయోమయం చేసుకుంటున్నారేమో! 'సెంటిమెంటు'ని అనేక అర్థాలలో ఎవరి ఇష్టం వచ్చినట్లు, వాళ్ళు వాడతారు. మీరు ఆ మాటని ఎన్ని విరుద్ధమైన అర్థాల్లో రాశారో! 'స్త్రీ'లో ముఖ్యంగా 'బిడ్డల శిక్షణ'లో సెంటిమెంటు సంగతి స్పష్టంగా రాశాను. చదవండి సహజంగా కొన్ని ఎమోషన్సు — ప్రేమ, ద్వేషం, దుఃఖం, సంతోషం, కోపం—ఇట్లాంటివి. సహజంగా కాక, మనిషి తాను ఏర్పరచుకుని, ఎమోషన్ అనుభవించే కారణాలు సెంటిమెంట్లు. భక్తి అనేది ఎమోషన్. దేశభక్తి, మాతృభక్తి, దైవభక్తి, ఇవి సెంటిమెంట్లు కాని దైవాన్ని తెలుసుకున్న తరువాత ఈ సెంటిమెంటు సహజమైన భక్తిలో, ప్రేమలో మాయమౌతుంది. ఇట్లానే పిల్లకి తల్లిమీద ప్రేమ సహజం. కాని ప్రేమ అంతరించిన తరువాతకూడా 'నా తల్లి' అని భక్తిని తెచ్చుకోడం సెంటిమెంటు.

శంకరుడు మొదలైనవారు చేసే పనుల్ని మామూలు మనుషుల కార్యాల లెవెల్ ( Level )కి తీసుకొచ్చి యోచించడం చాలా పొరపాటు.

ఇటాలియన్ యువకుడు రాసిన ఉత్తరాల సంఖ్య పత్రికలవాళ్ళకి ఎట్లా తెలిసింది! ప్రేమలేఖలకికూడా ఈ గతి పట్టింది ఈనాడు.

ప్రేమ గొప్పతనం ప్రేమదే. విరహంలోకాని, సంయోగంలోకాని. విరహంలో బాధ ఎక్కువ గనక మన

చెవులపడుతుంది. తల్లి పిల్ల నెత్తుకునిపోతో, ఇద్దరూ కలిసి నవ్వుకుంటోవుంటే, మనకి కిలకిలలు మాత్రమే వినిపిస్తాయి. ఎడబాటుపొందారా పెద్ద రోదనలు వినిపిస్తాయి. కాని వారి మధ్య ప్రేమ ఇప్పుడూ ఒకటే, అప్పుడూ వొకటే.

అశ్లీలం పదాలలో ఏముంది? మనిషి బుర్రలో పుట్టింది.

ఇప్పుడో పక్షులమీద Experiments ఎక్సపెర్ మెన్ట్సు చేసిన ఆయన రాసిన పుస్తకం చదువుకుంటున్నాము. చాలా జాతిపక్షుల్లో మనుష్యుల్లో వుండేకన్న పాతివ్రత్యమూ, జీవితాంత దాంపత్యమూ, చాలానిర్మలంగా, స్వచ్ఛందంగా వున్నట్టు ధ్రువమవుతోంది ఒకే స్త్రీ ఒకే పురుషుడు అనేది సహజం. ఆ ఆదర్శాన్నించి తప్పిపోవడం మానవత్వం బల హీనం. కాని ఆ బలహీనాన్ని, తక్కిన బలహీనాలవలె చూడక, దాన్ని ఘోరంగాచూసి పాడుపేర్లతో పిలవడం వుత్త దౌర్జన్యం.

అవినీతి, వ్యభిచారం చూడాలంటే అంతమూ ముం దుకు. ప్రతి సంసారమూ అంతే, ఈనాడు. భార్యాభర్తా కలిసి, ఏ ప్రేమా, శృంగారం లేకుండా, ఇద్దరూ డబ్బుకీ పదవులకీ ఎగబడే ఈనాటి దాంపత్యాలకన్న ఎక్కువ వ్యభి చారం ఎక్కడవుంది? ఈ సంసారులుకన్న మీరేమీ తప్పు చెయ్యటంలేదు. మీరు అప్పుడప్పుడు గతిలేక చేసేప, వారు గొప్పపేర్లతో రోజూ చేస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో.

— చలం

# 132

శ్రీరమణస్థాన్
4 – 5 – 62.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. అవును. పిట్టల దాంపత్యం అనేక రకాలు. 1. జీవితాంతం వరకు 2. కొంతకాలం, లేక ఒకరు చనిపోయే వరకు. 3. ఆరుతువుకి. 4. విచ్చలవిడి–ఇన్నిరకాలు, కాని ఏదైనా అవి తమ ధర్మం తప్పవు.

నా ఆరోగ్యం బాగానే వుంటోంది ఈ ఎండల్లో కూడా.

గొట్టిపాటి నరసింహస్వామి, బ్రహ్మయ్యగారూ నిన్న వాళ్ళవూళ్ళకి వెళ్ళారు

ఈశ్వరుడు కనిపెట్టి చూస్తున్నారు.

ఈ మధ్య మీరు ఓ ఉత్తరంలో (నా మూఃజింగ్స్ చదవటమో) మానవుడి స్వభావం మారదు. "పుట్టుకతో పుట్టిన గుణాలు పుడకలతో కానిపోవు" అని రాశారు

ఆనాడు నా అభిప్రాయం అదే. కాని ఈనాడు మారిందని ఇదివరకు మీకు రాసిన ఉత్తరాలలో రాసి వుంటాను.

ఈశ్వర సహాయంతో ఏ దుర్గుణమైనా నాశనమౌతుంది. ఏ సుగుణమైన అలవడుతుంది. గొప్ప ఉదాహరణ గాంధిగారు.

ఈశ్వర సహాయం లేంది మనిషి మారడం అరుదు.

మార్కస్ ఎరిలియస్‌ని ఇంగ్లీషులో ఎరుగుదును నేను.

మీ రెండు కవర్లూ. ఆకథ అచ్చుచిన్నది. నేను చదవలేను. మీ రెండో కవర్లో పత్రికలలోని పీలికా అదీ-అట్లాంటివి నా కఖ్ఖర్లేదని రాశాను మీకు.

ఇట్లాంటి పాడుపత్రికలు చదవడంకన్న పేకాట చాలా నయమేమో!

మీ కథ ఉత్తరం. మీ సంభాషణ సరిగానే వుంది. కాని మీ మిత్రుడు ఆమెను తిడుతున్నాడు. ఆమె అశ్లీలవతి అని. కాని ఆయన నింద అంతా. ఆమె తనతో ఇంకా అశ్లీలవతి కాలేదనేగా!

అదేచెప్పి నోరు మూయించండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 133

శ్రీరమణస్థాన్
15—5—62.

జగ్గూభాయ్,

మీ ప్రశ్నలకు జవాబులు ఇస్తున్నాను. అవి నాకు తెలిసినంతవరకూ ఆలోచించి నేను నిశ్చయానికి వొచ్చినంత వరకు. అవి పూర్తి నిజమని చెప్పలేను.

1. కార్యరూపంలో సాగనిచ్చిన కొద్దీ ఏ గుణాలైనా పెంపొందుతాయి. దుర్గుణాన్నికాని, పైకి రానీకుండా నొక్కి

పెట్టడం చాలా అవసరం. అప్పుడవి పెరగవు. అట్లా లోపలికి నొక్కడం మనం ప్రతి రోజూ చెయ్యక తప్పదు, సంఘంలో నిలవాలంటే. అట్లా నొక్కడంవల్ల అవి లేనట్టే అయిపోతాయి కొంతకాలానికి. కాని అవి ఎక్కడికీ పోలేదనీ, లోపలే అణగి వుంటాయనీ, సైకో అనాలిసిస్ శాస్త్రం అంటుంది. నేనూ అట్లాగే అనుకుంటాను. ఈశ్వర సహాయంతో యోగసాధన చేసి, మనసుని నాశనం చేసుకున్నప్పుడే అవి నాశనమౌతాయి. ఎందుకంటే ఆ గుణాలే మనసు వెనకవుండి, మనసుని ఆడించేవి. వాటి అంకురాల్నే వేదాంతంలో వాసనలు అన్నారు. కొన్ని గుణాల్ని, ముఖ్యంగా Instincts ఇన్‌స్టిన్క్ట్స్‌ని బలవంతాన అణచి వేయడంవల్ల హానికలిగేమాట నిజమే కనక ఈశ్వరునిపై భారంవేసి చెయ్యడం ఉత్తమం

2. కళ నిర్వచనం నాకు తెలీదు. కళకి ప్రయోజనం లేదు కళ అనేకరకాలు హృదయంలోంచి వెలువడిన కళే శ్రేష్టం. కళ అంటే హృదయానుభవం.

3. అనుభవం మాటలతో తెలుపడం దుస్సాధ్యం.

4. అనుభవిస్తున్నాము అని తెలుసుకోడం మనసుపని. హృదయానుభవం అనుభవంగా తెలీదు.

మీ రెండుకవర్లూ, మీ వైద్యాలు చెయ్య ప్రయత్నిస్తాను అవన్నీ నాకు జ్ఞాపకం వుండవు. ఎవరన్నా అంటి పెట్టుకుని జాగ్రత్తగా నా చేత చేయించాల్సిందే.

పలగరకి ఉత్తరం రాశాను.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 134

శ్రీరమణస్థాన్
23—5—62.

జగ్గూభాయ్,

విశాలాంధ్రకి ఉత్తరాలు యివ్వమని రాశాను. అందే వుంటుంది.

మీ ప్రశ్నలకు జవాబులు.

1. నిష్కామకర్మ అనేది - చాలా పెద్ద విషయం. అది ఒక్క సిద్ధులకే సాధ్యం. ఈలోపల సాధకుడు చెయ్య గలిగింది ఫలితంపైన పెద్ద ఆశ పెట్టుకోకుండా పనిచెయ్యడం. నిష్కామకర్మ అనేది ఆదర్శం సాధకులకి.

2. భక్తివుంటే, ఆ భక్తిని ఎట్లాచూపాలో, ఆ భక్తే తోవచూపుతుంది, ప్రేమమల్లేనే, ఆ రెండూ లేనప్పుడే ఈ ప్రశ్నలు—

3. మనం ఆర్జించిన జ్ఞానాన్ని మరిచిపోయే మార్గమే జ్ఞానమార్గం.

4. చాలా ఆసక్తితో ఇటూ అటూ చూడకండా సాధనలో దిగేవాడికి ఈ ప్రశ్నలు రానేరావు.

ఎవరికి నచ్చినవారు వారికి గురువులు.

తదేక దృష్టికలవారికి స్పష్టంగా తెలుస్తుంది "ఈయన నా గురువు" అని.

అసలు ఈ సాధకుడు వెదుక్కోనక్కర్లేదు. సమయం వొచ్చేప్పటికి ఆ గురువు తనని తానే తెలియచేసుకుంటాడు.

కాని ఇంకా ఈ దేహ సుఖాలపై ఆసక్తి వొదలని వారు, స్పష్టంగా తెలుస్తున్నా దానివేపు కళ్ళు మూసుకుని ఇన్ని సందేహాలు అల్లుకోడంలో, వాటిని తీర్చుకునే ప్రయత్నంలో ముందుకు సాగుతున్నారనుకుంటారు.

సందేహాలు తీర్చుకోడానికి ఉపక్రమించడం, గొంగట్లో అన్నం తినడం. ఎన్నటికీ తరగవు ఆ సందేహాలు అక్షుతలు తోనే వుంటాయి.

శృంగారంలో మనసు ఏకాగ్రమవుతుంది కనక అది ఓ సాధన చేసుకున్నారు. అవును స్త్రీని విసర్జించే సాధనలు కొన్ని, అంగీకరించేవి కొన్ని.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 135

శ్రీరమణస్థాన్
1—6—62.

జగన్నాథాయ్,

మీ ఉత్తరం. గాంధిగారేకాదు ఎందరో ఇట్లాంటి వెన్నో రాశారు, వాటికి అవే అర్థం. చివరికి అన్నీ ఒకటే.

కురుక్షేత్రం మోస్తరువి ఎన్నైనా రాయవొచ్చు "సీతల కురుక్షేత్రం. తెల్ల వెంట్రుకలు పాండవులు. నల్లవి కౌరవులు మధ్యవర్తి పేను శ్రీకృష్ణుడు" ఇట్లా - ఇట్లాంటి చెత్త ఎంతోవుంది అన్ని పుస్తకాలలోనూ.

'విశాలాంధ్ర' వాళ్ళకి అన్ని పరతులు పెట్టననసరం లేదేమో. వాళ్ళు పెద్దమనుషులని వింటాము

సందేహాల్ని పెంచుకోవడంవల్లా, తీర్చుకోవడంవల్లా ఏమీ ప్రయోజనంలేదు. దురద పుట్టించుకోడం, గోకించుకోడం, లాగుంటుంది.

ప్రకృతి పత్రిక వొద్దు. మీరిచ్చిన పుస్తకం చాలు. ఎంతో ఉపయోగంగావుంది.

ఇన్నాళ్ళమట్టీ, ఉన్న జవ్హార్ రేపు వెడుతున్నాడు.

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 136

శ్రీరమణస్థాన్
11 - 6 - 62.

జగ్గాభాయ్,

మీ ఉత్తరాలు అందుతున్నాయి.

నా ఆరోగ్యం బాగా వుంటోంది. ఈశ్వరుడి రక్షణతోనూ, మట్టి పట్టీలతోనూ.

ఏ కొత్త పుస్తకాలూ రాయడమూలేదు. అచ్చుకావడమూలేదు.

మీరు సుఖంగా ఉన్నందుకు సంతోషం.

నా లెటర్ పేడ్సు Letter pads అయిపోయాయి. ఇంక అవసరంలేదు. నేను కవరు ఉత్తరాలు ఎవరికిగాని రాసి చాలాకాలమయింది. ఈ మధ్య ఓ రాత్రి లాక్ —

స్పీకర్ బాధపడలేక వాటిని తిప్పుతో ఓ ఉత్తరం రాశాను వజీర్ రహ్మాన్‌గారికి. అదే ఆఖరేమో!

మీరు అడుగుతున్నారు గనక, మీకు ఒక ఉత్తరం రాస్తాను ఎప్పుడో.

దాంతో సమాప్తి.

ఇవాళ మళ్ళీ మీ ఉత్తరం.

అవును. కొందరు స్త్రీ పురుషులు తపస్సుచేసి కామ శృంగార వరాల్ని పొంది పుడతారు.

ధన్యులు.

మీరు రాసినవారి రకం వారిని నే నెరగను.

అంతా బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 137

శ్రీరమణస్థాన్
16—7—62.

జగ్గూభాయ్,

నేనీనాడు ఆనాడు రాసినట్లే, రాత ప్రారంభించినా ననుకోండి. అంటే శశిరేఖతో పద్మరాణితో ప్రారంభించి. అవి అచ్చయ్యేవి కావని నా అభిప్రాయం చలం రాతలు చదవడానికి మూడు తరాలనించి వీళ్ళని తర్ఫీదుచేశాను. కనక చదువుతున్నారు. కనక ఈనాడు మీరు వ్యాసాలు రాసినా, కథలు రాసినా అవి పత్రికలు ప్రచురిస్తాయి అనేది అనుమానం. ప్రచురణకూడా సిఫారసులమీద జరుగుతోంది.

అందువల్ల మీరు రాయడం మానకూడదు. వ్యాసాలుగాని, కథలుగాని తప్పక రాయండి. లేదా పోష్టు చెయ్యని ఉత్తరాలు రాయండి. ఆలోచించి నెమ్మదిగా మీలోవున్న ఉత్తమమైన దానినంతా కాయితంపైన పెట్టండి. అది ఇతరులకోసం కాదు మీకోసమే. మీ ఆత్మ తృప్తికే. అచ్చవుతాయనే దూరపు ఆశనుకూడా చేరనీకండి. ఆ ప్రయత్నమే చెయ్యకండి ముఖ్యం మీ పిల్లి చరిత్ర రాయండి.

ఇదివరకంతా మీ ఉత్తరాలలో చలం చాలా బహిరంగంగా కనపడుతున్నాడు చెప్పిందే చెప్పిందే తిరిగి తిరిగి మాటలు వాక్యాలు దొర్లేవి. మీ రాతనిగురించి ఇది వరకే రాశానే. మీ రాత నాకు గట్టిగా నచ్చింది. కొండ రాళ్ళకంటే (rough) గట్టి, కరుకు, సహజమైన బలంవుంది. మీ స్వభావంలోని నిర్మోహమాటం, నిజాయతీ, సూటిగా ప్రతిఫలిస్తుంది వాటిల్లో. కాని లోకానికి నచ్చకపోవచ్చు. ఏనాటికన్నా నచ్చనూవచ్చు. అది మనచేతుల్లో లేదు.

ఉత్తరాల్లో మీరు నా దృష్టిలో సత్యంకాని అభిప్రాయాలు రాసినప్పుడు తెలుపుతోనే వొచ్చానుకద !

టాగూరు సంగతి మీరు రాసింది అంతా నిజమే.

టాగూరుగార్ని గురించి నాలుగు వాక్యాలు రాయమంటాను. అట్లా రాయలేనండీ నేను !

సన్యాసం, వైరాగ్యం—అసలు ఈ మాటలకు అర్థమేమిటి? ఇట్లాంటివి మాట్లాడుకోవలసిందేగాని, ఏం రాసీ సరైన అభిప్రాయాలు ఇవ్వడం అసాధ్యం.

నేనొక మిత్రుణ్ణి ఎరుగుదును. చాలా డబ్బుగల వారు. ఈపాటికి చచ్చిపోయివుంటారు. ఆయన ఓ గొప్ప నాటకం, కొన్ని మంచి కథలు రాశారు. తాను ప్రచురించ లేదు. అడిగినా పబ్లిషర్లకి ఇవ్వలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 138

శ్రీరమణస్థాన్
27 – 7 – 62.

జగ్గాభాయ్,

మీ కాగ్డు నా మిత్రులు ఎందరూ చెల్లనివారు వారు చెపితే ఎవరూ వినరు. అందుకేవారు నాకుమిత్రులైనారు. అయినా మన ఉత్తరాల విషయం ఇంకోరు రికమెండు చెయ్యడం ఆ ఉత్తరాలకి అవమాన కరమైన సంగతి.

మీరు మీ పాతజీవితపద్ధతుల్ని మానుకుని, అలవాట్లని మార్చుకుంటేనేగాని, మీ ఆరోగ్యంమీకు బాధనిస్తూనే వుంటుందేమో !

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 139

శ్రీరమణస్థాన్
31 – 7 – 62.

జగ్గాభాయ్,

మీ ఉత్తరం. చిన్నపిల్లల్ని గురించి మీరు రాసిన ప్రతిమాటా నిజం.

చదువుకీ, సంస్కారానికీ సంబంధమేమిటి? పైగా చదువు పై మెరుగు సంస్కారాన్నే కాని, అసలు సహజమైన లోతైన సంస్కారాన్నివ్వదు. అది పుటకతోటే వొస్తుంది. పరిసరాలవల్ల వృద్ధిచెంది రాణిస్తుంది.

సంస్కారమంటే ఏమిటో మనకి తెలుస్తుంది. నిర్వచన మివ్వడం నాకు చాతకాదు. సంస్కారమనేదాన్ని అనేక అర్థాలలో ఉపయోగిస్తున్నారు. దానివల్లనే ఈ డొంక తిరుగుడు.

మీరు పంపిన కూర్మారావు వ్యాసం బావుంది. మీరే రాసివుంటారనుకున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ ల ం

# 140

శ్రీరమణస్థాన్
20—8—62.

జగ్గూభాయ్,

మీ రెండు కార్డులూ ఇవాళ.

ఆ పత్రికవాళ్లు పాపం, మిమ్మల్ని చాలా అన్యాయంగా చూస్తున్నారు నే నెందుకు తిడతాను పత్రిక వాళ్ళని ! అంతే ఆ మనుషులు

మీరేం గొడవపడకండి ఈశ్వరుడు చూస్తున్నారు.

సరే, వాళ్ళని మార్చకోండి, ఏమన్నా చెయ్యనీండి. ఏది ఈశ్వరుడు చేయిస్తారో అట్లానే కానీండి. ఇదివరకంతా ఈ మనుషులూ, పత్రికలూ, చేసిన అపచారాలకన్న ఎక్కువది ఈనాడు వీళ్లేం చెయ్యబోతున్నారు, చేసినా ఏం పోయింది? నే ననుకున్నట్టే, మీరు "ఆ ఉత్తరాలు నావి కావు, ఈశ్వరుడివి" అనుకోండి.

వాళ్ళ కృతజ్ఞత! కృతజ్ఞత ఏముంది? ఆ ఉత్తరాలు ప్రచురించినందుకు మీరూ నేనూ వాళ్ళకి కృతజ్ఞులమై వుండాలని వాళ్ళ అభిప్రాయం.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 141

శ్రీరమణస్థాన్
29—8—62.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. రాజకీయాలంటే నాకు తలనొప్పి; నాకు అర్థమూకావు. కమ్యూనిజం గ్రంథాలు నేనేం చదవలేదు. వారి ఆశయాలు రష్యాలో ఎంతవరకు సిద్ధించాయో నాకు తెలీదు. ఈకాలంలో ఒకదేశాన్ని ఇంకోదేశం పొగడడమూ, 'ఎడంచేతులో వీపువెనుక బాంబు పెట్టుకుని, కుడిచేత్తో సోదరా' అంటూ ఒకరినొకరు కావిలించుకోవడమూ పరిపాటి అయింది. అందువల్ల నేను నిర్ధారణగా ఏమీ రాయలేను.

కమ్యూనిజం – రెండు భాగాలు – ఒకటి కమ్యూనిజం వేదాంతం–ఆ విషయం 'మ్యూజింగ్సు'లో చాలా రాశాను.

ఇంతకీ, నా దృష్టివ్యక్తి మీద, కమ్యూనిజం దృష్టి సమష్టిపైన, కనక మాకు కుదరదు. మొదట్లో కమ్యూనిజం వల్ల భూతల స్వర్గమేర్పడుతుందన్నారు కమ్యూనిస్టులు. కలి యుగ నరకమేర్పడుతోందన్నారు, తక్కినవారు. ఆ రెండూ సిద్ధించలేదు. పైగా ప్రపంచంలో ప్రతిదేశమూ, ఏదో పేర కమ్యూనిజం విధానాన్ని గట్టిగా అవలంభిస్తోనే వున్నాయి. ఏ స్వేచ్ఛ వుండదని కమ్యూనిజంని వెక్కిరించారో, ఆ స్వేచ్ఛ తక్కిన దేశాల్లోనూ అంతరించింది. పేరుకి మాట స్వేచ్ఛేగాని, చాతలో స్వేచ్ఛ ఎక్కడవుంది? ప్రజలు తమ స్వేచ్ఛని ప్రభుత్వాల చేతులకి వప్ప చెపుతున్నారు, చాలా తొరతొరగా.

పూర్వం అధికారం రాజుల చేతుల్లోవుంటె. భరించలేక, తమచేతుల్లోకి తీసుకున్నారు ప్రజలు. ఇప్పుడు తమకి పరిపాలన చాతకాదని తెలుసుకుని తిరిగి ఎవరోవాకర్ని పరిపాలన తీసుకుని, తమకితిండీ, సుఖమూ ఇస్తేచాలు నంటున్నారు. ఈ స్వేచ్ఛా గీచ్ఛా ఇవన్నీ పొట్టనింపవనీ, అవి కావాలంటే, నిరంతరం త్యాగాన్ని కోరుతాయనీ తెలిసింది వారికి.

అయినా, వూరికే మాటలేకాని, అసలు స్వేచ్ఛ కావలసిన మనుషు లెందరున్నారు? తిండీ సుఖమూ, కులాసా వుంటేచాలు, అంతకన్న ఎవరూ ఏమీ అడగరు. ఎగబాకుళ్ళు ఎక్కడా వుండనే వున్నాయి.

కమ్యూనిజంలో ఆస్తి దాచుకుని పిల్లలకి ఇవ్వక పోవడం గొప్ప విషయం. కాని ఆస్తినేకాదు పిల్లల్ని ప్రభు

త్స్వఫు చేతులకి వప్పచెపుతున్నారు... అంటే పిల్లలీన్న వారి స్వేచ్ఛనీ కమ్యూనిజం దేవుణ్ణి నిరాకరించడానికి కారణం కనపడదు. మానవుడు చేసే పనులకి ఎన్న డభ్యంతరమైనాడు దేవుడు? వాళ్ళు నీతినీ ధర్మాన్నీకూడా విడనాడవలసిన పని లేదు. ఎందుకంటే దేవుడూ, నీతీ, ధర్మమూ, ముఖ్యం అనే దేశాల్లోమాత్రం ఎంతమాత్రం వున్నాయి అవి? రోజూ గుళ్ళకివెళ్ళి, భజనలు చేసేవారిలోమాత్రం ఎంతవర కున్నారు దేవుడూ, ధర్మం? 'మా కవి లేవు' అనే కమ్యూనిస్టులే ఎక్కువ సూనృతులుకారా?

ఈనాడు కమ్యూనిజం, కాపిటలిజం అనేవి వుత్త పేర్లు, విరోధాలకి ఆధారంగా. కాని అసలు సంగతి ఈ వైషమ్యాలకి కారణం, అతిలోభం Avarice అధికార వాంఛ.

కమ్యూనిజంలోకూడా అధికార్లూ — కమ్యూనిజం కావాలని రాసే కవులూ. కథకులూ మంచి ధనవంతులు— భోగలాలసులు. తక్కిన దేశాల భాగ్యవంతులు, బీదలకీ, సంస్థలకీ విరాళాలిస్తారుగాని, ఈ కమ్యూనిస్టు భాగ్యవంతులు ఎవరూ ఎవరికీ ఒక్క దమ్మిడీ ఇవ్వరు. వాళ్ళ హృదయాల్లో కరుణ అనేది ఎన్నడో చచ్చింది. "ప్రజల కష్టాలు ప్రభుత్వం చూడవలిసిందే; అది మా బాధ్యత కాదం''టారు. ఈ దేశంలో కమ్యూనిజం తక్కిన పార్టీలమల్లేనే అదీ ఒక పార్టీ అయింది. అంతకన్న విశేషంగా చెప్పుకోతగినదేమీ లేదు ఈనాడు ఏదోవిధంగా రచయితలూ, అధికారులూ ఎవరికి దొరికింది వారు దోచుకు దాచుకుంటున్నారు రాజ

కీయాల్లోనూ, సినిమాల్లోనూ, రచనల్లోనూ, పైకి పాకడానికి కమ్యూనిజం ఒక నిచ్చెన అయింది.

ఒకరు దేవుడిపేర వంచిస్తే రెండోవారు మానవుడిపేర వంచిస్తున్నారు.

ఇంకమీరు 'కర్మ' అంటున్నారే! ఆ కర్మనూతం ఎవరికడ్డం వొచ్చింది ? తనకర్మ అని తన బాధల్ని పోగొట్టుకోడానికి ప్రయత్నించకండా ఎవరూ వూరుకోరు. తన బాధ్యతని వొదులుకోడానికే ఆ 'కర్మ' అసలు ఈ తగాదా అంతా, ఈశ్వరుడంటే, కర్మ అంటే ఆ పదాలకి అసలు అర్థమేమిటో తెలీక పోవడంవల్లనే కలుగుతోంది.

ఈనాడు రాయిస్టుకానీండి. ఇంకే యిస్టు కానీండి— దానివల్లకొన్ని లాభాలు కలుగుతాయనీ, పదవులూ, డబ్బూ, పరివారమూ లభిస్తాయని నమ్మకపోతే, ఏఇజమూ ఎవరికీ అఖ్ఖర్లేదు. అందుకే రాయిజం ఎక్కువ ప్రచారంలోకి రాలేకపోయింది.

ఈశ్వరాశీర్వాదాలతో

—చలం

# 142

శ్రీరమణస్థాన్

8—9—62.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం. ఈ పూజలూ అవీ ఎవరి స్వభావానికి తగినట్టు వారు ఈశ్వరుణ్ణి పూజ చెయ్యడానికి ఏర్పరిచినవి.

వర్ణ విభాగాలుకూడా ఆనాటి సంఘుస్థితికి అనుకూలంగా ఏర్పరిచినవి. కాల పరిస్థితులు మారడంవల్ల అవి ఇట్లా వికృతంగా విషమించాయి. ఈనాడు అగ్రజాతి నైష మ్యంతో, నాళ్ళు ఉద్యోగాలూ అధికారాలూ కొట్టేశారనే ఈర్ష్యతో, ఇట్లాంటి అపోహలు కావలిసి కడుపుమంటకొద్దీ కల్పించి రాస్తున్నారు.

ప్రతిపురాణంలోనూ, దేవుడి అవతారాన్ని అనేక లోపాలతో కూడిన మానవుడిగానూ చిత్రించారు, దేవుడు మానవుడిలోనే వున్నాడని చెప్పడానికి. వెంటనే, పక్కన ఇవేమీ అంటని, అతీతుడైన నిర్గుణుడనికూడా రాశారు.

ఈ మాయ వ్యక్తిత్వం అదృశ్యమైనాక, మిగిలేది ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 143

శ్రీరమణస్థాన్
24—9—62.

జగ్గూభాయ్,

గురజాడ అప్పారావుగారి సంగతా — అన్నిటికన్న ఆయనచేసిన మహాత్కార్యం చచ్చిపోవడం. అందులో ఆయస్సునిండకుండా చచ్చిపోవడం. ఆయన అభిప్రాయాల్ని పట్టిచూడగా, ఇంకా బతికివుంటే, ఆనాటివాళ్ళకేకాక,

ఈనాటి వాళ్ళకికూడా కంటకమయ్యే విషయాలు రాసేవాడు అనిపిస్తుంది. అసలు ఈ ఉత్సవాల రహస్యం- బెంగాలివాళ్ళు టాగూరుగారికి ఉత్సవాలు జరపడం, పోగా అప్పారావుగారు దొరికారు ఆంధ్రులకి.

తెలుగు రచనల్లో ఆనాడు ఎవరూ సాహసించని పనుల్ని చేశారు. ఆయన. అదీ ఆయనలో విశేషం. ఆయన తిరగబాటంతా ఆయన ఆలోచనల్లోనూ, రాతల్లోనే కాని, జీవితంలో ఏమీ కనపడదు ఆయనహృదయం విశాలమైనది. ఆయన ఆనాటి సమాజానికన్న రచనా ఇరుకు పద్ధతులకన్న దూరదృష్టితో చూశారు. భాషాభావాల్ని ఇరుకునపెట్టే సంకెళ్ళని ఒక్కదెబ్బతో ముక్కలు చేశారు.

ఈనాడు ఆయనపైన రాసిన ఈ మహారథులు ఎందుకు అంత చప్పగా రాస్తున్నారంటే, రాయడానికీ ఏం లేదుగనక. ఆయన జీవితంలో వీరు మెచ్చుకోతగ్గ విశేషాలు ఏమీలేవు. ఆయన రచనలకి సారస్వతరీత్యా ఏ విలువాలేదు. 'దేశమంటే మనుషులోయ్' అని ఆయన చెప్పాల్సి వొచ్చింది. ఎవడన్నా దేశాన్ని మట్టి అనుకుంటున్నారా? దాంటో కవిత్వంగాని, లోతైన కొత్తదైన ఆలోచనవుందా? ఆయన కవిత్వమంతా అంతే.

ఇంక ఆ నాటకం తెలుగు మనుషుల Good Photography దాంటో ఎంత పిండినా ఒక్కరవ్వ రసం లేదు. గౌరవనీయమైనవాటిని, పానుగంటి ఆయనమల్లే, తేలిక చెయ్యడంతప్ప; ఒక అందంలేదు, లోతులేదు,

గౌరవంలేదు. ఒక రంగానికీ ఇంకో రంగానికీ సంబంధంలేదు. అడివితీగమల్లే నేలమీద పరుచుకొంటుంది. ఇష్టమొచ్చిన దిక్కల్లా ఏ ఫలపుష్పాలులేని తీగల్ని చాచుకుంటో.

తమ పేర్లుకూడా అప్పారావుగారిమీద రాసినట్టు, పడాలని రాశారేకాని, నిజంగా పట్టలేదు వీరికి అప్పారావు గారు.

'ఊరంతా ఒకత్రైతే, ఉలిపికట్టె ఒక దిక్కు' అనేది మా అమ్మ నన్ను.

ఇంతేనేమో నేను.

అప్పారావుగారి రచనలంటే నా 15 ఏటనించి ఇష్టం నాకు. కాని వాటకి విలవ అంతే నా దృష్టిలో.

ఇవాళ మళ్ళీ మీ ఉత్తరం. అసదుల్లాఖాన్ అనే పేరు విన్నట్టే గుర్తు.

అతను అట్లారాస్తే రేడియోలల్లో వింటారు. కాని ఈనాడు చలం అదేరాస్తే, రేడియో గడప తొక్కనీరు.

ఈశ్వరాశీర్వాదాలతో
— చ లం

# 144

శ్రీరమణస్థాన్
20—10—62.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం.

ఈవేదాంత విషయాలు తెలుసుకోవడంవల్ల ఏ ప్రయోజనమూ లేదని రాశాను. అయినా అడుగుతున్నారు. పైగా వేదాంతమంటే తలనొప్పి. కాని నాగురువుమీద వుండే నాభక్తి నన్ను ఆయన వేదాంతంలోకి తొంగిచూడ పెట్టింది. అదిగాక నా సందేహాలు తీర్చుకోడానికి నేను ఈశ్వడితో వాదించేప్పుడు ఈ వేదాంతం కొంత దొర్లక తప్పిందికాదు.

నాకా వేదాంతం తెలిసింది చాలాతక్కువ. పూర్తిగా సత్య దర్శనమైన వారికే అర్థమాతాయి మీరువేసే ప్రశ్నలకి జవాబులు. శంకరాచార్యులు భగవాన్ మొదలైనవారికితప్ప వాటి సంగతి అసలు సత్యంతెలీదు. తక్కినవారూ రాశారు వేదాంత గ్రంథాలు. వారురాసేవి వారికే అర్థంకాదు చిలక పలుకులు.

ఎప్పుడన్నా ఏ అవసరంవల్లనో సౌరీస్‌తో ఏదన్నా వేదాంతం ముక్క మాట్లాడినప్పుడల్లా నాకు తెలుస్తో వుంటుంది, నాకు తెలిసినదాంటో ఎన్నో తప్పులున్నాయని. ఎందుకంటే ఇది మనసుతో గ్రహించే విషయంకాదు, హృదయంతో అనుభవించేది.

శ్రీ దక్షిణామూర్తి మునులకి మౌనంతో ఇచ్చాడు ఈ అంతిమజ్ఞానాన్ని అంటే ఆ జ్ఞానాన్ని మనసుతో తెలుసుకోలేము. మాటతో పలకలేము. అంటే-అది తెలియ చెప్పడానికి మాటలులేవు. అవాంగ్మానస గోచరమైనదాన్ని మాటలతో వివరించాలని చూడడమూ, పుస్తకాలు రాయడమూ వృత్త పనికిమాలినపని. ఆ వేదాంతం వృత్తగర్వమే గాని, ఒకరికీ నిజమైన అనుభవాన్ని ఇవ్వలేదు. వంట చేసు

కుని తినకుండా, మాలతీ చందూర్ వంటపుస్తకాన్ని చదువు కుంటూ కడుపులు నిండాయని చంకలు కొట్టుకున్నట్టయింది చాలామంది బతుకు-చాతనైన వాళ్ళకి ఏ వంటపుస్తకాలూ అనవసరం.

ఇప్పుడు నేను రాసే సంగతులు నేను అనుభవించి తెలుసుకున్నవి కావు. నేను రాస్తే మీకంతకన్నా అర్థం కావు. అన్నీ సందేహాలే అవుతాయి. కాని ఏం చెయ్యను? మీరడిగారు.

అసలు అంతిమ సత్యమేమిటంటే — ఉన్నది ఒకటే. ఇంకేం లేదు. బంగారం నగలుగా కాలేదు ఉన్నది బంగారమే. మరి ఇదంతా కనపడుతోంది. ఎవరికి? జగ్గారావుకి. జగ్గారావు లేడు. అతను అబద్ధం. ఈనాడు పుట్టి, రేపు పోయే జగ్గారావు సత్యమా? అబద్ధమైన జగ్గారావు ఉందనుకుంటే ఇదంతా అబద్ధమే. కనక ఏదీలేదు.

మీ కలలో కనబడే జగ్గారావు ఎవరు? అతనిలో ఏమాత్రం సత్యంవుంది? కలగనే జగ్గారావుకీ అంతమాత్రమే సత్యంవుంది. అతను లేడు, ఎవరూ లేరు, ఏదీలేదు. ఉన్నట్టు ఎందుకు కనపడుతోంది? అది భ్రాంతి ఎవరికా భ్రాంతి? ఆ భ్రాంతీ అబద్ధమే. అబద్ధపు జగ్గారావు నిజమనుకునే అబద్ధం ఈ లోకం. ఈ సత్యంలోంచి మీ ప్రశ్నల్ని చూడండి.

మీ ప్రశ్నలకి జవాబులు :—

(1) మానవుడు లేడు అసలు మొందు. కనక అతను ఈశ్వరుడు కావడమూ లేదు. సంబంధమూ లేదు. భేదమూ లేదు.

(2) మనసు నాశనమా? మనసూ లేదు. నాశనమూ లేదు.

(3) మనసులేదు. ఆత్మ లేదు.

(4) ప్రాణులు లేరు – సుఖదుఃఖాలు లేవు.

(5) ప్రారబ్ధంలేదు. అనుభవంలేదు అనుభవించే వాడు లేడు.

(6) ఈశ్వరుడు లేడు. సృష్టిలేదు.

ఉన్నది ఒక్కటే అది నిర్గుణం. నామరహితం కనక, దానో్న, ఆయనో్న, ఈశ్వరుడని పేరుపెట్టడానికి మనకి అధికారంలేదు.

(7) జీవితాత్మ లేదు. పరమాత్మ లేదు.

మరి ఉన్నాయే! అంటారా!

ఉన్నాయి అనేదెవరు? జగ్గారావు – జగ్గారావులేడు.

మరి ఉన్నాడే!

ఉన్నాడని తెలుసుకునేదెవరు?

జగ్గారావు - జగ్గారావులేడు. అబద్ధం. కనక అతను అనుకొంటున్నాననుకునేవన్నీ అబద్ధం.

నా 'సుధ' - కావ్యం–వేదాంత గ్రంథంకాదు. అది సుఖదుఃఖాలతో. వేదనా ఆనందాశ్రువులతో కూడిన జీవిత సారం.

ఏమీ లేదని తెలుసుకోడానికే, ఈ సాధన అంతా. ఎందుకు ఏమీ లేదని తెలుసుకోడం? ఎందుకు? అనుకుంటే తెలుసుకో కు. నిన్నెవరూ బలవంతం చెయ్యటంలేదు.

ఆనందం- తేజం-సత్యం- ఇవన్నీ అబద్ధాలే. వాటిని అందుకున్నాననుకునే వాడు, అందుకుంటానని ఆశించేవాడు అబద్ధం కనక.

కాని ఈ ఆధ్యాత్మిక సాధనవల్ల మిగిలేది. తెలుసు కునేది లేక అనుభవించేది-? అంటే అదిమాటలతో చెప్ప డానికి వీలులేనిది. సాధన చేసి అందుకుని అనుభవించండి.

అందుకనే బుద్ధుడు ఈశ్వరుడి సంగతి మాట్లాడ లేదు. భగవాన్ మాట్లాడలేదు. శంకరాచార్యులు 'నేతినేతి' అన్నారు.

కాని వీరిలో ప్రతివారూ లేని మానవులకోసం కరు ణతో వారి సందేహాలని తీర్చడానికి బోధించారు, ఈశ్వరుడి స్తుతులు రాసిఇచ్చారు చదువుకోమని.

కాని వారులేరు, భక్తులూ లేరు, స్తోత్రాలూ లేవు.

కాని జగ్గా,

నువ్వు 'వున్నాను' అనుకున్నన్నాళ్లు, వీళ్ళందరూ ఉన్నారు, నువ్వూ ఉన్నావు, చలం ఉన్నాడు, ఉత్తరా లున్నాయి, పోష్టువుంది, కృష్ణా పత్రికవుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 145

శ్రీరమణస్థాన్

26—10—62.

జగ్గా భాయ్,

మీ ఉత్తరమంతా చదివి మళ్ళీ రాస్తున్నాను. చలం సంగతి మీరు రాసినదాంతో ఏకీభవిస్తున్నాను.

ఇంక స్త్రీ ప్రేమ సంగతి — ఒక్కొక్క స్త్రీ ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకున్నా, ఎందర్ని కామించినా, ఎవర్నీ ప్రేమించలేదు. ప్రేమ అనేది ఆమెలో లేదు. ఒకామె అంత గొప్ప సిన్సియర్ — ఒకే కాలమందుగాని, ఒకరితరవాత ఒకర్నిగాని గాఢంగా ప్రేమించగలదు. ఎన్నిరకాలో ఈ ప్రేమ మోహావ్యవహారాలలో! ఈ ప్రేమని వర్ణించడంలో ఈశ్వరుడికి కెక్కడా విరామంలేదు. ఆ ప్రేమని అనేక రీతులు వుపయోగించుకుంటారు మానవులు.

ఈశ్వరాశీర్వాదాలతో
—చలం

# 146

శ్రీరమణస్థాన్
12—11—62.

జగ్గూభాయ్,

మీ మూడుకవర్లూ ఒకరోజే అందాయి.

మీరు వేసిన ప్రశ్నలన్నిటికీ నాముందటి ఉత్తరంలో జవాబులున్నాయి రాసిందే మళ్ళీ రాస్తాను మీ తృప్తి కోసం.

1. ఈ సందేహాలు తీరనివి. ఎందుకంటే సందేహాలు మనోజనితాలు. సత్యం మానసాతీతం.

2. వీటిని తెలుసుకోడంవల్ల ఏ ప్రయోజనమూ లేదు.

3. నేను శంకరాచార్యుల్ని ఏమాత్రం, ఏ మూలా చదవలేదు. నాకన్న మీరే ఎక్కువ చదివారు. కనక నేను రాసే జవాబులకి, మీకు నామీదవుండే గౌరవంతప్ప, అంతకన్న విలవలేదు.

1. ఆ స్వల్పకాలంలో శంకరాచార్యులు అంత ఎట్లా రాశాడా? భగవాన్‌కి అన్ని భాషలు ఎట్లా వొచ్చాయి? వాటిల్లో కవిత్వం ఎట్లా చెప్పగలిగారు? అట్లాంటి మహాత్ము లకి అసాధ్యమయింది ఏదీవుండదు.

పోనీ, ఎవరు రాస్తేనేం? ఆ రాసిన గ్రంథాల విలవ కదా మనకి కావలసింది!

2. శంకరాచార్యులు చెప్పింది తెలుసుకోడానికి మన మేధస్సులు చాలవు.

3 ఆయన్ని పూర్తిగా ఆయనరాసిన భాషలో అర్థం చేసుకున్నవారే, ఆయన్ని విమర్శించగలరు ఆయన చూపిన అప్రతిహతమైన రీజనింగ్ని ఎదుర్కొన గలవారులేరు.

4. శంకరాచార్యులని తంతేనా? బలంవుంటే ఎదుటి వాణ్ణి, తన్నేవాడు. లేదా తన్నులు తినేవాడు, అంతామాయ అనేవాడు. కోర్టుకు వెళ్ళినా అదీ మాయే

5 మీరు రెండు ప్లేన్సుని కన్‌ఫ్యూజ్ చేస్తున్నారు. మాయ అంటే అంతామాయే. నిజమంటే అంతానిజం "శంక రుడు లేడు, గనక ఆయన చెప్పలేదు ఏమీ. చెప్పలేదు గనక చెప్పింది అబద్ధం." ఒకటి అబద్ధమంటే, తక్కింది నిజమన్న మాట. తక్కిందీ నిజమని వొప్పుకోడుగా శంకరుడు!

6. అవును ఏదీలేదు. యత్నమూ లేదు. అభివృద్ధీలేదు. కాని మనం దాన్ని నమ్మటంలేదే! కాయితంమీదరాయడమే గాని, అది నమ్మినట్లు ప్రవర్తించమే అట్లాంటప్పుడు అన్నీ వున్నాయి.

శంకరాచార్యుల్ని చదివి, ప్రజలుపడే అపోహ అది తమకష్టాలు నిజం. ఇతరుల కష్టాలు మాయ.

అవును. మీరన్నట్లు, జీవితానికే అర్థంలేదు. కాని అర్థంలేనట్టు, ప్రవర్తించముగా!

7. "నేను మాత్రం అబద్ధంకాదు" అంటున్నారే! ఆ 'నేను' ఎవరు? జగ్గారావా? మీ వాళ్ళు సత్యనారాయణ అని పేరుపెడితే మీరు జగ్గారావు కాదుగా! మరిఎవరు ఆ నేను! శరీరంకాదు. మనసుకాదు. మరిఎవరు? నిద్రపోయేప్పుడు మీరు ఎవరు? ఆ 'నేను' ఏమయింది?

అదే మిమ్మల్ని కనుక్కోమంటున్నారు భగవాన్ 'నేను శాశ్వితుడను'- ఆ నేను ఎవరు?

ఆ నేను ఎవరో తెలిస్తే శంకరాచార్యులు ఎంత నిజమో తెలుస్తుంది

శంకరుడు ఈనాడు లేరు. కాని భగవాన్‌ని నేను చూశాను ఆయన ప్రత్యక్షంగా శంకరుడి వేదాంతానికి సాక్ష్యమై నిలిచారు.

8. 'మన పూర్వులు - జన్మల సంగతి'—అని రాస్తు న్నారు. మన పూర్వులూ అబద్ధమే.

9. 'నేను సృష్టింపబడ్డాను'-ఆ సృష్టింపబడింది ఎవరు ? సృష్టిపొందింది నాశనమూ అవుతోంది. ఇంక దాంటో సత్యమేముంది ?

10. అవును. పాపమూ లేదు. పుణ్యమూ లేదు. బాధా లేదు. పడేవాడూ లేడు. బాధవుందంటూరా, దాన్ని కల్పించే పాపమూవుంది.

11. 'నా అనుభవం సత్యం'—ఎవరు ఆ 'నా ?' ఆ 'నా,' ఆ 'నేను' ఎవరని నన్ను ప్రశ్నించకండి. నాకు తెలీదు. ఏనాడో ఎవరికి వారలు తెలుసుకోవలిసిందే. ఎవరు తెలుసుకోవలిసింది ? ఆ ఎవరు ఎవరో తెలుసుకోవాలి.

ఇన్ని మాటలెందుకు, మనసుతో యోచించి నన్నాళ్ళూ, మీరు రాసిన 24 పేజీల సందేహాలేకాదు, 240 పేజీలు రాయవొచ్చు. నా 'మ్యూజింగ్స్'నిండా ఈ సందేహాలే.

మాట్లాడకండా కూచుని, ఆ 'నేను' ఎవరో తెలుసుకొనే సాధన చెయ్యండి

ఈశ్వరాశీర్వాదాలతో
- చలం

# 147

శ్రీరమణస్థాన్.
22 – 11 – 62.

జగ్గూభాయ్,

సరిగా ఈ వారమే ఉత్తరాల్లో మీతల్లిగారి ఆసన్న మరణం సంగతి అచ్చయింది.

మనపైని నిర్వ్యాజ్యమైన ప్రేమగల వారుపోతే అది పెద్ద లోపమే.

ఇవాళమళ్ళీ మీ ఉత్తరం.

అవును అజంతా ఎల్లోరాచిత్రాలు చాలా గొప్పవే నంటారు. కాని "జన్మధన్యమయింది. వెయ్యేళ్ళు చూసినా తనివి తీరదు" ఇట్లాంటి మాటలంటూనే అరగంటలో, బావ కూతురు సమర్తాడిందనీ, పిల్లవాడి పరీక్షలనీ, రైలెక్కుతారు.

మీవూళ్లో ఏటికవతల కుంకే సూర్యుడు రాసే పటాల కన్న గొప్పవంటారా, అజంతా చిత్రాలు?

మీ అమ్మ ఏమయిందో ఎవరికి తెలుసు? "ఈ లోకం సంగతులు తెలుసుకోడానికి సాధ్యమాతున్నది" అని రాస్తున్నారు. ఏం సాధ్యమాతుంది? నేను రాస్తున్న ఈ వంకర గీతలు ఓ అర్థాన్ని జ్ఞానాన్ని మీకు ఎట్లా తెలుపు తున్నాయో మీ కేమన్నా తెలుస్తోందా? వేపగింజలోంచి వేపచెట్టు ఎట్లా వొస్తోంది?

మనకి హృదయంవుండి లోకాన్ని ప్రేమించినకొద్దీ, మనకి లోకాన్ని విడవాలని వుండదు. లోకంలో మనంలేము. లోకం మనలో వున్నదనే దివ్యదర్శనమయిందాకా. అటు వంటి దివ్యదర్శనమైన ధృతరాష్ట్రుడూ, అర్జునుడూ పుత్రుల కోసం ఏడవనే ఏడ్చారు.

మిత్రులు చచ్చిపోతే ఏడవనివాడు వేదాంతికాడు, వుత్త కొండశిల.

మీ అమ్మగారు చచ్చిపోయారని చదవగానే అను కున్నాను. "నా కెవరి లక్ష్యమూ లేదనే జగ్గారావుగారు కర్మ చేస్తారా ?" అని.

మీరు వేసిన ప్రశ్న కొందరు సౌందర్యానికి ... పలకరేమని ?

జవాబు నాకు తెలీదు.

నాళ్ళ 'ఖర్మ' అనడం తప్పు.

ఇక్కడ మబ్బులు - చలి - చికాకు - చీకటి—

మీ తలనెప్పి తగ్గిందా ?

ఆ వైద్యగ్రంథంలో చెప్పినవన్నీ తింటున్నాను— దొరికినంతవరకు — చెప్పని మామూలు భోజనమూ చేస్తు న్నాను.

ఆంధ్రప్రభలో రాసిన రాజుగారు మా మిత్రుడు రాజుగారు అనుకుంటున్నాము. ఆయన ఈ మధ్యనే మాతో మూడు నెలలువుండి వెళ్లారు.

ఎవరో 'శ్రీరమణస్థాన్' గురించి రాశారని నాకు వొచ్చే ఉత్తరాలవల్ల తెలిసింది.

మిత్రత్వాన్ని గురించి రాశాను 'మ్యూజింగ్స్' 'ప్రేమలేఖలు' వెతకండి.

నా మనసు ఎట్లా పనిచేస్తుందో చూసే తీరిక లేక పోయింది నాకు జీవితంలో. బాగా బిజీగా వుండేవాడిని. అట్లా చీల్చిచూడడం ఏమంత ఆరోగ్యంగా కనబడలేదు. చూడగానే మీ బాధలో మీ మనోతత్వంమల్లేనే వుంటుం దనుకుంటాను నా మనసుకూడా.

అవును. రంగూన్ భాస్కరరావుగారి సంగతివిన్నాను. చిరునామా తెలీదు. ఈ దేశం వొస్తారనీ, నన్ను కలుసు కుంటారనీ బర్మానించి రాశారు భూలోకంగారు.

ఈశ్వరుడు మీ శరీరానికి తద్వారా మీ ఆత్మకి చాలా హెచ్చరికల్ని ఇస్తున్నారు.

మారండి. శక్తిలేదా ఇక్కడ ఈశ్వరుణ్ణి శరణు జొచ్చండి.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 148

శ్రీరమణస్థాన్
8—2—63.

జగ్గూభాయ్,

మీ ఉత్తరం శ్రద్ధగా చదివాను మీ సాధన Plan బావుంది. ఈశ్వరుడుకూడా బావుందన్నారు. కానీండి

విశ్వాసంతో వుండమన్నారు ఈశ్వరుడు మిమ్మల్ని సాధనకి ప్రాణం గురువులో విశ్వాసం.

నేను సీతానగరానికి రాసిన కార్డులుమీకు అందాయా?

ఈశ్వరుడు రాయమంటున్నా మరిచిపోయాను, రాజులు చిక్కుడుకాయలు కాసింది గింజలుచాలారుచిగా ఉన్నాయి. అడుగుము - ఈశ్వరరాజ్యం కోసం వెతుకుము—అన్నా అదే తట్టుము—ఈశ్వరరాజ్య ద్వారాన్ని

ఇదంతా భగవాన్ చెప్పేదే. నువ్వెవరో వెతుకు– అన్నది. వెతుకువారు ఎవరు? నువ్వే - నువ్వెవరా—అదే తెలుసుకో.

ఈశ్వరాశీర్వాదాలతో.
— చలం

# 149

శ్రీరమణస్థాన్
1 – 3 – 63.

జగ్గూభాయ్,

కృష్ణాపత్రికలో ఉత్తరాలు చదివి ఇవాళ ఒకాయన రాస్తున్నాడు. ఆ మధ్య ఆయనకి పిచ్చెక్కిందేమోనని భయపడ్డాను.

"జీవితంపైని నిరాశ, విరక్తి, కల్గిన నాకు అవి మీకు సన్నిహితుడను చేసినవి

ఆ ఉత్తరాలే నా జీవితానికి శాంతిని చేకూర్చాయి.

'మహాస్థాన్'లో ఈశ్వర పరిచయం, జగ్గారావుగారికి వ్రాసిన ఉత్తరాల్లో ఈశ్వరం సన్నిహితం" అని రాశారు.

ఆ ఉత్తరాల ప్రకటనకై మీరు పడ్డ శ్రమ ఎంత గొప్పగా ఫలించిందో!

ఒక ఆత్మని కాపాడింది.

మీరు చేసిన త్యాగం ఈశ్వరార్పణమై, ఈశ్వరుడు కనికరించి మిమ్మల్ని త్వరలో యోగసాధనలోకి దింపుతారని వాంఛిస్తున్నాను.

మీరు చేసినది గొప్ప త్యాగసాధన.

ఈశ్వరాశీర్వాదాలతో

— చ ల ం

# 150

శ్రీరమణస్థాన్
2౦—3—63.

జగ్గాంభాయ్,

చందమామ పాటలు చాలా ఉన్నట్టున్నాయి, ఏ ప్రదేశాని కా ప్రదేశానివి. నేను కొన్ని చదివాను. కొన్ని చరణాలు గొప్పగా ఉంటాయి. పాటలోవున్న రంజు చదివితే రాదు. ఆ పొలాలులోనే పాడాలి అవి. బస్తీలలో, చదువుకున్నవారి నోట పలకవు అవి.

కోయిలలు మామిడి చిగుళ్ళు తింటోవుండగా చూశారా మీరు! అది కవులు కల్పించిన అందమైన బూటకమేమోనని నా అనుమానం. ఈ మధ్యనే దెబ్బతిన్న కోయిలని పెంచాము, ఆమె రెక్కలకి బలం వొచ్చిందాకా. ఒక్క మామిడి చిగురూ తినలేదు. పురుగులు తింది.

మీరా కొండల్ని వర్ణిస్తోవుంటే, నా ప్రాణం మీ కలంవెంట ఆ కొండల్లో, అడవుల్లో, ఏళ్ళవెంట తిరిగింది అంతసేపూ—అంతబాగా కళ్ళకి కట్టినట్టు, మనసుని కట్టినట్టు వర్ణించారు

మీ ఉత్తరాలు అచ్చువేసుకోడానికి ఏడుపు పత్రికలకి. జగ్గారావు, ఎవరికాళ్ళు పట్టుకునీ, లంచాలుపెట్టీ పేరు సంపాయించుకోలేదు గనక.

నా పుస్తకాలు ప్రచురించమని ఎవరినీ నేను అడగలేదు, అడగబోను. నా టాగూరు తర్జుమాలు ఓ పత్రికలో అచ్చుకావడానికి పంపవలసిన ఖర్మమేమిటి నాకు ?

చలం గీతాలు అంటే 'భగవాన్ పాదాలముందు'— ఇప్పుడు కొత్తగా గొప్ప ఎడిషన్ తీసుకొచ్చారు.

ఆ 'మ్యూజింగ్సు'మీద • రాసినవారు ఆ పబ్లిషర్లు. అంటే చలం రాసింది చదివి చలించకుండా నిలవలేరు అని.

ఈశ్వరాశీర్వాదాలతో
— చలం

# 151

శ్రీరమణస్థాన్
27—3—63.

జగ్గూభాయ్,

మీ సందేహాలు తీర్చడానికేం ? కాని పోస్టుఖర్చు భరించలేము.

1. బుద్ధుడికథ—అవును. "ఆమెబాధకి ప్రేమ, అనురాగం. మమకారం, కాంక్ష" అన్నీ కారణమే. అవును. లోకంనించి కళ్ళని కాకపోయినా మనసుని తిప్పుకోవాలి. అవును. అదిసాధ్యమే. కాని బుద్ధుడు, జీసస్, భగవాన్ వారి బోధవల్ల అది సాధ్యమవుతుంది. బుద్ధుడు చేసిన బోధేచలం చేస్తే ఎవరిబాధాపోదు. కాని ఆమాటలే ఆ మహాత్ములు మాట్లాడితే, బాధపోతుంది.

2) పాప; పుణ్యాలసంగతి— వేదాంతులు మాట్లాడా రే, దాంట్లో కొంత సత్యమేవుంది. ఒకటేసంగతి — వేదాంతులకి ఏమీ తెలీదు. తెలిసినట్లు వాగుతారు.

3) "మానవుడు ఎప్పుడూ విముక్తుడే" అని రాశా రే, ఆసిద్ధాన్తం— అక్షరాలా నిజం

కాని ఈ సిద్ధాన్తాలు సిద్ధాన్తాలే. వాటివల్ల, మనం విముక్తులం అనుకోడంవల్ల మనకి వొరిగేదేమీ లేదు.

పలగరకి, బెజవాడకీ, •సీతానగరానికి నా ఉత్తరాలు పరిగెత్తుతో నేవున్నాయి ఇవాళనానించి ఉత్తరాలు లేవని మీ నించి ఉత్తరం.

మన అనుభవానికి మీరిన సంగతులిన్ని మనం వొప్పుకోకపోవడం పొరపాటు. ముఖ్యంగ్రా మన సత్వం విషయంలో కాని మన అనుభవాన్ని అటుంచి కథలో 'ఛా, ఇది అసంభవం' అనిపిస్తే చదువరికి, అది రచనలోలోటు. మామూలు తెలుగువాళ్ళు అసంభవమనుకొనేవి సంభవమనిపించేట్టు రచించడం, చలం ప్రత్యేకత. ఈశ్వర ప్రేమలో అందరం సుఖం.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం

# 152

శ్రీరమణస్థాన్
4—11—64·

జగన్నాథాయ్,

మీ ఉత్తరం. వజీర్ రహమాన్‌గారి పుస్తకంపై మీరు రాసిన పంక్తులు మీ ఉత్తరంలోంచి కత్తిరించి ఆయనకి

పంపాను. ఆయన మద్రాసులో ఉద్యోగంలో ఉంటు న్నారు.

మీ చిన్నికృష్ణతోనూ, పొలాలలోనూ మీ కాలాన్ని గడపడం, ఎంతో సరదాగా, మధురంగా వుంది. అంతకన్న చేసేదేముంది?

భగవద్గీత విషయం మీరు రాసినవన్నీ నిజమే. అదెప్పుడు పుట్టిందో తెలీదు. మధ్యావస్థ చేర్పులూ అవీ పండితులూ విమర్శకులూ, దానికాలమూ నిర్ణయించాలి. నిర్ణయించచూసినట్టున్నారు. కాని, వారికిమాత్రం ఏమి తెలివి వుంది, దాన్ని నిర్ణయించడానికి.

కాని, భగవద్గీత అర్థం ఆలోచిస్తోవుంటే, అది పరమేశ్వర బోధేననిపిస్తుంది. అన్నిసృష్టి రహస్యాలు, పైగా తానే పరమేశ్వరుణ్ణి అనే అధికారం ఇంకోరినించి మనహృదయాల్లో పలకవు.

అవును — భగవద్గీతని ఎవరి నీచత్వానికి వారు ఉపయోగించుకొంటున్నారు.

భగవాన్, శంకరాచార్యులు, శ్రీకృష్ణుడు మొదలైన జ్ఞానులు రాసినవాట్లో, వాటి అర్థం సరేసరి బోధా, మాటలలో చెప్పలేనిదాన్ని మాటలలో చెప్పే సమర్థతా, ఇన్నీ ఉంటాయి. అదికాక ఆ శ్లోకాల శబ్దమే, మంత్రజపమువలే పనిచేస్తుంది ఏ నీచ ఉద్దేశ్యంతో పఠించినాసరే. అందుకనే భగవద్గీత పారాయణం ప్రశస్తమయింది ఆ శబ్దమే మారుస్తుంది మనసుని. ఎక్కడా మార్పు కనపడదే

ఆ మనుషుల్లో అంటే, మరి ఎంత కలుషం వారిలో పేరుకుని వుందో !

ఈ మనుషులు భగవద్గీత ఉచ్చరించేవిధమూ, వంకర అర్థాలు తీసేవిధమూ చూసి, నేను ఇన్నేళ్ళూ అసహ్యించుకున్నాను. భగవద్గీతనేం, ఈశ్వరుణ్ణి ఎట్లా ఉపయోగించు కొంటున్నారు ?

మీరు భగవద్గీతలో అన్యాయమూ, చెత్తా చూస్తున్నారే వాటినిజమైన అర్థం తెలిస్తే, అంత అన్యాయమనరు.

ప్రతిముక్కకీ ఏమి అర్థమో నాకు వివరించి రాయిస్తున్నారు ఈశ్వరుడు. ఇంతవరకూ ఎవరూ సరైన అర్థం రాయలేదు భగవద్గీతకి, తెలిసినవారుకూడా, తెలిసిందంతా కూడా రాయలేదు ఎందుకో ! చలం రాసిన 'శుభవార్తలు' 'భగవద్గీత' ఇదివరకెన్నడూ తెలీని గొప్ప విజ్ఞానాన్నియ్యబోతున్నాయి ఏనాటికో !

భగవద్గీత మెల్లిగా సాగుతోంది. చాలాకష్టం సరైన అర్థంలో తెలుగుచెయ్యడం.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

— చలం



# నా మాట

ఏటికి కొత్తనీరు తగిలి, కొత్తరూపుంతో, కొత్త అందాలతో, వయ్యారాలతో రాణించి ప్రవహించినట్లు, కొత్తదనంతో, అనుభవాలతో, బోధతో, కొత్త అర్థాలతో, నీతులతో, ఈ తెలుగు దేశంలో నిలిచి, రాణించి ప్రకాశించాడు చలం చలం కొత్త. చలం బోధకొత్త ఈ దేశానికి. కొత్తనీటి వరదతో పాతచెత్త కొట్టుకపోయి, రూపుమాసినట్లు, చలం కొత్తబోధతో పాతనీతులూ, ధర్మాలూ తుడుచుకపోయినవి. చలం తన సత్యాన్వేషణతో బూజుపట్టిన పురాతన ధర్మాలు నీతులమీద, ఆచారాలు నడవడులుమీదా, భావాలుమీదా దాడిచేసి, తనముందు నిలువనీకుండా చేసి, కొత్తవి తనే స్థాపించాడు. ఆనాడు ఎన్నో సందేహాలు గలిగి, సత్యంకొరకు తపనబడిన చలం, ఈనాడు ఎన్నో సందేహాలకి సమాధానంగా నిలిచినాడు, సత్యంలోకి ఎదిగి చాలామందికి నేర్పుతున్నాడు, దిద్దుతున్నాడు, మార్గం చూపుతున్నాడు.

చలం చండభాస్కరుడు అన్యాయాల్ని, అసహ్యాల్ని' నీచాల్ని, ముఖ్యంగా హృదయ దరిద్రాల్ని భరించలేక' వాటిని చెడతిట్టి, తిరగబడి వాటిమీద మంటలు కురిపిస్తాడు. ఆ వేడితో హృదయమలినాన్ని కాల్చి శుద్ధిచేయాలని చూస్తాడు ఆ మంటలులోనే ప్రేమతో, దయతో లోకాన్ని కౌగలించుకోవాలని, చల్లదన మివ్వాలని చూస్తాడు. ఆ మాటలతో మూసుకపోయి గట్టిపడిన హృదయాన్ని తెరవాలని, [illegible] [illegible] ప్రవేశపెట్టాలని చూస్తాడు.

తోనే తాను చెప్పిన సత్యాన్ని, తిన్నగా హృదయంలో ప్రవేశ పెట్టాలని, సత్యానికి, సౌందర్యానికి కళ్లు తెరిపించాలని, హృదయ చీకట్లని పారద్రోలాలని చూస్తాడు.

ఆతీవ్ర వాక్కులతోనే, మూర్ఖత్వాన్ని, ఏ ఉపయోగములేని (ఈనాడు ఉపయోగపడని) ఆచారాల్ని, పద్ధతుల్ని నిరర్థకపు వ్యాపారాల్ని, విడనాడమంటాడు. అవి బాధగ ఉండక వాటిని విడనాడి, బాధలులోనుంచి తప్పుకోమంటాడు. ఆ వేడి మాటలుతోనే ఎంతో సంస్కారాన్ని బోధించి, హృదయాల్ని సంస్కరింపచేయ చూస్తాడు. ఆ మాటలు తిన్నగా హృదయంలో ప్రవేశించి, ఎంతో గొప్పగా పలుకుతాయి, కదుపుతాయి.

చలాన్ని చదివి చలించకుండా ఉత్తేజితులవకుండా, ఆలోచించకుండా, మారకుండా వుండలేరు. వివేకమూ, జ్ఞానమూ, హృదయమూ వున్న మనుష్యులు. అర్థం చేసుకుని గుర్తించిన వారు అతితక్కువమందే అవొచ్చు. కాని ఆ అతితక్కువమంది హృదయాల్లో ఎన్నో పుష్పాలుపుష్పించి వుంటాయి. ఆనాడూ, ఈనాడూ కొంతమందికి చలం వెలుగు, గురువు, మార్గదర్శి.

మామూలుగా బతికి ఏమీ ఆలోచించకుండా, మారకుండా వున్నవారికి ఏమీ లేదుగాని, ఆలోచించి చుట్టూ చూసేవారికి జీవితంలో ఎన్నో సందేహాలు. జీవితమే ఓ పెద్ద సందేహం. సమస్య అవుతుంది. ఎన్నో సందేహాలతో కొట్టు కుంటున్న జగ్గారావుకి ఆనాడు చలం పుస్తకాలు తీస్తే, ఈ నాడు చలం తన మాటలతో రాతలతో తీర్చాడు. ఆ సందే

హాలకి సమాధానంగా ఈ ఉత్తరాలు నిలిచాయి. పూర్వపు జగ్గారావుకి ఓ గమనమూ, గమ్యమూ లేదు అందువల్ల అనుభవించడమే తెలుసు అంతా ఉద్రేకపు పొంగు ఆ పొంగు ఎటుపోతే అటుపోవలసిందే. చలం బోధతో చల్లారి, ఓ స్థిమితమూ, స్థిరత్వమూ ఏర్పడ్డాయి. సత్యాన్ని వెదకియు జేస్తాయి పూర్వపు చలానికి ఈశ్వరుడు డౌట్ సంశయమూ అయితే, జగ్గారావుకి లేనే లేదు వుండడానికివీలు లేదు. లోకాన్ని చూస్తే అట్లానే అనిపించేది. నాకే కాదు, కాస్త ఆలోచన, జ్ఞానమూ వున్నవారికి ఎవరికయినా అనిపిస్తుంది. నా సందేహాలు తీర్చటంతో పాటు, ఈశ్వరుడు అంటే ఏమిటో చలం చెప్పగా, అప్పుడు తెలిసింది జగ్గారావుకి, ఈశ్వరుడు అంటేఏమిటో! విశ్వసించి భక్తి చూపేడు. ఈశ్వరుడు గురువుగా అంగీకరించి శిష్యుడయ్యాడు ఆయన ఆజ్ఞలో, అదుపులో, సేవలో ఈనాడు బ్రతుకుతున్నాడు.

చలంగురించి మరొక్కమాట,

ఆనాటి శ్రీ శ్రీ ఆకలితో కేక వేస్తే, చలం మొన్నటి వరకూ కేక లేస్తూనే వున్నాడు, సత్యంకోసం, సత్యమేదో తెలుసుకుందామని. వీళ్ళిద్దరూ ఎంతగట్టిగా కేక లేసారంటే, ఆ కేకలకి భూమికంపించింది. ఆకాశం బద్దలయింది. లోకం జడుసుకుంది. అంత ఆవేశంతో కోపంతో, బాధతో, మదనతో, కేకలేశారు.

శ్రీ శ్రీ ఎప్పుడో చల్లారినాడు కోరికల దేవత ప్రత్యక్షమై, తన ఆశలూ, కోరికలూ తీరుస్తే, చలం ఎంతకీ, మొన్న మొన్నటివరకూ చల్లారలేదు. అతని కాంక్ష పర

లేదు. ఒకంతట సత్యదేవత ప్రత్యక్షమవలేదు. ఎంతో రక్తాన్ని, కన్నీళ్ళని, కాలాన్ని బలితీసుకొని, ఎంతో ప్రార్థించగా, వెదకగా, వెదకగా, కొసకి ప్రత్యక్షమై, సత్యాన్ని తెలియజేసి, చలం వేడితగ్గించి, చల్లార్చింది, ఆ సత్యదేవత.

వీళ్ళదరి కేకల్ని ఏ కొద్దిమందో వినగలిగారు. విన్న వారిలో ఏ కొద్దిమందో మేలుకున్నారు. వీరి కేకలు గుండెల్ని బద్దలుకొడతాయి. భీతిని, భయాన్ని, కంపాన్ని పుట్టిస్తాయి. వాటికి తట్టుకొని, అంగీకరించి, ధైర్యంగా, స్థిరంగా నిల బడ్డవారికే కళ్ళముందు కాంతి.

శ్రీ శ్రీ తమలో కలిసి, తమవాడు అయిన తరవాతనే క్షమించింది లోకం. చలాన్ని అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ క్షమించదు. పైగా క్రోధంతో ద్వేషంతో తిట్టింది. పగపూని మనుష్యులనుంచి, సాహిత్యంనుంచి, దేశం నుంచి బహిష్కరించింది. ఎందుకు? సత్యం చెప్పాడని, ఆ సత్యానికి అనుగుణంగా తాను నడిచాడని, తమనీ అసత్యాలో నిలవమన్నాడని, తమ అసత్యపు బతుకుల్ని వొదిలి, సత్యపు బతుకుల్ని స్వీకరించమన్నాడని, చీకటిలోనుంచి వెలుతురు లోకి రమ్మన్నాడని, ఒంటికి, హృదయానికి పట్టుకున్న మురికిని కడుగుకొని శుభ్రపడమన్నాడని, తమని కదలు మన్నాడని, మారమన్నాడని,మూర్ఖత్వాన్ని, ఏమీ ఇవ్వని, ఏఉపయోగమూ లేని నిరర్థకపు ఆచారాల్ని ఒదులుకోమన్నా డని, బాధలనుంచ తప్పుకోమన్నాడని అంటుకు.

చలం పురుములకు, మెరుపులకు, సామాన్యులైన ఈ మనుష్యులు తట్టుకోలేరు, తాళలేరు ఆత్మదీప్తి, శక్తివున్న వారు తప్ప. అందుకే వీళ్ళకి చలమన్న అంత కోపము, ద్వేషము. హృదయమూ, వివేకమూ, విచక్షణశక్తీ లోతయిన దృష్టి వున్నవాడికి తప్ప, తదితరులకు చలం అర్థంకాడు అర్థంకాకనే ఈ కడుపుమంట, ఏడుపు.

ఈనాడు దేశంలో కవులూ, కవిత్వాలూ కోకొల్లలు. భాషా, మాటలు వచ్చేసరికి కవులై కూర్చుంటున్నారు చాలా మంది. ప్రజానడవడికి అనుగుణంగా, సరిపడినసత్యం (అది సత్యం కాకపోయినా, మనుష్యులకి వికాసాన్ని ఇవ్వకపోయినా) చెప్పినవాడే కవియై, వారి మెప్పునీ, కీర్తినీ, ధనాన్నీ పొందుతున్నాడు. ప్రజనిబుంచి లోతయిన సత్యం చెప్పినవాడు, ప్రజలకి దూరమవుటయేగాక, వారి దూషణకి, తిరస్కారానికీ, బహిష్కరణకి లోనై, బాధల్లోకి పోతున్నాడు. ఆ సత్యానికి ప్రజలు అంధులుగనుక, కనబడినా కళ్ళుమూసుకుంటున్నారు గనుక, భరించలేరుగనుక. మానవ ప్రకృతి బహువిచిత్ర మయినది. అనేకరంగులు, రూపాలూగలది. ఎప్పుడేరూపం దాలుస్తుందో, ఏ రంగు పూసుకుంటుందో ఆమహికే తెలీదు. తెలుసుకోడానికి సాధ్యంకాదు. పరిణామాలవల్ల పరిస్థితులవల్ల బయట పడతాయి. ఈ మనస్సు అగాధాల్ని, అంతు తెలీని లోతుల్ని, అందులో దాగివున్న గుణాల్ని, కోరికల్ని రూపాల్ని, రంగుల్ని మనస్సుగల అసలువాడికి తనలో అవి వున్నాయని తెలీకపోయినా, తెలిసికొనుటకు సాధ్యంకాక పోయినా, మనో పరిశోధనతో దాని లోతుల్ని పరికించిన కవి

మాత్రం తెలుసుకుంటాడు. తెలుసుకొని తనరచనల్లో చూపు తాడు. అది చదివి లోకం విస్తుపోతుంది. అసంభవమూ, అబద్ధమూ అంటుంది కాదు, తన అనుభవం అంటాడు కవి. తాను తెలుసుకున్న సత్యమవుటచే.

మనస్సుని మించిన సత్యం ఆత్మది. అది మనస్సు కెరుకపడదు. అది అనుభవమేగాని. బయటకు చెప్పడానికి ఏమీలేదు, సాధ్యంగానిది అవుటచే. ఏనాడయినా ప్రజని సుభపచాలని. వికాసాన్నివ్వాలని, దిద్దాలని, మార్చాలని, ప్రయత్నించి సత్యం చెప్పిన (అది ప్రజల ప్రవర్తనకి అను గుణంగా వుండక, సరిపడనియెడల) వాడికీ తిప్పలూ గతులు తప్పవు. తన త్యాగనిరతితో దేన్నీ ఆశించకుండా, కోర కుండా, లక్ష్యపెట్టకుండా, తాను తెలుసుకుని, అనుష్ఠించి, అనుభవించిన సత్యాన్ని, లోకానికి అందివ్వాలని బోధపర చినవాడు. ఏ యుగానికో పుడతాడు. సత్యాన్ని తెలుసు కొనుటకు, అనుష్ఠించుటకు, దాన్ని లోకానికి అందించుటకు ఎన్నో పాట్లుపడాలి, బాధల్లో నిలవాలి. అన్ని బాధల్ని, ఇబ్బందుల్ని సంతోషంతో స్వీకరించి, సత్యబోధకుడు సత్యాన్ని బోధిస్తూనేవుంటాడు. అది అతనిపని, ధర్మమూ గనుక. బోధించకుండా వుండలేడు, అందుకే జన్మించాడు గనుక. ఆ త్యాగంలోనే, దీక్షలోనే అతని అభివృద్ధిగనుక. వాణ్ణి లోకం మన్నించదు, లెక్క చెయ్యదు, పైగా దూరంగా తరుముతుందికూడా. అయినా లొంగడు, లెక్క చెయ్యడు స్థిరంగా, ధైర్యంగానిలుస్తాడు. తన ఆశయాల్లో, సత్యంలో. లోకానికి కావాలసింద తనకి అనుగుణంగాప్రగని,

అప్పటి నడవడికి సరిపడే సత్యం. అది చెప్పిన కవుల్నీ, బోధకుల్నీ మెచ్చుకుంటుంది, అంగీకరిస్తుంది. ఇది గ్రహించి, హృదయశుద్ధి, బలమూ లేని, తాము చెప్పిన సత్యంలో తామే నిలవలేని, సత్యమేదో తెలీని, లోతుగా చూడలేని కవులూ, బోధకులూ ప్రజకి అనుగుణంగానే తమ రాతల్నీ, బోధల్నీ సాగిస్తారు. వారికి కావలసింది ప్రజలనుంచి మన్ననలూ, కీర్తీ, డబ్బూ గనుక—లోకం మారడానికి అంగీకరించరు. వీళ్ళూ ఆ ప్రయత్నాలు చెయ్యరు. నిజమైన కవీ బోధకుడూ లోకకల్యాణం కోరేవాడు గనుక ఎన్ని అగచాట్లు, నిందలు అయినా పడతాడుగాని తన అంతస్తునించి, ఆశయాలనుంచి, సత్యంనుంచి దిగజారుటకు అంగీకరించడు. ఎప్పుడూ లోకాన్ని మార్చడానికి, వెలుగులోకి, అభివృద్ధిలోకి తీసుకపోవడానికి ఆ ప్రయత్నాలు చేస్తూనే వుంటాడు

లోకానికి చాలా అవసరం కవులూ, బోధకులూ. వీళ్ళే కళని జ్ఞానాన్ని, సత్యాన్ని లోకం కళ్ళముందు వుంచేది. హృదయాల్ని మార్చి, పట్టిన మట్టిని కడిగి స్వచ్ఛపరిచేది వీళ్ళే మనుష్యుల్ని మేలుకొలిపి, కళలోకి సత్యంలోకి, జ్ఞానంలోకి, సౌందర్యంలోకి తీసుకుపోయేది వీళ్ళే. వీళ్ళే సృష్టిసౌందర్యాన్ని లోకం కళ్ళముందు వుంచేది వీళ్ళే మనుష్యుల హృదయాల్లో స్థిరస్థాయిగా నిలిచి, వాళ్ళకి నడిపేది వీళ్ళకొరకు ఎన్నో హృదయాలు ఎదురు చూస్తూవుంటాయి

ఏ కోరికకోలొంగి, ప్రజల మెప్పునీ, కీర్తినీ, ధనాన్ని ఆశించి రాతలు రాయకూడదు. వాళ్ళే ఎక్కువ ఈనాడు

దేశంలో. వీళ్ళకి రాతలోనేగాని, అనుభవంలో, అనుష్ఠించడంలో ఏదీ లేదు. సత్యమూ తెలీదు అంతా నటన, డాంబికం. నిజమైన రచయిత దేన్నీ కోరడు, ఆశించడు. తనలోపల పుట్టే ఉద్రేకాన్ని, తీవ్రతని, అనుభవాన్ని, పాడే పాటల్ని, మార్పుల్ని, రంగుల్ని కాగితంమీద పెట్టి, లోకానికి తెలియజేసి, ఆ రాతలోనుంచే ఎంతో సంతృప్తినీ, సంతోషాన్ని పొందుతాడు అందుకోసమే బతుకుతాడు, రాస్తాడు. తన అనుభవాల్ని, తెలుసుకున్న సత్యాన్ని తన రాతలు ద్వారా వెల్లడిచేస్తాడు. అదే అతనిపని. అందుకోసమే పుడతాడు. తన రాతలుద్వారా మనుష్యుల్ని కదిపి, వూపి, ఉద్రేకాన్ని, ఉత్తేజాన్ని చైతన్యాన్ని, ఆలోచల్ని కలుగజేసి, కొత్తదనంలోకి మార్చి, విచక్షణశక్తిని, దూరపు హెచ్చును ఇచ్చిన రచయితయే నిజమైన రచయిత. ఇతనివల్లనే లోకానికి ఏనాడయిన మేలుకలిగేది

అటువంటిరచయిత రచనలు చదివిన హృదయం వికసించి, పరవశత్వం చెందుతుంది. కవి బోధకుడూ నూతనత్వాన్ని మార్పునీ కోరతాడు. ఎందుకయినా సిద్ధపడమంటాడు. అది లోకానికి ఇష్టపడదు. భయపడుతుందికూడా. అప్పుడే వీరికీ, వారికీ తంటా.

కవిగాని, బోధకుడుగాని, ఓ సత్యాన్ని అంగీకరించాలి. తమ రచనలోగాని, బోధలోగాని, తాము అనుష్ఠించి, అనుభవించి తెలుసుకున్న సత్యాన్నే లోకానికి తెలియజేయాలిగాని [illegible] తెలుసుకోని [illegible]లో

అనుభవంలో లేనిది అయిన సత్యాన్ని తెలియజేయకూడదు. వారి సత్ప్రవర్తనలోనే వారికి అభివృద్ధి వెలుగూ.

సత్యం చెప్పవలసివచ్చినప్పుడు చలం జంకడు, భయపడడు—సూటిగా, రూక్షిగా చెప్పేస్తాడు. అది మనుష్యులకి గట్టిగా తగిలి, చకితుల్ని నిశ్చేష్టుల్ని చేసి భయమూ బాధా కలిగిస్తుంది. దానితో ప్రజలకి దూరమయినాడు చలం.

ఆ దూరమవడంలో, ఒంటరితనం నిస్సహాయస్థితిలో, దూషణ తిరస్కారాలలో, బీదరికం బాధలలో ఎంత నలిగిపోతున్నా, తన సత్యంలో, స్వేచ్ఛలో, స్థిరుడై, ధైర్యుడై నిలిచి, ఆత్మని కాపాడుకొని, విశాలత్వం చేసుకొని ఎన్నో సౌందర్యపు కలలుగని, ఎంతో అన్వేషణ సాగించి సత్యాల్ని తెలుసుకున్నాడు చలం ఇందుకొరకు తన జీవితాన్ని అర్పించాడు.

జీవితపు అర్థంమాట, సత్యం తెలీనిమాట అటుంచి, తన బాధలేగాక, లోకపు బాధలు, ముఖ్యంగా స్త్రీ, శిశువు, అనాథ. దీన, పతితుల బాధలు పట్టుకొని పీడించాయి చలాన్ని పరుల బాధలు తనకి బాధై, చూసి ఓర్వలేని, భరించలేని బాధ అది. అందులోపడి అతని హృదయం కాలిపోయి, కరిగిపోయింది. ఆధ్యాత్మికంలోకి వచ్చి, సత్యం తెలుసుకున్నతరవాత శాంతిపడి గట్టిపడిందేమో !

ఈ జీవితంగురించి, లోకప్రతీరుగురించి, ఈ బాధలు గురించి సత్యమేదో తెలీక, తెలుసుకుందామని ఎంతో తపించి [illegible]

అందుకే అంత ఆవేశం చూపేడు. చివరికి అతని అన్వేషణ ఫలించి సత్యం తెలిసింది ముఖ్యం భగవాన్ దర్శనంతో.

తన సత్యాన్వేషణతో కూడిన, తన సిద్ధాన్తాల ప్రచారంలో, లోకంమీద యుద్ధం ప్రకటించవలసివచ్చి, లోక విరోధియై, ఎందరో ప్రతికక్షుల్ని ఎదుర్కోవలసివచ్చింది చలం. అనన్యమైన భాషాబలంతో, భావసంపదతో, సత్యబలంతో, దీక్షతో, అనుభవాలతో వారిని ఎదుర్కొన్నాడు ఏమీ చలించకుండా, తనని తాను నమ్మిన పూర్తి విశ్వాసంతో—ఎందరో, ఎంతో బలంతో, పాతకొత్త సిద్ధాన్తాలతో మీదకు వచ్చినా చలాన్ని సడలింపలేక, భేదించలేక, మార్చలేకపోయినారు. చలం ఆత్మబలం, అనుభవాలు, సిద్ధాన్తాలు అంత గొప్పవి. సత్యమైనవి అవుటచే.

నా అనుభవాలకి, ఆలోచనలకి, భావాలకి అనుగుణంగా, నా హృదయంలోకి పలికేడు చలం. అందుకే చలమన్న నాకంతఇష్టం. గురువుగా ఎన్నుకొనుట.

పేరుకి పదవికి డబ్బుకి ఎగబడుతూ, పైపై మెరుగుల్ని చూసి సంతృప్తి పడుతున్న మనుష్యులు, సత్యాన్ని, సౌందర్యాన్ని, హృదయాన్ని, లోతయిన దానిగొప్పఅనుభవాల్ని చూడలేక, తెలుసుకోలేక పోతున్నారు. ఆవిలువల్ని ఎప్పుడో మూలకినెట్టి, పూర్తిగా మరిచిపోయి, మరిదగ్గరికి రాకుండా చేసుకున్నారు. అందుకేలోకం ఇంత కంపు కొడుతూవుంది. ఎవరయినా మరమత్తుచేసి, శుభ్ర పరచడానికి వచ్చేడా! వాణ్ణి తరుముతుంది.

నాకే చెప్పదగిన చదువువుండి, భాషా, మాటలూ తెలిసివుండిన, చలాన్ని ఎంతో గొప్పగా చిత్రించివుందును. ఓ పుస్తకమే రాసివుందును.

చలంగారికి జగ్గారావు ఎన్నో ఉత్తరాలు రాశాడు. తాను నేర్చింది తెలుసుకున్నది, అనుభవించిందీ తెలుపుతూ ఎన్నో విషయాల్ని చర్చించుతూ ఎన్నో సందేహాల్నికూడా తెలుపుతూ ఆ రాతలోనుంచి ఎంతో సంతృప్తినీ, సంతోషాన్ని పొందాడు చలానికి ఉత్తరం రాయడం సరదా, సంతోషం జగ్గారావుకి. చలంనుంచి ఉత్తరం వచ్చినరోజు, పండుగే. సూటిగా హృదయంలోకి పలికి, ఎన్నో సత్యాల్ని తెలిపిన ఆ ఉత్తరం అంత గొప్పగావుండేది. అనుకున్న రోజుకి చలంనుంచి ఉత్తరం వచ్చేది. ఎవరికయినా ప్రతి ఉత్తరానికీ చలం వెంటనే సమాధానం రాస్తాడు. చలంలో అదొక ప్రత్యేకత రోజూ చాలా ఉత్తరాలు. ఈ ఉత్తరాల రాతకి ఎంతో శ్రమపడి, ఓపిక తెచ్చుకొని కాలాన్ని, ధనాన్ని వ్యయంచేయుచున్నాడు చలం. ఈ ఉత్తరాలద్వారా చాలామంది మిత్రులకి ఆధ్యాత్మిక సందేహాల్ని, సత్యాల్ని, జ్ఞానాన్ని పంచుతున్నాడు. వాటిని అందుకున్నవారిలో నే నొకణ్ణి.

కృష్ణాపత్రికలోని ఉత్తరాలు చదివి, చలం ఉత్తరాలతో పాటు, నావీ ప్రకటనవున్న బావుండును అన్నారు మిత్రులు. అవును. బాగుండునేమో! చలం అంతటివాడికి రాసానే ఈ దేశంలో [illegible]

నావంటి సామాన్యుణ్ణి ఎవరు చూస్తారు? ఉత్తరాలతోపాటు నావీ వున్న, అచ్చువేయరేమోనని భయపడి నా ఉత్తరాన్ని తీసివేశాను.

చలాన్ని చూసి మాట్లాడినవారు, మరి మరవలేరు. చలం పలుకులలో అంత సత్యం. చూపులో అంత చల్లదనం సదావుంటుంది.

మీ

వరిందువ జగ్గారావు.



—o0o—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B192 |
| పుస్తకం పేరు | శ్రీరమణస్థాన్ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 241 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 13, |
| లేని పేజీలు | 1to6 |
| తయారు చేసినవది | NO |
| పేజీలు విడదీసినవది | [illegible] |
| స్కాన్ చేసినవది | [illegible] |
| పరీక్ష చేసినవది | ROHITH |
| పేజీలు సరిచూసినవది | |
| బైండింగు చేసినవది | |
| ప్యాకింగు చేసినవది | |
| పరిస్థితి | good |